# చతుర

ఏప్రిల్ 2015
రూ. 15/-





# భామనే.. సత్యభామనే..!



- అమెరికా నెక్స్ట్ టాప్ మోడల్‌గా రెండు సార్లు ఎంపికైందామె. ప్రయాణాలు చేయడం, సెల్ఫీస్ తీయడం అంటే ఎంతో సరదా ఆమెకు. ఇంతకీ ఆ బాలీవుడ్ భామ ఎవరు? ఆమె సౌందర్య రహస్యాలేంటి?
- పొట్ట తగ్గాలంటే..?
- పచ్చిమామిడితో చలువనిచ్చే పానీయం..! తెలుసుకోవాలనుకుంటున్నారా?

చలో పేజీ నెం. 122.

– సంపాదకులు

సంపుటి -38,
సంచిక - 3
447వ సంచిక,
పేజీలు : 132, ఏప్రిల్ 2015

# చతుర



సేకరణ : ఎం. కావ్య
పుస్తకాలంకరణ : రాజు యాట

**'ఎ**క్కడివీ సమోసాలు?'
భర్త బంగార్రాజును గద్దించింది, ఆఫీసు నుండి వచ్చిన భాగ్యలక్ష్మి.
'నేనే సుందరిగారి కిచెన్‌లో చేశాను' మెల్లగా చెప్పాడు బంగార్రాజు.
'రుచి బాగా కుదిరిందని ఈ నాలుగు సమోసాలు మీ చేతిలో పెట్టిందా? కష్టపడి చేసినందుకు ఎంత ముట్టచెప్పిందేంటి? ఇకనేం, సాఫ్టువేరు ఉద్యోగం పోయిందని బాధపడక వంట వాడి అవతారమెత్తి ఒక హోటల్ పెట్టండి, డబ్బే డబ్బు!'
వెటకారంగా అంది భాగ్యలక్ష్మి.
ఆ తర్వాతేమైంది?
ఇంతకీ బంగార్రాజు సుందరి ఇంట్లో సమోసాలు ఎందుకు చేశాడు?
ఆర్థికమాంద్యం కారణంగా సాఫ్ట్‌వేర్ ఉద్యోగంకోల్పోయినవారి ఇతివృత్తంగా ఆద్యంతం హాస్యపు జల్లుల్లో తడిపే **ఎ.వి. రెడ్డి శాస్త్రి** నవల
**నిరుద్యోగ రమణీయం**
చతుర ఏప్రిల్ కానుక!
6వ పేజీలో..



'నేను తెచ్చిన లాప్‌టాప్ ఏమైంది? దాన్నిగానీ అమ్మేసి సమోసాలు, స్వీట్లు చేసి తినిపించారా మీ సుందరికి?' ఇంట్లో సిస్టమ్ కనపడకపోవడంతో హేళనగా భర్తను అడిగింది భాగ్యలక్ష్మి.

'నాకు గొప్ప ఉపకారం చేసింది సుందరి. దాన్ని అర్థం చేసుకునే శక్తి నీకు లేదులే! నువ్విచ్చిన లాప్‌టాప్‌ని కృతజ్ఞతా సూచకంగా ఆ సుందరికి బహుమతిగా ఇచ్చాను' చెప్పాడు బంగార్రాజు.

అంతే! తోకతొక్కిన తాచే అయింది భాగ్యలక్ష్మి!

'నువ్వు ఏం చేస్తావో నాకు తెలియదు, సాయంకాలంలోగా నా లాప్‌టాప్ నాకు చేరాలి' అల్టిమేటం జారీ చేసింది భాగ్యలక్ష్మి.

బిక్కమొగం వేశాడు బంగార్రాజు.

సుందరికిచ్చిన లాప్‌టాప్‌ను తిరిగి తెచ్చాడా? ఇంతకీ సుందరి బంగార్రాజుకు చేసిన ఉపకారమేంటి? ఆద్యంతం హాస్యవ్యంగ్యాలు పండించే ఎ.వి.రెడ్డిశాస్త్రి నవల **నిరుద్యోగ రమణీయం** చతుర ఏప్రిల్ కానుక!



మొగుడ్ని చూస్తుంటే ఆశ్చర్యం వేస్తోంది భాగ్యలక్ష్మికి. ఉద్యోగం పోయిందని రవ్వంత కూడా ఏమీ బాధ పడ్డం లేదు! పైపెచ్చు 'శని విరగడయింది' అన్న ధోరణి కనిపిస్తోంది.. అతగాడి ముఖంలోను, ప్రవర్తనలోను. ఇంతకు పూర్వం అతగాడు నవ్వగా ఏనాడూ చూడ్లేదు తను. కానీ ఇప్పుడో! ఎంతో ప్రస న్నంగా చిరునవ్వుతో కనిపిస్తున్నాడు. ఉండబట్టలేక అడిగేసింది "ఏమిటీ? చిరు నవ్వులు ఒలకపోస్తున్నారు ఈ మధ్యని? ఇంతకుముందు ఎప్పుడూ ఏదో బాధలో ఉన్నట్టే కనిపిస్తుండేవారు కదా? "

"ఉద్యోగం బరువు బాధ్యతలు నన్ను ఏనాడైనా నవ్వనిచ్చేవా ఏవిటి? "

"మరి ఇప్పుడెందుకు నవ్వుతున్నారు? "

"ఏ క్షణంలో ఉద్యోగం ఊడబీకి, ఇంటికి పొమ్మంటాడో బాసు మొగుడని ఇరవై నాలుగ్గంటలూ ఒకటే వర్రీగా వుండేది"

"మరిప్పుడా బాధలేదు కదా! అంచేత కాబోలు, ముఖంలోంచి బాధ కూడా మాయమైపోయింది. అదిసరేగానీ, నిత్యం ఈ నవ్వుముఖం మాటేమిటి? "

"నువ్వు మరీనోయ్! ఏమీ ఎరగనట్టు, నా నోటంటే చెప్పించాలని చూస్తున్నావ్! ఇన్నాళ్ళు ఉద్యోగం వెలిగించేను కదా! ప్రోపర్ బాడీ లాంగ్వేజ్ నేర్చుకోకపోతే ఎలా చెప్పు? బాసుని మెప్పించాలి కదా!"

"ఉద్యోగం పోయింది కదా! మరి బాసె వరిప్పుడు? "

"కమాన్! తెలియనట్లు మాట్లాడకు. ఇప్పుడు నువ్వే బాసువి! ఎలాగూ భార్యలు భర్తలమీద బాసులే! కానీ ఆమాటని బాహాటంగా బయటికంటే, స్త్రీవాదులంతా కర్రలు పట్టుకొని వస్తారు నా మీదికి. నిజం ఎలావున్నా భర్తలందరూ భార్యల్ని వేపుకుతింటున్నారనేది కదా వారి వాదం! సరే! ఆ డిబేటుని పొడిగించకుండా ప్రస్తుతానికి వస్తే, బాసు ముందు నవ్వుతూ కన పడాలన్నది కదా మనం నేర్చుకున్న బాడీ లాంగ్వేజ్ టెక్నిక్!"

"అంటే? నేను బాసునా? "

"మరి! రెండురకాలుగా బాసువి. భార్యగా బాసువి! ఇప్పుడు ఫేమిలీ బ్రెడ్ విన్నరుగా నాకు తిండి పెడుతున్న బాసువి! 'వీధిలోకెళ్ళి మూటలు మోసో, రిక్షా నడిపో నీ తిండికి కావలసిన నాలుగు రూపాయిలూ సంపాదించి మరీ ఇంట్లో అడుగు పెట్టు' అని తరిమెయ్యకుండా, నన్నింట్లోనే వుండనిచ్చి, తిండి పెడుతున్నందుకు.. కనీసం కృతజ్ఞతకైనా, నీ ముందు నవ్వుముఖంతో కనిపించాలి కదా!"

"అంతేనా! లేక బ్లాగులో ఏ సుందరైనా ప్రపోజ్ చేస్తే, ఆ రసకందాయాన్ని తలచు కొని ఊహల లోకంలో తేలిపోతున్నారా? "

తుళ్లిపడ్డాడు ఆమాట విని. కానీ ఇన్నాళ్ల బాడీ లాంగ్వేజ్ ట్రెయినింగ్ ఉత్తినే పోతుందా! తుళ్లింత బయటపడకుండా జాగ్రత్తపడ్డాడు.

తెల్లారిన తర్వాత కాసేపటికి సుష్టుగా టిఫిన్ లాగించి, కాఫీ తాగి, సిగరెట్ వెలి గించుకొని, కంప్యూటర్ ముందు సెటిలవు తుంటాడు. ఇక అక్కడ్నుంచి వెబ్‌సైట్లని జల్లెడ పట్టేస్తుంటాడు.. ఎక్కడ అందమైన ఫిగర్లు తారసపడతాయా? అని. నెట్ ధర్మాన అన్నిరకాల అంగనామణుల్ని, అన్నిరకాల ఆహార్యాలని తీరిగ్గా దర్శించగ లుగుతున్నాడు, మనసులోనే అందాల విశ్లే షణ జరుపుకుంటూ.

'నేను నెట్లో ఈ రకంగా అమ్మాయిల్ని వీక్షిస్తున్న వైనం ఈవిడకెలా తెలిసిపో యింది చెప్మా? ' అని మనసులోనే ఆశ్చర్య పడుతూ, "అబ్బే! నేనలాటి పన్లేవీ చెయ్యడం లేదు. ఉద్యోగావకాశాలు ఎక్క డేనా తారసపడతాయేమోనని వెబ్‌సైట్లని గాలిస్తున్నాను, అంతే" అన్నాడు.

"మహానుభావా! బుకాయించకండి! నిన్న సాయంత్రం కాస్త పెందరాళే ఆఫీసు

# మీ జుట్టు రాలిపోతుందా ? ప్లేట్‌లెట్ రిచ్ ప్లాస్మా దీనికి సరైన పరిష్కారం!



డా. దీపిక నర్రా
(MD Dermatology)
కన్సల్టెంట్ డెర్మటాలజిస్ట్

అందమైన, ఒత్తైన శిరోజాలను మనలో ప్రతి ఒక్కరు కోరుకుంటారు. వాస్తవానికి ఇది సాధ్యమేనా ? నేడు పొద్దు పొడిచినప్పటి నుండి పొద్దువాలేలోపు తలపై ఏమాత్రం వెంట్రుకలు మిగులుతాయోనన్న భయం వెంటాడుతున్నది. అధికంగా జుట్టు రాలడం లేదా బట్టతల వల్ల కోల్పోయిన జుట్టుని తిరిగి పొందుటకు మార్గాలు ఏమిటి ? జుట్టుకి కావాల్సిన ఐరన్, బి12, థైరాయిడ్, ఇతర హార్మోన్లు ఏమైనా తక్కువగా ఉంటే సరిదిద్దుకొంటూ రాలిపోయిన జుట్టును తిరిగి పొందటానికి Platelet rich plasma వంటి stimulation పద్ధతులతో ప్రయత్నించవచ్చు. Oliva అడ్వాన్స్‌డ్ హెయిర్ అండ్ స్కిన్ క్లినిక్స్‌కు చెందిన కన్సల్టెంట్ డర్మటాలజిస్ట్ డా. దీపిక ఇలా అన్నారు. "Oliva లో ప్యాటర్న్‌డ్ హెయిర్ లాస్ చికిత్సలో ప్లేట్‌లెట్ రిచ్ ప్లాస్మా ఇంజెక్షన్లతో పాటు టాపికల్ మినాక్సిడిల్ వాడతారు. ఈ విధానంలో బట్టతల గల వ్యక్తి నుండి మేము కొంత రక్తం సేకరిస్తాము. సెంట్రల్ డిఫ్యూజన్ తర్వాత ప్లేట్‌లెట్ రిచ్ ప్లాస్మాను వేరు చేస్తారు. ఈ ప్లేట్‌లెట్లలో వృద్ధి కారకాలు, వాస్క్యులర్ ఎండోథెలియల్ వృద్ధి కారకాలు మరియు రూపాంతరం చెందే వృద్ధి కారకాల నుండి వచ్చిన ప్లేట్ లెట్లు సమృద్ధిగా ఉంటాయి. ఇవి మీ జుట్టు ఒత్తుగా, దృఢంగా పెరుగుటకు మరియు ఆరోగ్యవంతంగా కన్పించుటకు దోహదపడతాయి. ఇది వైద్య చికిత్స ద్వారా మీ జుట్టు యొక్క పెరుగుదల మరియు ఆరోగ్యాన్ని పెంపొదిస్తుంది. ఎట్టి దుష్ఫలితాలు లేవు మరియు ఇన్ఫెక్షన్లకు అవకాశమే లేదు. మంచి ఫలితాల కోసం నెలవారీ అంతరాలలో సాధారణంగా ఎనిమిది సెషన్లు ఆచరించవలెను". మీరు కోల్పోయిన జుట్టును తిరిగి పొందటానికి సమర్థవంతమైన మరియు సురక్షితమైన పరిష్కారమార్గమిది.

**ఫీమేల్ ప్యాటర్న్‌డ్ హెయిర్ లాస్**



**మేల్ ప్యాటర్న్‌డ్ హెయిర్ లాస్**



**ఈ ట్రీట్‌మెంట్‌కు సుమారుగా 35,000 నుండి 50,000 వరకు ఖర్చు అవుతుంది.**

నుండొచ్చేను. నేను తలుపులు తీస్తున్నా, కిచెన్లో కాఫీకప్పుల చప్పుడు చేస్తున్నా, కమ్మని కాఫీవాసన ముక్కులో దూరి కిత కితలు పెడుతున్నా, అబ్బే! మీరేమి చలిం చకుండా, మీయోగ సమాధిలో వున్నారు. 'కొంపతీసి-తీరుబడి దొరికింది కదా! అని ఇతగాడు ధ్యానం ప్రాక్టీసు మొదలెట్టేడా?' అని భయపడిపోతూ, చేతిలో కాఫీకప్పుతో మీవెనకాతల వచ్చి చూద్దును కదా! ఒంటిన బట్ట అన్న ప్రసక్తే లేకుండా- ఇప్పుడే సముద్రస్నానం ముగించి-కెరటాల నుంచి నేరుగా మీ ముందుకు నడుచుకొ స్తున్నట్టున్న ఓ అందాల చిన్నది కనిపిం చింది. తొలిసారిగా స్త్రీల అందాన్ని దర్శి స్తున్న రుష్యశృంగుడిలా- మీరు కళ్లార్ప కుండా ఆ అమ్మాయి అందాల్ని జుర్రుతు న్నారు. నేను పక్కనున్న కుర్చీలో కూల బడి మీ కోసం తెచ్చిన కాఫీ కూడా నేనే తాగేసి, నిశ్శబ్దంగా కూర్చున్నాను. ధ్యానం లోంచి బయట పడక పోతరా ఎప్పటి కేనా? అప్పుడే కనుక్కుందాం కథాకమా మిషు అని!"

ఈ 'ఎదురు దాడి'కి ఏమాత్రం తడబడ లేదు అతగాడు. ఈ రకంగా ఇబ్బంది పెట్టే సన్నివేశాలు ఎన్నో ఎన్నో వచ్చేయి నిన్న మొన్నటి దాకా వెలగబెట్టిన ఉద్యో గంలో! అలాంటి సన్నివేశాల నుండి బయ టపడే బోలెడు గమ్మతుల్ని నేర్పింది కార్పొ రేట్ సెక్టర్. బిజినెస్ స్కిల్స్, పీపుల్స్ స్కిల్స్.. ఇలా రకరకాల పేర్లుపెట్టి. అంచేత, ఏ మాత్రం తడబడకుండా యూ ఆర్ మిస్టేకెన్ మైడియర్! ఎడ్వర్టయిజ మెంట్ టెక్నిక్ మాస్టర్ చెయ్యడానికి అదొక ప్రయత్నం. వాటిని వ్యూ చేస్తుంటే థాట్ ప్రొవోకింగ్ సబ్జెక్ట్ ఏదైనా దొరక్క పోతుందా అని ఆశ- అంతే!"

"అలాగా! మరి ప్రస్తుతం ఖాళీగానే వున్నారు కదా! ఇప్పుడు ఆ సబ్జెక్ట్‌ని మరీ అంత లోతుగా స్టడీ చెయ్యవలసిన అవ సరం ఏమిటొచ్చిందీ?" అంది భాగ్య లక్ష్మి.. మాటల్ని నొక్కవలసిన దగ్గర నొక్కుతూ.

"మొదటిది- ప్రస్తుతం నాకు ఉద్యోగం లేనిమాట నిజమే! కానీ భవిష్యత్తులో ఇంకో ఉద్యోగం దొరక్కపోదు కదా! తీరా వుద్యోగం వచ్చింతర్వాత ఉరుకులూ పరు గులూ మధ్యని మనం తీరిగ్గా స్టడీ చెయ్యా డానికి సబ్జెక్ట్, ఆపర్చ్యునిటీ ఇవేవీ దొరికి చావవు కదా! నాలెడ్జ్ ఎప్పుడు ఇంప్రూవ్ అవుతుందీ? మనం కూల్‌గా ఆలోచిం చడానికి వీలున్నప్పుడే కుదురుతుంది, అవునా? అలాంటి అవకాశం వచ్చింది ప్పుడు. బాసుకి రోజువారీ రిపోర్టులూ, టార్గెట్లు మీటవడాలూ, ఎకౌంటబిలిటీలు.. ఇలాటి టెన్షన్ల మధ్య లీజర్లీగా సబ్జెక్ట్‌ని అభివృద్ధి చేసుకోడం ఎలాకుదురుతుంది.. నువ్వే చెప్పు! 'కూల్ కంటెప్లేషన్, లీజర్లీ పర్స్యూట్' కనీసం ఇలాంటి మాటల్ని తల్చుకోడానికేనా అవుతుందా? బంగారు గుడ్లుపెట్టే బాతులాంటి భార్యవి నువ్వుండ బట్టి, ఈ నిరుద్యోగ పర్వంలో కూడా నిత్యం 'టెన్షన్' అన్న మాట లేకుండా బతు క్కురాగలుగుతున్నాను. ఈ ప్రపంచ ఆర్థిక మాంద్యం కాదుగానీ, ఉద్యోగాలు పోవడం ఇవాళా, రేపా అని నిత్యం టెన్షన్లతో బతు కుతున్న వాళ్లకి దేని మీద మనసు లగ్నం అవుతుంది చెప్పు?"

"నగ్న సుందరీమణుల్ని దర్శిస్తూ టెన్ష న్లని తగ్గించుకోవచ్చు కదా!"

వాక్యాన్ని సాగదీసి మరీ భార్యవేసిన చురక చురుక్కుమనే తగిలింది బంగార్రా జుకి. అయితే, అవసరమైనప్పుడల్లా చర్మపు మందాన్ని తగినంతగా పెంచుకునే స్కిల్ కూడా కార్పొరేటర్ సెక్టర్ నేర్పిం చిందే కదా! చురకని ఏమాత్రం పట్టించు కోకుండా, సౌందర్య అధ్యయనం గురించి తన అభిప్రాయాల్ని మరింత వివరంగా చెప్పడానికి వుద్యమిస్తున్న భర్తని ఆపి,

# వింత సెలవు రోజులు

సెలవు దినం అంటే ఎవరికైనా ఇష్టమే. ప్రతి సెలవుకి ఏదో ఓ కారణం ఉంటుంది. కానీ ఈ రోజుకీ కొన్ని వింత కారణాలకి ఈ కింది సెలవులు కొనసాగుతున్నాయి.

★ న్యూజెర్సీలోని ప్రిన్స్‌టన్‌లో ప్రతి మార్చి రెండో ఆదివారం 'పిస్సింగ్ డే'గా సెలవు పాటిస్తారు. అమెరికన్ తిరుగుబాటు సమయంలో పారిపోతున్న బ్రిటిష్ సైన్యం మీద అమెరికన్ సైనికులు మూత్రం పోశారు. దాని జ్ఞాపకార్థం ఈ సెలవు దినాన్ని పాటిస్తున్నారు. ఆ రోజు వీధుల్లో ప్రజలు మూత్రం పోస్తారు.



★ ఇండోనేషియాలోని బాలిలో వారి నూతన సంవత్సరం రోజు (21 మార్చి)ను 'నైపీ డే'గా జరుపుకుంటారు. నైపీ అంటే నిశ్శబ్దం అని అర్థం. ఆరోజు పని చేయరు. ఆడరు, మాట్లాడరు. ఉదయం ఆరు నుంచి సాయంత్రం ఆరు దాకా వంట చేయరు. విమానాశ్రయాలు కూడా మూసేస్తారు. వీధులన్నీ ఖాళీగా ఉంటాయి. హిందువుల సెలవుగా ఆ రోజు దేవుడు, ఆత్మ గురించి ఆలోచిస్తారు.

★ థాయ్‌లాండ్‌లోని లాప్‌బురీలో నవంబరు ఆఖరి ఆదివారం 'పాప్రాంగ్ సేమ్‌యోట్' ఆలయంలో కోతుల కోసం విందుని ఏర్పాటు చేస్తారు. ఆరోజు వందల కొద్దీ కోతులు అక్కడికి వస్తాయి. ఆ సందర్భంగా సెలవు ప్రకటిస్తారు.

★ ఏప్రిల్ మొదటి వారంలో ఓరోజు జపాన్‌లోని కవాసాకీ అనే చోట పురుషాంగ ఉత్సవాన్ని జరుపుకునే సందర్భంలో సెలవుని పాటిస్తారు. 17వ శతాబ్దంలో వేశ్యలు తమకి సుఖవ్యాధులు రాకూడదని ఇక్కడి ఆలయంలో ప్రార్థించేవారు. ప్రస్తుతం ఆ ఉత్సవ ఆదాయాన్ని హెచ్ఐవీ రీసెర్చ్‌కి ఖర్చు చేస్తున్నారు.

★ బెర్ముడాలో మే 24న 'బెర్ముడా షార్ట్స్ డే'ని పాటిస్తారు. ఆరోజు అందరూ బెర్ముడా షార్ట్స్‌నే ధరిస్తారు. అది అధికారిక సెలవు దినం.

★ 'యూఎన్ఓ గుర్తించిన వరల్డ్ టాయ్‌లెట్ డే'ని నవంబరు 19న 20 దేశాలు అధికారికంగా సెలవిచ్చి జరుపుకుంటున్నాయి. ప్రపంచంలోని 300 కోట్ల మందికి మరుగుదొడ్లు లభించే దాకా దీనిని జరుపుతారు.

---

భాగ్యలక్ష్మి "మహానుభావా! నేరకపోయి ఆ గుడ్డల్లేని ఎర్రగుంట ప్రసక్తి తెచ్చేను. ఇవతల నాకు ఆకలి దహించేస్తోంది, తిండానికేదేనా చేశారా? లేక హోటలుకెళ్లి తిని రమ్మంటారా?" అంది.

దాంతో, ఎంతో లలిత స్వరంలోకి గొంతుని మార్చేస్తూ "అమ్మమ్మ! ఎంతమాటన్నావు! ఆఫీసు నుంచి అలసి సొలసి వస్తావని ఊహించలేనంత దద్దమ్మనా నేను? అందుకని కమ్మని ఉప్మా చేసేను.. జీడిపప్పు, నెయ్యి వేసి. ఉల్లిపాయల ధర ఆకాశం అంత ఎత్తులో ఉన్నప్పటికీ, నీకిష్టమని ఓ రెండు ఉల్లిపాయలు కూడా వేసేను" అన్నాడు బంగార్రాజు.

"చెడ్డకాపరానికి ముప్పేమిటి? చంద్రకాంతలొండు అన్నాట్ట వెనకటికి మీలాటి మొగుడే"

"ఛాఛా! నేనలాంటి బలాదూరు మనిషిలా కనిపిస్తున్నానా నీ కంటికి? ఆదాయం లేకుండా పోయిందే అని అనుక్షణం నేనెంతలా ఫీలవుతున్నానో నీకేం తెలుసు? సిగ్గుతో సినిమాకి వెళ్లడం కూడా మానుకున్నాను, బోలెడు ఖర్చని"

"సినిమాలకి వెళ్లకపోతేనేం! నెట్లో

కంటికి నదరుగా కనిపించే భామల్ని చూస్తూనే వున్నారు కదా! వీలుపడకుండా వుందిగానీ, ఆ నగ్న సుందర్లందర్నీ సజీవంగా డౌన్‌లోడ్ చేసి మీ చుట్టూ నిలబెట్టుకుని మరీస్టడీ చేసేవారేమో కదా! కృష్ణుడి రాసక్రీడ సన్నివేశంలాగ"

కోపం వచ్చింది బంగార్రాజుకి. లేకపోతే, కోపం వచ్చినట్టు నటించకపోతే బాగుండదనుకున్నాడో ఏమిటో? సర్రున లేచి పోయి-

"ఐ ప్రొటెస్ట్, యూ ఆర్ ఇన్‌సల్టింగ్ మి. ఐ డోన్ట్ టేక్ టిఫెన్" అనేసి బయటికి పోబోయాడు.

"తిట్టాలన్నా, కోప్పడాలన్నా, ప్రేమ రహస్యాలు చెప్పాలన్నా- ఈ దిక్కుమాలిన ఇంగ్లీషుని మించిన కమ్యూనికేషన్ టూల్ మరొకటి లేదు సుమండీ! నిజం! రుచి చూస్తూ చూస్తూ అప్పుడే ఫుల్లుగా లాగించేసే వుంటారు. లేకపోతే నెయ్యి, జీడిపప్పు, ఉల్లిపాయ వేసిన ఉప్మా తినకుండా మిమ్మల్ని ఆపడం బ్రహ్మకేనా సాధ్యమా!"

నిజంగా ముఖం కందగడ్డలా చేస్కొని బయటికి వెళ్లిపోయాడు బంగార్రాజు. మొగుడ్ని నానా అల్లరి పెట్టగలిగినందుకు మురిసిపోతూ, ఘటోత్కచుడి మాదిరి ఉప్మా బాణలిని ముందుకి లాక్కొని, తిండం ఆరంభించింది. తింటూనే, ఏదో ఏక్షనుప్లానుని మనసులోనే రూపుదిద్దుతూ, మురిసిపోయింది భాగ్యలక్ష్మి.

మర్నాడు పొద్దున్నే యథాప్రకారం బంగార్రాజు స్నానాదికాలు కానిచ్చి, టిఫిను ముగించి, మంచి డ్రెస్ వేసుకొని, కంప్యూటర్ ముందు సెటిలవాలని వచ్చేటప్పటికి కంప్యూటర్ లేదు, ఖాళీ టేబులు మాత్రం వుంది. ఆ ఖాళీ టేబుల్ని చూసేటప్పటికి చెప్పలేనంత నిస్పృహ, దుఃఖం ముంచుకొచ్చేశాయి బంగార్రాజుకి. ఎన్నెన్ని ఆశలతో వచ్చేడు కంప్యూటర్ ఉన్న గదిలోకి! వేయి వూహలతో, వేయి ఆశలతో గదిలోకి వస్తే, కంప్యూటర్ లేకుండా టేబులు బోసిగా స్వాగతం పలికింది. కొద్దిసేపైన తరవాత వక్రంగా, వ్యంగ్యంగా నవ్వుకుంటూ, రంగప్రవేశం చేసిన భాగ్యలక్ష్మికి బిక్కమొహం వేస్కొని, ఏడుపొక్కటే తక్కువగా కనిపిస్తున్న మొగుడ్ని చూసేటప్పటికి నవ్వు రెట్టింపయ్యింది.

ఉక్రోషం ఆపుకోలేక బంగార్రాజు "ఏమిటి నీ ఉద్దేశం? నాకున్న ఈ ఒక్క కాలక్షేపం కూడా లేకుండా చేసేసి, నేను పిచ్చెక్కి ఏడుస్తూ వుంటే చూడాలనా నీ సంకల్పం? " అన్నాడు.

"రామరామా! అదేం కాదండీ! ఉత్తపుణ్యానికి మిమ్మల్ని ఏడిపిస్తే, నాకేం వస్తుంది చెప్పండి? కొంచెం డబ్బుకరువు రోజుల్లో వున్నాం కదా! ఆ కంప్యూటర్కి బోలెడు డబ్బిస్తానని వచ్చేడు, వాడెవడో సైబర్ కేఫ్‌వాడట"

మౌనంగా పళ్లు నూరాడు బంగార్రాజు.

"ప్రస్తుతానికి మీకు సీరియస్ వర్కంటూ ఏమీలేదు, డబ్బిస్తానంటున్నాడు అందుకని ఇచ్చేశాను. ఈ సాఫ్ట్‌వేర్ ఉద్యోగాలు ఊడిపోతుండడంతో, ఇంటర్నెట్ సెంటర్ల వాళ్ల బిజినెస్ మూడుపువ్వులూ ఆరుకాయలుగా వుందట. సాఫ్ట్‌వేర్ వుద్యోగాలకోసం వెదుకులాడుతున్న వాళ్ళు తండోపతండాలుగా వచ్చేస్తున్నారట. నెట్ బ్రౌజింగుకి.. ఉద్యోగాల వేట. ఔనూ, మీరు కూడా ఓ ఇంటర్నెట్ కేఫ్‌నో, ఓ ఇంటర్నెట్ బార్నోతెరవకూడదూ? పుణ్యం, పురుషార్థం.. రెండూను. మీరు మీ వివస్త్ర భామల్ని ఎడతెరిపిలేకుండా అలా చూస్తూ కూర్చోవచ్చు మీరు చేసే సత్కాలక్షేపం కష్టమర్లకి కూడా మప్పేరంటే.. ఇక చూడండి! బిజినెస్సే బిజినెస్సు! ముప్ఫయి ఇంటర్నెట్లూ, అరవై అర్ధనగ్న భామలుగా వెలిగిపోతుంది.. పోలీస్ రెయిడ్స్ జరక్కుండా జాగ్రత్తపడాలిగానీ. పన్లోపనిగా ఈ బిజినెస్‌కి ఒక బారుని కూడా ఎటాచ్చేసి, నలుగురు



# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టిపెట్టాలి. హాస్య, వ్యంగ్య సహా ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర నవల' అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీనికి అనుగుణంగా రచయితలు నవలల్ని రాసి పంపాలి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు తిప్పి పంపేందుకు వీలుగా తగినన్ని స్టాంపులు అంటించిన సొంత చిరునామా గల కవరు జతపరచాలి. స్టాంపులు అంటించని నవలలు ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి.

★ నవలలపై నిర్ణయం తెలియజేయడానికి 6-8 వారాలు పడుతుంది. ఫోన్/ ఎస్సెమ్మెస్/ ఈమెయిల్ ద్వారా మా నిర్ణయాన్ని తెలియజేస్తాం. గడువులోగా సమాచారం అందకపోతే మమ్మల్ని సంప్రదించవచ్చు.

★ నవలతోపాటు మీ చిరునామా, ఫోన్ నెంబరు, ఈ మెయిల్ వివరాలు స్పష్టంగా రాయాలి.

★ సంపాదకులను ఉద్దేశించి 'హామీ పత్రం' తప్పనిసరిగా పంపాలి. హామీ పత్రం లేని నవలలు పరిశీలించలేమని మనవి.

## నమూనా హామీ పత్రం

సంపాదకులు చతుర!

ఫలానా నవలను 'చతుర'లో ప్రచురణార్థం పంపుతున్నాను. ఈ నవల నా సొంతం. దేనికీ అనువాదం కాదు. ఒకవేళ అనువాదమైతే (అనువాద నవల ఫలానా భాషా రచయితది (రచయిత పేరు). ఫలానా పబ్లిషర్‌నుంచి, ఫలానా భాషలో స్వీకరించి అనువదించాను).

ఈ నవలను ఇంతవరకూ ఏ పత్రికకూ పంపలేదు. ఏ పత్రిక పరిశీలనలోనూ లేదు. ఏ వెబ్‌సైట్, బ్లాగులో కానీ ప్రచురితం కాలేదు. ఈ అనువాద నవలకు మూల రచయిత/రచయిత్రి/ ప్రచురణకర్తల నుంచి అనుమతి పొందాను/ పొందలేదు. ప్రచురణకు స్వీకరించని పక్షంలో తిప్పి పంపటానికి స్టాంపులు అంటించిన కవరు జతపరిచాను/లేదు.

తేదీ:

స్థలం: సంతకం:

**చిరునామా :** ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082
ఫోన్ : 23318181, Ext: 6658, 6532 ఈ మెయిల్:vipula.chatura@gmail.com

జెస్సికా లాల్ లాంటి బార్ టెండర్లని పెట్టే రంటే- ఇక మనం వెనక్కి తిరిగి చూసే పనే వుండదు"

"నాకు వుద్యోగం పోవడం కాదుగానీ, నీ దృష్టిలో ఎంత చీపయిపోయేను!"

"అదేంవిటండీ? ఉన్నమాటంటే ఉలిక్కి పడి ఏడుపు మొహం పెడతారు! పోనీ, మరో నిజాయితీ అయిన కాలక్షేపం ఉద్యోగం చెప్పనా? ఓ రెండు గేదెల్ని కొంటాను. వాటి ఆలనా పాలనా చూస్తారా? వాటికి కుడితి పెట్టడం, పాలు తియ్యడం, మేతకి తీసికెళ్లడం, పేడ తీయ్యడం, పిడకలు చరచడం.. మరి తీరికన్న మాటే వుండదు. ఓ రకంగా ప్రజా సేవ.. నిజాయితీ అయిన కాలక్షేపం. మధ్యాహ్నంపూట, ఓ గోనె, కొడవలి పట్టుకొని, రియాల్టీల వాళ్లు ఇప్పటికీ ఇంకా కబళించకుండా మిగిల్చిన పొలాలంట తిరిగి, గడ్డి కొయ్యొచ్చు"

దాడిని మరి తట్టుకోలేకపోయాడు బంగార్రాజు. నిజంగానే కోపం వచ్చేసింది తగాడికి. ఉన్నపళంగా లేచిపోయి, బుసలు కొడుతూ బయటికి వెళ్ళిపోయేడు. వెళ్లిపోతున్న మొగుడ్ని చూస్తూ భాగ్యలక్ష్మి "ఇవాళ ఒకపూటే ఆఫీసు. రెండుకొచ్చేస్తాను. మంచి కూరా, సాంబారు చేసి, అప్పడాలు వేయించి వుంచండి! కరకరలాడుతూ వుండాలి సుమండీ!" అని హుకుం జారీచేసింది అతగాడికి వినపడేటట్లు.

రుసరుసలాడుతూ, బుసలు కొడుతూ బయటికి విసవిసా నడిచాడు బంగార్రాజు.

బయటికి వెళ్లాడేగాని, ఎక్కడికని వెళ్ళడం? చుట్టూవున్న కాంక్రీటు దిమ్మల్లాటి బిల్డింగుల్ని, చెదరగొట్టిన పుట్టలోంచి బయటికి వచ్చేస్తున్న చీమల గుంపులా కదులుతున్న వాహనాల్ని చూస్తూ 'ఛీఛీ! మనిషి ఎలాంటి బందీ అయిపోయేడు! ఆఫీసో, లేకపోతే ఇల్లో.. రెండు రకాల జైళ్ళు. ఆఫీసుకి వెళ్లడం, ఇంటికి రావడం. ఇవి కూడా పనిష్మెంట్లో భాగాలయిపోయేయి. ఉద్యోగం పోతే, ఓ జైలు తక్కువై ఒక్క ఇంటి జైల్లోనే నిరంతరం ఎలా కూర్చోడమో తెలీక సతమతమైపోతున్నాడు మనిషి. ఓర్నాయనోర్నాయనో! జైలు జీవితానికి ఎంతలా అలవాటు పడిపోయేం! ఒక్కరోజేనా జైల్లో వుండకుండా బతగ్గలగడం అన్న అలవాటు తప్పిపోయిందే! ఈ ప్రపంచమంతా ఓ అండమాన్ సెల్యులర్ జైలిప్పుడు, ఎటు తిరగడానికీ చోటు కనిపించడం లేదు. ఎక్కడా ఒక్కపార్కు లేదు, ఒక్క మైదానం లేదు.. కాసేపు నిలబడి గాలి పీల్చుకోడానికి గానీ, ఆలోచించుకోడానికి గానీ. ఎక్కడా ఓ చెట్ల తోపు లేదు, ఒక వాటర్ ఫ్రంట్ లేదు. ఎటు చూసినా ఫ్లాట్లు! ఇదంతా గ్లోబల్ సంస్కృతిట! దిక్కుమాలిన సంస్కృతి!' అని, ఈ ప్రపంచం గురించీ, జీవితం గురించీ స్వగతించుకుంటూ, ఓ అరగంట అటూ ఇటూ తిరిగి, ఈసురోమంటూ ఇల్లు చేరుకున్నాడు బంగార్రాజు. అతని బుర్ర నిండా ఆలోచన్లు. వర్తమానంలోకి దృష్టి సారించి చూస్తే, ప్రపంచ చిత్రం మరింత విషాదంగా దర్శనమిచ్చింది.

'యాంత్రిక కాలక్షేపానికి కూడా అవకాశం ఇవ్వకుండా చేస్తున్న భార్య. కానీ, ఆమెని ఏమనడానికీ వీల్లేకుండా పోయింది, పరిస్థితులు పెడుతున్న ఇరకాటంవల్ల. ఆవిడ్ని మాత్రమే తప్పుపట్టి ఏంలాభం? అందరు కార్పొరేటు బాసులు చేస్తున్న పని ఈవిడా చేసింది.. నవ్విస్తూ నాలికని తెగ్గొయ్యటం. ఉద్యోగం పోయిందే అనే వ్యధ ఓపక్క నుండి వుండులా సలిపేస్తోంది. ఏదో ఉపశమనంలా వుంటుందని, ఇంటర్నెట్లో జీవంలేని బొమ్మల్ని చూస్తుంటే, ఆ కాస్త ఆనందమేనా వీడికెందుకు మిగల్నివ్వాలని గుట్టు చప్పుడు కాకుండా ఆ కంప్యూటర్ని అమ్మి పారేసింది, భార్య రూపంలోనే వున్న ఈ

## చరిత్రలో కలిసిపోయిన ఉద్యోగాలు

చతుర సమాచారం

వందేళ్ల క్రితం యూరప్‌లో గల అనేక ఉద్యోగాలు నేడు పూర్తిగా మృగ్యం అయ్యాయి. అలా చరిత్రలో కలిసిపోయిన ఉద్యోగాలు..

★ అలారం గడియారాలు కనిపెట్టక మునుపు యూరప్‌లో ఉదయం తలుపుకొట్టి నిద్రలేపే ఉద్యోగస్థులు ఉండేవారు. కిటికీ లోంచి బఠాణీలతో కొట్టి నిద్ర లేపేవారు.

★ చెరువులు చలికాలంలో గడ్డ కట్టిన ప్పుడు పైన మంచుని కోసి అమ్మే ఉద్యోగాలు ఉండేవి. ఫ్రిజ్ కనిపెట్టాక అవి మాయమ య్యాయి.

★ యూరప్‌లో ఎలుకలని చంపే ఉద్యో గాలు ఉండేవి. నగరాల్లో ఎలుకల సంతతి పెరగకుండా వీరిని నియమించేవారు.

★ విద్యుత్ వీధి దీపాలు రాకమునుపు ఉద్యోగస్థులు రాత్రి వీధిదీపాలు వెలిగించి, పగలు ఆర్పేవారు. ఇప్పుడా ఉద్యోగాలు లేవు.

★ డిజిటల్ టెలిఫోన్స్ రాకమునుపు స్విచ్ బోర్డు ఆపరేటర్స్ టెలిఫోన్ కాల్స్‌ని కనెక్ట్ చేసే ఉద్యోగంలో ఉండేవారు.

★ ఫ్యాక్టరీ ఉద్యోగస్థులకు ట్రేడ్ యూని యన్ సాహిత్యాన్ని చదివి, వినిపించే ఉద్యోగ స్థులుండేవారు. ఇప్పుడందరికీ చదువు వచ్చు.

★ రాడార్ కనిపెట్టక మునుపు శత్రు విమానాల శబ్దాలని పరికరాల ద్వారా విని హెచ్చరించే ఉద్యోగులు కొందరు ఉండేవారు.

★ పాలశుద్ధి, నిల్వ పద్ధతులు కనిపెట్టక మునుపు ఇళ్లకి వచ్చి పాలుపోసే ఉద్యోగస్థులు ఉండేవారు. ఈ ఉద్యోగాలు యూరప్‌లో పూర్తిగా మాయమ య్యాయి. (మన దేశంలో ఇలాంటివి ఇంకా



ఉన్నాయి)

★ లారీలు కనిపెట్టక మునుపు కలపని నదుల్లోకి తోసి కావలసిన చోట మళ్లీ వాటిని ప్రవాహం నుంచి సేకరించే ఉద్యోగస్థులు ఉండేవారు.

★ ట్రాఫిక్ లైట్లు కనిపెట్టక మునుపు ట్రాఫిక్ పోలీసు కానిస్టేబుళ్లు ఉండేవారు. మన దేశంలో వాళ్లు ఇంకా ఉన్నారు కాని పాశ్చాత్య దేశాల్లో లేరు.

---

డొమెస్టిక్ కార్పొరేట్ బాస్. ఏం చెయ్యాలి ప్పుడు? ఎలా గడపాలీ కదలని కాలాన్ని?' అని ఆలోచిస్తూనే, నిరాసక్తంగా వంట చేసేడు బంగార్రాజు, భార్య కోరిన రుచులన్నిట్నీ.

భోజనాల టేబులు దగ్గర మామూలు తంతే.. తిండి కూడా యాంత్రికంగా, చకచకా ముగించవలసిన కార్యక్రమం. వంటకాల్ని ఆనందిస్తూ తినడానికి గానీ, భోజనం చేస్తూ నాలుగు మాటలు సర దాగా మాట్లాడుకోడానికి గానీ టైమ్ మేనే జ్‌మెంట్ సూత్రం వీలు కలిగించదే! భాగ్యలక్ష్మి చకచకా భోజనం ముగించి ఆఫీసుకి వెళ్లిపోయింది, కారెక్కి. అనుకో కుండా ఆఫీసులో ఏదో అర్జంటు పని తగి లిందట.

'ఇక తనేం చెయాలి?' అదీ బంగార్రా జుని వేధిస్తున్న సమస్య. పనీపాటా లేకుండా తను ఇంట్లో పడివుండడం, భార్య కారెక్కి ఉద్యోగానికి వెళ్ళిపోడం చాలా ఈర్ష్యగా వుంది కూడా. కాలుకాలిన పిల్లిలా గదిలో అటూ ఇటూ పచార్లు చేసి చేసి, యాంత్రికంగా బాల్కనీలోకి వచ్చేడు. పక్క వాళ్ల బాల్కనీ వైపు చూసేడు.

ఫ్లాట్లన్నీ అగ్గిపెట్టెల్ని వరసగా పేర్చడం అనే ప్రిన్సిపుల్ మీదనే నిర్మిస్తారు కాబోలు.. పక్కవాళ్ల బాల్కనీ, బంగార్రాజు గారి బాల్కనీకి ఇంచుమించు తగులుతు

న్నట్టే వుంది.

బాల్కనీలోకి వచ్చి పక్కవాటా బాల్కనీ లోకి చూశాడు. ఆశ్చర్యంతో తిరగబడి పోయినంత పనయింది బంగా(రాజుకి. పక్కింటావిడ, ఆవిడ పేరేమిటో తెలుసుకో డానికి కూడా అవలేదు ఇన్నాళ్లూ, ఉద్యోగం వత్తిడి వల్ల. ఏవయ్యుంటుంది చెప్మా ఆవిడ పేరు? చండీదాసుగారి 'స్వప్నరాగ లీన..' అయుంటుందా? లేక తన చచ్చు ఊహలకి తట్టిన పేరు 'స్వప్నసుందరి' అయి వుంటుందా? ఇంత అందమయిన స్త్రీలు కూడా వుంటారా లోకంలో? ఇలాంటి అందాలరాసి పక్క ఫ్లాటులోనే వుంటుంటే, ఇవాల్టి వరకూ ఆమెని చూడ లేకపోయిన తనకంటే గుడ్డివాడు లోకంలో ఎవడుంటాడు? అయినా తామీ ఫ్లాట్లోకి వచ్చి ఇంకా కొద్దిరోజులే కదా అయింది! అంచేత ఈ దివ్యసౌందర్యాన్ని చూడలేక పోవడమనే విషయంలో జరిగిన సీరియస్ లాప్స్‌ని ఇగ్నోర్ చెయ్యక తప్పదు.

మేనర్స్ మరచిపోయి తనకేసి అలా మిడిగుడ్లు వేసుకు చూస్తున్న బంగా(రా జుని- "ఏమిటి సార్? బంగా(రాజుగారూ! ఏఁవిటంతలా చూస్తున్నారు నన్ను?" అంది పక్కింటావిడ.

ఈసారి మాత్రం ఎంతో శ్రమపడి నేర్చు కున్న బాడీ లాంగ్వేజ్ స్కిల్ ఒక్కటీ గుర్తుకురాలేదు బంగా(రాజుకి. అంచేతనే కాబోలు, 'ఏఁవిటి అంతలా చూస్తున్నారు నన్ను?' అని ఆవిడ వేసిన ప్రశ్న విని తుళ్లిపడ్డాడు. తుళ్లింత దేనికంటే 'ఈవిడకి నా పేరెలా తెలిసిందీ? ఇలాంటి అందాల రాసిని పక్క ఫ్లాట్లోనే పెట్టుకొని, నల్లసుం దర్ల దగ్గర్నుండి నానా రంగుల సుందర్లనీ నెట్‌లో చూస్తూ కాలం గడిపేస్తున్నానేఁ విటి ఈవిడెవరోగానీ తనని అంత చొర వగా పేరుపెట్టి మరీ ప్రశ్న సంధించిం దంటే, తన జాతకం, ఉద్యోగం పోయి ఇంటిపట్టునే వుండడం, పెళ్లాంకి వేళకింత వుడకేసి ఉప్పగా చప్పగా వండి పెడుతుం డడం వగయిరా వగయిరా భోగట్టాలన్నీ కూడా తెలిసిపోయాయా ఏమిటి చెప్మా?' అని మనసులోనే అనుకుంటూ, ప్రకాశంగా "అబ్బెబ్బే! పనేంలేదు కదండీ! ఉద్యోగం ఊడిపోయింది. అంచేత అన్నిట్నీ తేరిపార చూస్తున్నాను ఆత్రంగా ఎక్కడేనా, ఏదేనా ఉద్యోగావకాశం కనిపిస్తుందేమోనని" అన్నాడు. అనేశాక 'అబ్బ! సమయోచిత జ్ఞానం తిరిగి వచ్చేసినట్టుందే' అని మనసు లోనే ఓమారు వీపుని చరుచుకున్నాడు.

"మరీ నన్నంతలా చూస్తున్నారు ఏదే నా ఉద్యోగావకాశం కనిపిస్తోందేఁవిటి?"

ఇబ్బందికరమైన ప్రశ్న. మరోడు మరోడు అయితే, నీళ్ళు నఁవిలి దొరికి పోయి వుండేవాడు. కానీ బంగా(రాజు చాలా తెలివైనవాడు. అంచేత చాలా సమ యోచితంగా "ఎంత మంచి ప్రశ్నవేశారు! దానికి జవాబు చెప్పడానికి ముందు, ఓమాటంటాను మీరేమీ అనుకోనంటే"

"ఏమీ అనుకోను, చెప్పండి!"

"మిమ్మల్ని అలా చూస్తూ కూర్చోడం చాలా గొప్ప ఉద్యోగం! కాదంటారా?"

"ఫర్వాలేదు! ఇలాంటి ఉద్యోగం మీకు సులువుగానే దొరుకుతుంది. ఎంచేతనంటే నాక్కూడా ఉద్యోగం పోయి ఇంటి పట్టునే వుంటున్నాను. పైగా, నాకు వంటింట్లో కూర్చోడఁవంటే చచ్చేంత చికాకు"

## కొత్తగాలి...

**అమ్మబాస నేర్చుకో!**
**అదే గట్టి పునాదని తెలుసుకో!**
**అమ్మబాస నమ్ముకో!**
**అభివృద్ధి పథం అందుకో!!**

– అంబటి వెంకట శివారెడ్డి,
యర్రగుంట్ల, కడప జిల్లా

"అమ్మమ్మా! కలీనరీ ఆర్ట్‌ని మరీ అంత తేలికగా కొట్టిపారేయకండి! ఆఫ్టరాల్! 'కోటి విద్యలూ కూటికోసమే' అని కదండీ మన పెద్దవాళ్ళన్నది! ఎంత సంపాదించి ఏంలాభం? 'ఆకలో లక్ష్మణా!' అని అన్నాల బల్ల దగ్గర కూర్చున్నప్పుడు గంజి కూడులాంటి భోజనం పెడితే, ప్రాణం ఎంత వుసూరంటుందో ఆలోచించండి! షడ్రుచులూ అక్కర్లేదు, నాలిక తుప్పు పట్ట కుండా రెండంటేరెండు కమ్మని వంటకాలు టేబులు మీద వుంటే చాలదటండీ! ఆత్మా రాముడు శాంతించడానికి!"

"మీ మాటలు వింటుంటే, నోరూరి పోతోంది బంగార్రాజుగారూ! మీకు పాకశా స్త్రంలో ప్రావీణ్యమే వున్నట్టనిపిస్తోందే!"

"అంత మరీ నలభీముల్ని తలపించేంత స్కిల్లేం కాదుగానీ, ఫరవాలేదు, ఓ మాదిరిగా, బాగానే చెయ్యగలను. ఈ స్కిల్ వుండ బట్టేనేమో? మా భాగ్యలక్ష్మి నన్ను బాగా చూస్కుంటోంది, నా వుద్యోగం పోయినా!"

"అవునూ! ఇలాంటి స్కిల్ మీ చేతిలో వుండగా, వుద్యోగం పోయిందని మీరెం దుకు బాధ పడిపోవాలీ? మీకు ఈ 'వంటా- వార్పూ' టెక్నిక్ బాగానే పట్టుబ డిందంటున్నారు కదా! 'కంప్యూటర్ జనరే టెడ్ కుకీస్' అనో లేకపోతే అలాటిదే మరోటో ఓ మాంచి సాఫ్టువేర్ తయారు చేసి లోకం మీదికొదలకూడదూ! రసగుల్లా జూస్లాగ డబ్బు స్వీట్‌గా బేసిన్లకొద్దీ వచ్చి పడిపోతుందే!"

బంగార్రాజుకి ఎవరో సుతారంగా మెత్త టి చెప్పుతో కొట్టినట్టనిపించింది, ఈ మాటలు వినేప్పటికి. కొంపతీసి ఈవిడ నన్ను ఆటపట్టించడంలేదు కదా! అని అనుమానం వచ్చిందతగాడికి. ఆలోచిస్తే

చిన్న వ్యంగ్యం కూడా వినిపిస్తోంది ఈవిడ మాటల తీరులో. సరే, టేబుళ్లు తిరగ వెయ్యడానికి ఓ ప్రయత్నం చేసి చూద్దాం అని సంకల్పించినవాడై-

"మరి మీకు వంట రోత అంటున్నారు, వంటలో నేర్పులేదంటున్నారు, మీ శ్రీవారు కూడా నాలాగ గరిట తిప్పడం చేస్తుంటా రేమిటి? "

"అయ్యోరామ! అతగాడికి వండడమూ రాదు, తినడమూ రాదు. పశువు ముందు ఏది పడేసినా ఎలా తినేస్తుంటుందో చూడండి! అదే బాపతు మా ఆయన. వంట ఎంత దరిద్రంగా వున్నా, దాని గురించి ఏనాడూ ఎలాటి కామెంటూ చేసిన పాపాన పోలేదు పిచ్చితండ్రి! అందుకే అతగాడంటే నాకు చచ్చేంత ఇష్టం! పైగా, సరైన తిండిలేక ఏమయిపో తాడో? ఎక్కడికేనా వెళ్తే..? అనే బెంగ కూడా లేకుండా చేసేసేడు నాకు. ఎవరు ఏది పెట్టినా కిక్కురుమనకుండా తినగలిగే స్థితప్రజ్ఞుడు మా ఆయన"

"అంటే ఆయన వంట చేసి మిమ్మల్ని ఇబ్బంది పెట్టే ప్రసక్తే లేదంటారు, అంతేనా? "

"అంతేకదా మరి! భోజనం పెట్టకపో యినా అలా కూర్చుంటాడు గానీ, పోనీ ఓమారు పొయ్యి వెలిగించి చూద్దాం? అని కూడా ఆలోచించని పరమబద్ధకస్తుడు. సమయాసమయాలు సవ్యంగా లేకపోయి నప్పుడు హోటళ్లలో దొరికే ఏ గడ్డేనా మేసి బతికేస్తాడుగానీ, భోజనం లేదే అని ఏడవడు"

ఆవబారింది బంగార్రాజుకి, 'తను వంట చేసి భార్యకి సుష్టుగా భోజనం పెడుతు న్నానని ఎద్దేవా చేస్తోందీవిడ' అని నిర్ధార ణకి వచ్చేశాడు బంగార్రాజు.

సన్నివేశం ఇలాటి స్థితిలో ఉన్న సమ యంలో, బంగార్రాజు భార్య ఆఫీసు నుండి వచ్చేసినదై, భర్తని ఎందునూ కానక, బాల్కనీలోకి వచ్చి, ఎదురుగా కనిపిస్తున్న దృశ్యాన్ని కాంచి, అలా నిలబడి పోయిందో క్షణం- ఖిన్నురాలై భర్తని చూస్తే, ఏదో తప్పు చేసినవాడ్లా బుర్ర వేలవేసుకొని నిల బడి వున్నాడు. తప్పు చేసివాడ్ని హేళన చేస్తున్న భంగిమలో కనిపిస్తోంది పొరు గింటి సుందరి. సదరు సుందరి ఎర్రతేలు లాంటిదని ఈవిడ నమ్మకం.

'చూడడానికే కాదు ఎర్రగా వుండేది, గుణాలకి కూడా ఎర్రతేలే' అనుకుంటుంది భాగ్యలక్ష్మి.

'కాకపోతే, ఇంకేవనుకోవాలి? వెబ్‌లో తప్ప నిజప్రపంచంలో ఏనాడూ పరస్త్రీలని కన్నెత్తి కూడా చూసివుండని తన బంగా రంలాంటి భర్తని, ఏ మాయమాటలు చెప్పి బురిడీ కొట్టించిందో? ఇలా బాల్కనీలో బుద్ధిమంతుడ్లా నిలబడి ఈవి డతో కబుర్లాడుతున్నాడు! బాల్కనీకి గ్రిల్ వుండి చచ్చిందిగానీ, లేకపోతే ఏకంగా తన బాల్కనీలోనే కూర్చోబెట్టేసుకొని చనువుగా వీపు మీద దరువు వేస్తూ మరీ కబుర్లు చెప్పడానికి కూడా జంకదు ఈ మాయ లాడి. దిక్కుమాలిన ఫ్లాట్లు.. ప్రయివసీ అన్నది లేకండా చేసేస్తున్నాయి' అని రుస రుసలాడుతూ పటపటా పళ్లు కొరికింది భాగ్యలక్ష్మి. కానీ ఆవిడ కూడా ఈ ముద నష్టపు కార్పొరేటు సెక్టారులో ఉద్యోగస్తురా లేకదా! మేనర్స్‌ని నేర్పేసి తీరుతాయి దిక్కుమాలిన వుద్యోగాలు. ఏడుపొచ్చే స్తున్నా, దాన్ని అదిమిపట్టి, నవ్వాలట! బోడి బాడీలాంగ్వేజ్ స్కిల్స్, దిక్కుమా లిన స్కిల్సా అని. అంచేత తన అక్కసుని ఏమాత్రం బయటపడనివ్వకుండా-

"ఏమిటి సుందరీ! తీరిగ్గా కూర్చొని కబు ర్లాడుతున్నావ్? ఆఫీసుకి వెళ్లలేదా ఏమిటి ఇవాళ? " అంది ఏ భోగట్టా తెలియని నంగనాచిలాగ.

సుందరి వుద్యోగానికి మంగళం అయి పోయిందని, ఆవిడ వుద్యోగం పోయిన

గంటలోనే తెలిసి పోయిందీవిడకి. అయినా తెలీనట్టు తను భోగట్టాలకోసం ఏనాడూ వెంపర్లాడే రకం కానట్టు ఫోజు!

సుందరికీ తెలుసు ఈ నాటకమంతా! అయినా అమాయకం నటిస్తూ, "ఇంకెక్కడి ఆఫీసు? అప్పుడే వారం రోజులయిందిగా ఉద్యోగం పోయి! దిక్కుమాలిన వుద్యోగం! పోతే పోయిందిగానీ, హాయిగా ప్రాణం తెరిపిన పడిందనుకో"

"అదా సంగతి! ఈ టైములో లక్షణంగా ఆఫీసులో వుండవలసిన మనిషేమిటి? ఇలా మా ఆయనతో పిచ్చాపాటీకి దిగిందీ! అని ఆశ్చర్యపోతున్నాను"

"ఆశ్చర్యం అంటే గుర్తొస్తోంది భాగ్యం! మీ ఆయన సింప్లీ టెరిఫిక్ అనుకో! ఎంత తియ్యగా చెప్తారనుకున్నావ్ కబుర్లు! సాంబారు బాగా చేస్తారట కదా! నాకో గిన్నెడు పంపిద్దూ! నా వంటతో మా ఆయన నాలిక తుప్పు పట్టేసిందంటున్నారు"

"సాంబారులో పడవలిసిన దినుసులన్నీ ఇవాళ పడ్లేదు. రేపు బాగా చేసి పంపిస్తాను"

సుందరి నిజమా అన్నట్లు చూసింది.

"అవును మేడమ్! నిజంగానే ఇవాళ పడవలసిన వస్తువులన్నీ పడలేదు. రేపు వెల్లుల్లి, వేయించిన గుమ్మడొడియాలూ, కేరట్ ముక్కలూ వేసి గుమ్మగా తయారుచేస్తాను"

"వాటితో పాటుగా మన పాత చెప్పు జోడు కూడా సన్నగా చెక్కుతరిగి, వెయ్యండి. మన టి.వి. పాకింగ్‌తో వచ్చిన అట్టడొక్కులేదూ! దానిని కూడా చిన్నముక్కలుగా తరిగి సాంబార్లో వెయ్యండి. కొబ్బరి పీచుకూడా వుంది కదా! గిన్నెల్తో మడం కోసం తెచ్చి వుంచేం! దాన్ని కూడా వేసి సాంబారు చేస్తే వుంటుందీ.. నములుతూ మరీ కబుర్లు చెప్పుకోవచ్చు" అంది భాగ్యలక్ష్మి మహా వ్యంగ్యంగా.

వ్యంగ్యాన్ని గ్రహించ లేనంత చవటేం కాదు కదా బంగార్రాజు! పౌరుషం తన్నుకు వస్తున్నా, దాన్ని హాస్యంలోకి మార్చాలి- 'పక్కింటావిడ ముందు తను పల్చనవకూడదు' అని తలపోసి స్వరానికి సజెస్టివ్‌గా వ్యంగ్యాన్ని జోడిస్తూ, "నిజవేనోయ్! బంగారూ! అవి కూడా వేస్తే ఎలా వుంటుందో సాంబారు రుచి? ఓమారు ట్రైచేసి చూద్దాం! వంటలూ, భోజనాలూ ఇవాళ ఈ పరిపక్వదశకి వచ్చేయంటే? అది ఎవరెవరు, ఎన్నెన్ని రకాలుగా చేసిన కృషి, ప్రయోగాల ఫలితం అయుంటుందో? ఆలోచించు!"

"అవును! మీదెప్పుడూ ప్రయోగాత్మక దృష్టే. పోనీ వంటల నాయకుడిగా సెటిలైపోకూడదూ? నలుగురికింత తిండి పెట్టి

> **కొత్తగాలి...**
>
> **పాత చదువులు**
> **జ్ఞానదాయకాలు**
> **కొత్త చదువులు**
> **వృత్తి సాధకాలు**
>
> *– డి. శ్రీనివాస దీక్షితులు,*
> *నరసరావు పేట, గుంటూరు జిల్లా*

నట్టూ వుంటుంది! మీ కొత్తకొత్త ప్రయోగాల్ని వెరిపై చేసుకోడానికి గినియా పిగ్స్‌గా కూడా బోలెడుమంది దొరుకుతారు. ఎటొచ్చీ మీ ప్రయోగాత్మక వంటలు వికటించి జనాలగ్గానీ ప్రాణహానొచ్చిందా? పోలీసులు పట్టుకుపోయి జైలు కుక్కగా వేసేసుకుంటారు"

భర్తగారికి ఇలా చురకలు బాగానే అంటించి- "పదండి! పదండి! ఆకలితో చస్తున్నాను! మీకేమీ చీమకుట్టినట్టైనా లేదు! ఖుషీగా నిలబడి మరీ సుందరితో బాతాఖానీ వేసుక్కూచున్నారు" అని ముక్తాయింపులో మరో చురక

అంటించింది.

దాంతో కాస్త బెదిరినవాడై, "బై! మేడమ్! రేపు వెరైటీగా సాంబారు చేస్తాను. మీరు రుచి చూద్దురుగాని!" అనేసి బయల్దేరిపోయేడు బంగార్రాజు భార్యా సహితుడై. వెళుతూ వెళుతూ భాగ్యలక్ష్మి "సుందరీ! ఏదో ప్రయోగం ప్లానుచేసి నిన్ను గినీపిగ్గా వాడుకుందామని సంకల్పించినట్టున్నాడు మా నాథుడు. ఆ న్యూ రెసిపీ హెల్తుకి ఎసరు పెడుతుందో? లైఫ్‌కే ఎసరుపెడుతుందో? రిస్క్ తీసుకోకు సుమీ! ఆ సాంబారుని టేస్ట్ చేసి నీకేదేనా అయితే శుకమహర్షిలాటి మీ ఆయన అవస్థలు పడిపోతారు! అంచేత దూకేముందు ఓమారు పరీక్షగా చూస్కొని మరీ దూకు"

సుందరి మనసులోనే దబదబ గుండె బాదుకుంది! 'ఏమి కపటి, ఏమి కపటి ఈ భాగ్యలక్ష్మి!' అనుకుని ప్రకాశంగా మాత్రం "పోనిద్దూ! ఉద్యోగం పోయి ఇంటిపట్టునే అఘోరిస్తున్నాను కదా! బంగార్రాజుగారు కొత్తరుచుల కోసం ప్రయోగాలు చేస్తానంటే చెయ్యనీ! అంతలో నా ఆరోగ్యం ఏమీ చెడిపోదు" అంటూ భాగ్యలక్ష్మికి దీటైన సమాధానం ఇచ్చింది.

'ఉద్యోగంపోయి ఇంటిపట్టునే అఘోరిస్తున్నాను' అన్న సుందరి మాట విని- 'ఆ!' అని మనసులోనే మ్రాన్పడిపోయి, ఇంచుమించు ఫెయింటయిపోయినట్టుగా ఫీలయిపోయింది భాగ్యలక్ష్మి. 'అంటే ఈ వన్నెలాడి సుందరి ఇక రోజస్తమానం బాల్కనీలోనే కూర్చొని కబుర్లు చెప్తుంటే, ఉద్యోగం లేకుండా ఇంట్లోనే కూర్చున్న తన మొగుడు దాని వలలో పడిపోకుండా వుంటాడా? అమ్మమ్మ! ఆ కంప్యూటర్ని అమ్మేసి ఎంత పొరపాటు చేసేసేను! ఆ అశ్లీలపు బొమ్మల్ని చూసుకుంటూ రాత్రీ పగలూ అనకుండా గదిలోనే కూర్చొని వుండేవాడు కదా! దాన్ని అమ్మేయడం కాదు గానీ కావాలని సుందరి సమక్షానికి తరిమినట్లయింది' అని ఖిన్నురాలై, పరిపరి విధంబుల కీడు శంకిస్తూ నీరసంగా నడిచింది, డైనింగు టేబుల్ దగ్గరకి. కానీ తింటున్న ముద్ద గొంతు దిగితేనా? 'అబ్బ! సాంబారు అదిరి పోయింది, నూలుగుండ కూర ఏం మజాగా వచ్చింది!' ఇలా, లొట్టలు వేస్తూ తను చేసిన వంటకాల్ని తనే తెగ మెచ్చేసుకుంటూ ఆబగా పదార్థాల్ని కబళిస్తున్నాడు బంగార్రాజు.




**భా**గ్యలక్ష్మి భయపడినంతా అయింది. 'నగ్నసుందరుల్ని కన్నార్పకుండా చూడ్డం తప్పిస్తే, మరింకే అభ్యంతరకరమైన పనుల్నీ చేసివుండని ఋష్యశృంగుడిలాటి తన భర్త బంగార్రాజు ఎప్పుడు చూసినా ఆ సుందరికి ఎదురుగా, తమ బాల్కనీలో, సదుపాయమైన కుర్చీలో కూర్చొని వికవికలూ.. పకపకలూను. 'నా మొగుడి జోలికి రాకు' అని నిష్కర్షగా అనడానికి కూడా వీలులేకుండా అయిపోయింది. ఆ సుందరి రాక్షసితో ఏ చిన్నమాట నోరుజారినా దెయ్యంలా మీద పడిపోయేటట్టు కనిపిస్తోంది దాని దూకుడు చూస్తుంటే! 'నీ భార్యని కాస్త అదుపు చెయ్యి!' అని దాని మొగుడికి చెప్పి చూస్తేనో..? ' ఇలా స్వగతంగా నానా రకాల పరిష్కారాలనీ అన్వేషిస్తున్న సమయంలో ఓ విడ్డూరం జరిగింది. సుందరి మొగుడు కూడా చేరేడు బాల్కనీ గ్రూపులో..! ఇప్పుడు ముగ్గురూ

కలిసి మరీ వికవికలూ పకపకలూను. పక్క ఫ్లాటు ఓనరు, తన భార్య సుందరి, పొరుగు ఫ్లాటులో వుంటున్న బంగార్రాజుతో నవ్వులూ పరాచికాలూ చేస్తుంటే, చూస్తూ సహించలేక భార్యని చచ్చేట్టు చీవాట్లు పెడతాడని ఆశించిన భాగ్యలక్ష్మి బాగా కంగుతింది, ఈ ఊహించని డెవలెప్మెంట్ చూసి. భార్యని అదుపులో పెట్టడం మాట అటుంచి, అతగాడూ తన భారీకాయంతో బాల్కనీలో సెటిలయిపోయి, మిగిలిన ఇద్దరితోనూ గొంతు కలిపి అనుక్షణం 'హాహా! హోహో!!' అని గొల్లున నవ్వుతుంటే బిక్కచచ్చిపోయి కుర్చీలో కూలబడవలసిన స్థితిపట్టింది భాగ్యలక్ష్మికి. మొగుడి మీద ఆడ ఈగవాలినా సహించలేనంత పొసెసివ్ నేచర్ ఆవిడది. మరి, ఆ సుందరి మొగుడేమిటి తన భార్య విరగబడి మరీ నవ్వుతూ, పక్కింటి బంగార్రాజుతో జోకులు వేస్తుంటే, సిగ్గులేని మొగంలా బడబడ నవ్వుతాడుగానీ 'ఇది తప్పు, అలా నువ్వు పరాయివాడితో పరాచికాలు ఆడకూడదు' అని చీవాట్లు పెట్టడే!

అప్పుడు తట్టింది భాగ్యలక్ష్మికి ఇతగాడూ ఆఫీసుకెళ్ళకుండా- బాల్కనీలోనే కూర్చొని కబుర్లు చెపుతున్నాడంటే, కొంప తీసి..! అదే నిజమయింది.

ఎప్పుడూ వెళ్లని భాగ్యలక్ష్మి బాల్కనీలోకి వెళ్లి, రాని నవ్వుని ముఖం నిండా పులుముకుంటూ, తనకి చేతకాని సోషియబిలిటీని ప్రదర్శిస్తూ "అవునూ! మీరు రెండు రోజులుగా ఆఫీసుకి వెళుతున్నట్టు లేదే? ఏదేనా హెల్త్ ప్రాబ్లమా?" అంది.

అతగాడు బడబడ నవ్వి, "హెల్త్‌కేమండీ! ఎన్నడూ లేనంత పెర్‌ఫెక్ట్‌గా వుంది. బంగార్రాజుగారు వంకాయ కొత్తిమీర కారం కూర, సాంబారు లాంటివి చేసిస్తుంటే, వాటిని తిన్నవాడికి ఆరోగ్యం పీక్ ఫామ్‌కి చేరుకోదుటండీ!"

"సంతోషంగా కబుర్లు చెప్పుకుంటూ, భోజనాన్ని ఆస్వాదిస్తూ తింటుండం కంటే ఇంకేం కావాలి, చెప్పండి, హెల్త్ పెర్‌ఫెక్ట్ కండిషన్‌లో మెయిన్‌టెయిన్ అవడానికి? ఇంతకీ, సరదాగా కబుర్లాడుకుంటూ ఎందుకూర్చున్నానని కదూ! మీ ప్రశ్న. పోయిందండీ! నా వుద్యోగం కూడా ఊడిపోయింది. అంచేత నేనూ, బంగార్రాజుగారూ, మా సుందరి.. మేం ముగ్గురం ఇప్పుడు ఆనంద నిరుద్యోగ పర్వంలో వున్నామన్న మాట! ఇంటిపట్టునే వుండి మా ఆవిడ చేసే వంటని క్రమం తప్పకుండా ఓవారం రోజులుగానీ భోజనం చేశానంటే చాలు, ఆస్పత్రికి పోవడం ఖాయం"

ఈ మాట అతగాడి నోటి నుండి వచ్చీ రాగానే, సుందరి అతగాడి వీపుమీద ఓ చరుపు చరిచింది.. కొంచెం సుతారంగానే! కానీ చరుపు చరుపే కదా!

"ఉన్నమాటంటే చెయ్యి చేసుకుంటావేమిటి?" అన్నాడు అతగాడు రోషాన్ని అభినయిస్తూ! అయితే, అది నిజం కోపం కాదనీ, సత్యభామ ముందు కృష్ణుడు బహుశా అభినయించిన అలక లాటిదేననీ చూసిన వాళ్లకి ఇట్టే అర్థమయిపోతుంది.

ఆ భార్యాభర్తల అన్యోన్యత చూసి ముచ్చటపడ్డాడు బంగార్రాజు. ఈ రకమైన ప్రణయ చరుపుల్ని.. 'సమాసం సరిగ్గా వున్నట్టు లేదే! ఏం దరిద్రమో? ఇంగ్లీషు మీడియం చదువులు కాదుగానీ మనభాషలో వున్న స్వారస్యం తెలుసుకోడానికి కూడా వీల్లేకుండా అయిపోయింది. సరస తెలుగు సమాసాలు కూడా వేళకి తట్టిచావడంలేదు..' అని మనసులో వాపోతూ, 'నా భార్య ఎప్పుడూ ఇట్లు చరిచి యుండలేదే..' అని స్వగతంగా అనుకున్నాడు బంగార్రాజు. 'సమాసాలు' అన్నమాట తట్టగానే సమోసాలు గుర్తొచ్చి 'అబ్బ! ఇలాటి సరదా సమయంలో సమోసాలు చేసుకు తింటుంటే ఎంత బాగుంటుందీ!'

అన్న ఆలోచన తట్టింది అతగాడికి. అలాగే చేస్కుందాం! ముందీ భార్యారత్నం ఆఫీసుకి దయచేస్తే తాపీగా సమోసాల్ని తయారుచేసి సుందరితోనీ, ఆమెభర్త బాబూరావుతోనీ కలిసి కూర్చొని వాటిని ఆరగిస్తూ, కబుర్లాడుతూ, మంచి టీ సేవి స్తుంటే అబ్బ! స్వర్గం బెత్తెడెత్తులోనే వున్న ట్టనిపించదూ!

భాగ్యలక్ష్మికి మాత్రం తలమీద ఇంతవ రకూ తను మోస్తున్న ఏదో భారం దిగిపో యినట్టనిపించి 'హమ్మయ్య! ఇక ఫర్వా లేదు' అనుకుంది చిన్నగా నవ్వుకుంటూ. సుందరి ఒక్కర్తే ఇంటి పట్టున వుంటే ఎక్కడ వీపుచరిచీ, తొడచరిచీ తన మొగుడ్ని పెంపుడు కుక్కలా తయారుచేసి తన చుట్టూ తిప్పుకుంటుందోనని భయ పడి చచ్చింది! ఇక ఇప్పుడా భయం అంతా మాయమైపోయింది, సుందరి మొగుడు కూడా ఇంటిపట్టునే అఘోరిస్తుంటాడు కనక. సొంత మొగుడి సమక్షంలో తన మొగుడి మీద చెయ్యివేసి సరసత ప్రదర్శిం చడానికి ధైర్యం చాలదు కదా! ఇంతలో ఆవిడకి మరో ఆలోచన వచ్చింది. వంట రాదని నెపం పెట్టుకొని ఈ సుందరి, దాని మొగుడూ తన మొగుడిచేత అడ్డమైన రుచులూ, వంటలూ చేయించుకొని లొట్టలు వేస్తూ తినరు కదా? అంటే దాని అర్థం తను నెల్లాళ్లకని కొనివుంచిన పప్పులూ ఉప్పులూ- వారం రోజుల్లోనే వూదెయ్యరు కదా? అసలే తన మొగుడు పొగడ్తలకి ఉబ్బిపోయే రకం. అందులో నూ ఆ వయ్యారి సుందరి కులుకులు పోతూ, రుచులు కోరితే, ఇంకేమన్నా వుందీ, కొంప వారం రోజుల్లో ఖాళీ అవడం ఖాయం! అసలే వాళ్లిద్దరికీ ఉద్యో గాలు లేవాయె! కనీసం తిండి ఖర్చయినా కలిసొస్తుంది కదా ఈ బంగారుబాబుని ఉబ్బించి వంటలు చేయించుకుంటే! ఈ కందిపప్పు కరువు రోజుల్లో రోజూ గిన్నెడు సాంబారంటే మాటలా? ఇల్లు దివాలా తియ్యడానికి ఆ ఒక్క ఐటెమ్ చాలదూ? అంచేత ఇలాటి విపత్కర పరిస్థితిలో తనేం చెయ్యాలి? అని యోచించి తను తీసుకోవలసిన తదుపరి చర్యల గురించి పథకం తీర్చిదిద్దుకుంది.

మర్నాడు ఆఫీసుకి వెళుతున్న భాగ్య లక్ష్మి ఇంకా సందు మలుపేనా పూర్తిగా తిరగక ముందే బంగార్రాజు సంతోషంగా రంగప్రవేశం చేసి సుందరి మిథునం ముందు ఓ ప్రకటన చేసేడు. 'ఉల్లిపాయ, బంగాళదుంపల మసాలా కూరతో సమో సాలు చేసి పెడతాననీ, అది తిన్నాక 'టిఫి నానందకారకా' అని పాడుతూ వాళ్లు ఆనం దతాండవం చేసి తీరతారని' ఆ ప్రకటన సారాంశం. ఇది విని సుందరి, బాబూరా వులు అక్షరాలా నోళ్లు వెళ్లబెట్టేశారు ఆశ్చ ర్యంతో.

'ఏమిటీ! ఉల్లిపాయ బంగాళాదుంప మసాలాకూరా? ఆ కూరతో సమోసాలా? ఈ బంగార్రాజుకి మతిపోలేదు కదా? ఉల్లిపాయ బంగాళదుంపలతో కూరంటే, ఈ రోజుల్లో బిర్లాలు, టాటాలు, అంబానీ ల్లాంటి వాళ్లు కూడా సాహసం చెయ్యలేక పోతున్నారటనే! మరి ఇతగాడేమిటి? అరిచి మరీ చెప్తున్నాడు.. నిజంగానే పిచ్చె క్కిందేమిటి చెప్మా?' అనుకున్నాడు అం తరంగంలో.

కూర్చున్న కుర్చీమీంచి గభీమని లేచి పోయి బంగార్రాజు రెండు గజాల పొడవూ, అంతే వెడల్పూ వున్న బాల్కనీ వరండాలోంచి సరాసరి వంటగదివైపు లంఘించేడు. హనుమంతుడు లంకకి లంఘించిన భంగిమలో సమోసోత్సా హుడై వంటగదిని సమీపించిన ఆ యువ కునకేమయిందిట? ఆకాశం మీద కూలి నట్టు అనిపించిందేమో లేకపోతే కెవ్వున కేక వెయ్యబోయి బహుప్రయాస పడి ఆ కేక బయటికి రాకుండా ఎందుకు నానా

తంటాలూ పడతాడు? అలవికాని బాధ తోనూ, భరించలేని అవమాన భారం తోనూ, వర్ణించడానికి వీలుకానంత సిగ్గు తోనూ అలా చెక్కబొమ్మలా నిలబడిపో యాడు ఆ వంటగది తలుపు ముందు. భగవంతుడికే ఎందుకో కోపం వచ్చి గర్భ గుడి తలుపు మూసేస్తే - ఆలయ ప్రవేశం చెయ్యబోయి భంగపడిన భక్తుడు ఆ మూసివున్న తలుపుల ముందే మోకరిల్లి, ఆర్తనాదం చేస్తున్న రీతిలో కనిపించేడు బంగార్రాజు. అతగాడ్ని అంత దయనీయ మైన స్థితికి దిగజార్చిన సంఘటన ఏమై వుండును? కేవలం మూయబడి యుండు టయే కాక తాళం కప్ప కూడా వేలాడు తున్న తలుపులే బహుశా అతనిని ఆ స్థితికి దిగజార్చి యుండును. పేరుమోసిన లాక్ బ్రేకర్స్‌కి కూడా గుండెదడ తెప్పించ గలిగేంత బలమైన గోద్రెజ్ నవతాళ్ తాళంకప్ప! ఒంటి కంటి అమ్మవారి ముఖంలా పరిహసిస్తూ ఆ తలుపులకి వేళ్లాడుతోంది.

ఎందుకు జరిగిందిలా? తనకిష్టమైన రెండు వంటకాలు కూడా తీరికగా వున్న ప్పుడు చేసుకుతినే స్వేచ్ఛ తనకి లేదా? అదే తెలియజేస్తోంది ఈ దుశ్చర్య. అహో! ఇంటి యజమానికి వుద్యోగం లేకుండుట- యజమానురాలికి పెద్ద మొత్తంలో జీతం లభించుచుండుట- అదియా ఈ నా నికృష్ట స్థితికి కారణం? ఇప్పుడు నా కర్త వ్యమేమి? గంగలో కలిసిన నా పరువు మర్యాదలను కాపాడుకొనుట ఎట్లు? ఆటో అయిననూ నడిపి నాలుగు రూకలు సంపాదించవలె! అదియే తక్షణ కర్తవ్యం. అయిననూ అది సంభవము కాదే! ఏల నన, తనకు ఆటో నడుపుట రాదే! తనకు తెలిసినవి రెండే రెండు విద్యలు సాఫ్ట్‌వేర్ మర్మములన్నిటిని తెలిసికొనియుండుట. అయిననూ, ఆ ఉద్యోగం పోయినది. ఇక తనకు తెలిసిన రెండవ విద్య పాకశాస్త్ర వైదుష్యం. దానిని ప్రదర్శించి, నలుగురు తిండిపోతుల మెప్పు సంపాదించ నుంకిం చుచుండ- నన్ను వంటయింటి దరిదాపు లకు కూడ చేరకుండ చేసినది శ్రీమతి. ఏమి ఈ దుర్గతి? ఏమి చేయవలయుని పుడు? ఆ సుందరాంగి సుందరి ముందు నిలిచి- కరకరలాడెడు సమోసాలతో మీకు విందు చేయుదునని ప్రగల్భములను పలి కితినే! ఇప్పుడు ఆమెకూ, అచ్చపు తిండి పోతు వలె కన్పట్టుచున్న ఆమె భర్తకు మొగము చూపించు టెట్టు? పేరుమోసిన ఐటి కంపెనీలలో పేరుమోసిన సాఫ్ట్‌వేర్ డిజైనర్ కమ్ అడ్వర్టైజ్‌మెంట్ ప్రొఫెష నల్‌గా పేరుపొందిన తను పదవీచ్యుతి కారణంగా, నలమహారాజు మాదిరి వంట ఇంటిలోనికి దూరవలసి వచ్చినది. అయిననూ ఆ పదవిని కూడ ఆనందంగా స్వీకరించి తనకి బాగా ప్రావీణ్యత వున్న సమోసా వంటకాన్ని బాగా కరకరలాడే టట్టు చేసి తెత్తునని ఆశపెట్టితిని. అదీ ఎవరికి? తోటి నిరుద్యోగులైన భార్యాభర్త లకి. అననుకూలతలెన్ని ఎదురైనా నైరా శ్యంలో కూరుకుపోకుండా, గుడ్ హ్యూమర్‌తో దురదృష్టాన్ని కూడా స్వీక రించగలిగే ఆ వీరోచిత దంపతులకు (దీని దుంపతెగా! మళ్లీ దుష్ట సమోసం! ఏమిది? సమోసాలోచనాధీనమైన ఈ మనసు- హరి భక్తుడు ప్రహ్లాదుని భంగి - జగమంతయు సమోసామయమని తల చుచున్నదే) విందు చేతునని ఇచ్చిన మాట నిలుపుకొనలేని ఈ బతుకేల? ' అని పలురకములుగ, మయసభలో దుర్యోధ నుని భంగి (బంగార్రాజుకి నాటకాల్లో కూడా ప్రతిభ వుంది- అయితే దానిని ప్రపంచమే ఓ నాటకరంగం అని షేక్‌స్పి యర్ దర్శించిన రీతిలో దర్శిస్తూ వుంటా డు, అందుకనే కాబోలు తరచూ నాటక భాషలోనే స్వగతించుకుంటూ ఉంటాడు) స్వగతించుకొనుచు, బిక్క వదనుడైన

బంగార్రాజు బాల్కనీలోకి లెగ్స్ ఈడ్చు కుంటూ, ఈసురోమని ప్రవేశించాడు.

'ఈసురోమని మనుషులొస్తే, సమోసాలె ట్లొచ్చునోయ్!' అని అనుకుంది సుందరి మనసులో. ఆమెకి గురజాడ అన్నా, మధు రవాణి అన్నా వల్లమాలినంత ఇష్టం.

అతన్ని చూసి.. ఆత్రంగా, సుందరి, బాబూరావులిరువురూ ఒకే గొంతుకా అ న్నట్టు "ఏమయింది బంగార్రాజుగారూ?" అని అడిగేరు.

"మీరసలే పరాగ్గా ఉండే రకం.. మీ ఆలోచనల్లో కూరుకుపోయి పరాకు యోగంలో కూర్చుంటే, అవతల ఎవడేనా కొంపలో దూరి మొత్తం యింటిని ఖాళీ చేసి పట్టుకుపోతాడు అని రోజూ నాతో ఏకరువు పెడుతూ, ప్రత్యేకంగా తన గదికి తాళం వేస్కొని మరీ ఆఫీసుకి వెళుతూ ఉంటుంది. మరివాళ ఏమనుకుందో? ఏమో? గిన్నె ముంత బంగాళా దుంపలూ, ఉల్లిపాయలు, నూనెల్లాంటివి కూడా దోపి డీకి గురికావచ్చు ననిపించిందో ఏమిటో? వంటగదికి కూడా తాళం వేసేసి పట్టుకు పోయింది" అన్నాడు బంగార్రాజు.. బహు సిగ్గు పడిపోతూ.

ఆ మాటల్ని అతను అంటున్నప్పుడు వినిపించిన దైన్యం, అవమాన భారం సుందరి పసిగట్టేసింది. జరిగిందంతా అవ గతమైపోయింది ఆవిడకి. అంతులేనంతగా జాలి కలిగిపోయిందావిడకి, బంగార్రాజు మీద. కన్నీళ్లు వచ్చేశాయి ఆవిడకి, అతని స్థితిని చూసి. 'నాథుల్నేరముల్సేయ, పేరలు కన్నొందినయట్టి కాంతలుచిత వ్యాపారముల్నేర్తురే?' అన్న పద్యభాగం గుర్తుకువచ్చి 'ఎంత స్పర్థ కలిగినా, మరీ ఇంత దారుణంగా దాన్ని వ్యక్తపరచగలిగే వాళ్లు కూడా ఉంటారా?' అని మనసులో తీవ్రంగా స్పందిస్తూ, కళ్ల నీళ్లుపెట్టుకుంది. కానీ ఆ కన్నీటిపొరని, మిగిలిన ఇద్దరూ గమనించకుండా ఉండాలని, పక్కకి తిరిగి పోయి 'అబ్బా! ఏమిటి బాబూ! ఏదో పడింది కంట్లో' అని కళ్లు నలుపుకుంది.

అంత భారీ మనిషి బాబూరావు ఛెంగున కుర్చీలోంచి లేచి "సుందరీ! సుందరీ! ఆర్ యు ఆల్ రైట్?" అని ఆమె ని పొదివి పట్టేసుకుని, కళ్ల మీంచి ఆమె చేతిని తప్పించి, ఆమె కళ్లల్లోకి చూసేడు. అలా చూడగానే అతనికి అర్థమయిపో యింది ఆమె మనసులోని బాధ. మెల్లగా, ఎంతో మృదువుగా ఆమెకి మాత్రమే విన పడేంత మెలోటోన్‌లో "కంట్రోల్ యువర్ సెల్ఫ్ డార్లింగ్!" అన్నాడు.

సుందరి కళ్లలో చెప్పడానికి వీల్లేనంత కృతజ్ఞతా భావం.

"నో నో!" అని అతి మృదువుగా ఆమె వీపు మీద పాట్ చేసేడు బాబూరావు.

ఆ ఇద్దరి అన్యోన్యత చూసేటప్పటికి ఒక మహానంద స్థితి అనుభవమయింది బంగార్రాజుకి. వెన్వెంటనే ఏదో చెప్పలేని దైన్యభావం కూడా కమ్మేసింది.

ఇంతలో తన సంయమనాన్ని అదుపు లోకి తెచ్చుకొన్న సుందరి "అమ్మయ్య! ఎంత బాధ పెట్టేసింది బాబూ ఏం పడిం దోగానీ కంట్లో" అని అప్పుడే తేరుకున్నట్టు నవ్వుని ముఖం మీదికి తెచ్చుకుంది.

సుందరికి వత్తాసు పలుకుతూ.. ఆమెని ఆ స్థితిలో బంగార్రాజు చూడకూడదనుకు న్నట్టున్నాడు బాబూరావు, ఆమెని కవర్ చేస్తూ అడ్డుగా నిలబడ్డాడు.

బంగార్రాజునీ, వాళ్లనీ వేరుచేస్తున్న గ్రిల్సు యోజనాల మేర విస్తరించి ఉన్న ప్రతిబంధకంలా అనిపించింది బంగార్రా జుకి. తను ఎక్కడ హర్ట్‌అయిపోతానో అని ఆ భార్యాభర్తలిద్దరూ పడుతున్న తాపత్రయం చూసి బాగా చలించిపో యాడు బంగార్రాజు. చంద్రుడు ఆకాశంలో ఎక్కడో దూరంగా ఉండొచ్చు. కానీ హాయిని కలిగించే చంద్రుని చల్లదనం మనందరి దగ్గరికీ చేరుతోంది కదా!

అలాగే, ఆ ఇద్దరూ తన ఎడల కనపరుస్తున్న సానుభూతి, అవగాహన మాటల్లో వ్యక్తం కాకపోయినా స్పష్టంగా అర్థమై మనసు ఆర్ద్రమైపోయింది బంగార్రాజుకి. 'మరొకరూ.. మరొకరూ అయితే, ఇప్పటి తన నిస్సహాయస్థితి చూసి, తెగ ఎగతాళి చేసి ఆటపట్టించి ఉండేవారు. వీళ్లిద్దరూ తనపై జరుగుతున్న అణచివేతను స్పష్టంగా చూసి కూడా ఏమీ చూడనట్టు ప్రవర్తిస్తున్నారే! దానికి ఎంతటి సంస్కారం కావాలి! వీళ్ల మనసులు కృష్ణుడి గోకులంలో లభించిన వెన్నలాటి ఏదో అపురూపమైన పదార్థంతో తయారయ్యాయేమో..!' ఇలా సాగుతున్నాయి బంగార్రాజు ఆలోచనలు.

ఇంతలో సుందరి ఏదో చిక్కు సమస్యకి పరిష్కారం కనుక్కున్నట్టు "అంటే మనం సమోసాలు చేస్కోడానికి కావలసిన ముడిసరుకు ఉన్న గదికి పరాకున తాళం వేసేసుకొని ఆఫీసుకి వెళ్లిపోయారన్నమాట భాగ్యలక్ష్మిగారు! అదే కదా సమస్య? " అంది.

ఆవిడ మాటల అంతరార్థం ఏమిటో అంతుబట్టక, మిర్రిమిర్రి చూపులు చూసేడు బంగార్రాజు.

దాంతో ఆవిడ "మనం ఏం నిరాశ పడిపోనక్కర్లేదు. సమోసా తయారీకి కావలసిన సామగ్రి యావత్తు మా ఇంట్లో ఉంది. ఇక వాటిని తయారు చెయ్యగలిగే స్కిల్ మీ దగ్గర ఉందంటున్నారు కదా! దాన్ని ఎవరూ బంధించి దాచెయ్యలేరు! మీ ఫ్లాటుకి భద్రంగా లోపల్నుండి గడియలు వేసి, వరండా గ్రిల్స్‌ని పట్టుకొని జాగ్రత్తగా నడిచి మా ఫ్లాట్‌లోకి దూకేయండి" అని వివరంగా సూచనలిచ్చింది. అచ్చంగా ఆమె చెప్పినట్టే చేశాడతను.

సుందరిగారి కిచెన్ అడ్వర్టయిజ్‌మెంట్‌కి పేపర్లలో వేస్తుండే కిచెన్‌లా ఉంది గ్రాండ్‌గా! ఆశ్చర్యపోయేడు బంగార్రాజు. 'కిచెన్ కూడా ఇంత అందంగా ఉంచుకోవచ్చా? ' అనిపించింది.

క్షణాల మీద సుందరి మేజిక్ చేసి తీస్తున్నట్టు పిండి, బంగాళదుంపలు బీన్స్, సన్‌డ్రాప్ ఆయిలు.. అంతవరకూ ఎక్కడా కనిపించకుండా ఎలా దాక్కున్నాయో? అని భ్రమ కలిగించే రీతిలో క్లోజెట్స్‌లోంచి చకచకాతీసింది.

ఆమె చురుకుతనం, నీట్‌నెస్సు, సమోసా ప్రిపరేషన్‌కి అవసరం అని అతగాడు భావించే అనుకూల వాతావరణం.. వీటన్నిటినీ చూసి పొంగిపోయేడు బంగార్రాజు. అతనిలో నిద్రాణంగా దాగి ఉన్న ఎక్స్‌పర్ట్ చీఫ్ మేలుకున్నాడు. చకచకా ఎంతో ఆర్టిస్టిక్‌గా ఒక్క రాంగ్ స్టెప్ కూడా పడకుండా, దోరగా వేయించి, సమోసాల్ని తళతళ మెరుస్తున్న ఒక స్టీల్ బేసిన్‌లో చాలా ఆర్టిస్టిక్‌గా అమర్చి తన పాక చాతుర్యాన్ని సుందరి, బాబూరావుల ముందు సగర్వంగా ప్రదర్శించేడు.

వాళ్లిద్దరూ ముగ్ధులయిపోయారు, బంగార్రాజు పాకశాస్త్ర ప్రావీణ్యాన్ని చూసి. బంగార్రాజు వీపు మీద ఓ దరువు వేసి మరీ 'భేష్' అని మెచ్చుకోవాలనిపించింది సుందరికి. కానీ ఆ అంతర్గత వాంఛను కంట్రోల్ చేస్కుంది.

'నాకు లేదే ఇలాటి ప్రతిభ' అని బాబూరావు కూడా ఒక నిట్టూర్పు విడవబోయేడు. కానీ ఆ నిట్టూర్పుని తన భార్య, బంగార్రాజూ విని ఎక్కడ తన నిస్పృహని పసిగట్టేసి నవ్వడమో? సానుభూతి చూపడమో చేస్తే? అందుకని ఆ నిట్టూర్పు బయటికి రాకుండా దాని పీక నొక్కేసేడు.

చవులూరిస్తున్న వేడివేడి సమోసాల్ని బాబూరావు ప్లేట్లలో సర్దుతుంటే, సుందరి మంచి టీని తయారుచేసింది. గొప్ప స్టైల్‌గా కనిపిస్తున్న డైనింగ్ టేబుల్ చుట్టూ కూర్చొని ఆ ముగ్గురూ - నిజమైన భోజన ప్రియుల్లా ఆ అల్పాహారాన్ని తీరిగ్గా

# చమత్కారం



## తెనాలి చురక

రాయలవారి అష్టదిగ్గజాలలో ప్రథముడు అల్లసాని పెద్దన అప్పటికీ ఇప్పటికీ మహాకవే. అలాంటివాడు 'మనుచరిత్ర'లో ఒకచోట 'అమవసనిసి' అనేపదం వాడాడు. దాంతో ఆయనను ఆటపట్టిస్తూ తెనాలి రామకృష్ణుడు-

ఎమిదిని సెపితివి కపితము
బమపడి వెఱిపుచ్చకాయ వడిదిని సెపితో
ఉమెతక్కయ దిని సెపితో
అమవసనిసి అనుచు నీవు అలసనిపెదనా?

అంటూ సరదాగా ఓ పద్యం చెప్పాడు.

అమావాస్య బదులు 'అమవస' పదం వాడాడని రామకృష్ణుడి వెక్కిరింత ఇదన్న మాట. స్థూలార్థం ఏమంటే- పెద్దనా అమవసనిసి అంటూ కవిత్వం చెప్పావే, ఏంతిని చెప్పావయ్యా? వెర్రిపుచ్చకాయ తిని చెప్పావా? ఉమ్మెత్తకాయ తిని చెప్పావా? అని.

'కవిత్వం' అనేపదాన్ని 'కపితము' అనడమేగాక, 'అల్లసాని పెద్దన' పేరును ఒత్తులు దీర్ఘాలు లేకుండా అలసని పెదనా అంటూ చిలిపిగా ప్రయోగించి ఆటపట్టించాడు రామకృష్ణుడు. అదీ తెనాలి వాడి హాస్యధోరణి..

అల్లసాని పెద్దనతోపాటు సభాసదులందరూ తెనాలి రామకృష్ణుడి చిలిపితనాన్ని ఆస్వాదించి నవ్వుకున్నారు.

సేకరణ: చంద్రప్రతాప్

ఎంజాయ్ చేస్తూ, ఎన్నో స్వీట్‌నథింగ్స్‌ని చెప్పుకున్నారు. తరవాత జెంట్స్ ఇద్దరూ వరండాలోకి వెళ్లిపోయారు.. సిగరెట్లు కాల్చుకోడానికి. సుందరి లోపలే ఉండిపో యింది టేబుల్ శుభ్రం చేస్తూ.

"అబ్బ! ఎంత ప్లజెంట్‌గా గడిచిందండి టైము! ఇలాటి అనుభవాలు నిత్యం ఉండే వేమో? లేకపోతే సినారెగారు 'ప్రతిరాత్రి వసంతరాత్రి, ప్రతిగాలి పైరగాలి' అని ఎందుకు రాస్తారూ ఏకవీర సినిమాలో అంత అద్భుతమైన పాటని? సరే! ఇక నేను వెళ్తాను. మా భాగ్యం ఇంటి కొచ్చే వేళయింది" అని టాటా చెప్పేసి, బంగా ర్రాజు వాళ్ల బాల్కనీలోంచి తన బాల్కనీ

> ## కొత్తగాలి...
>
> **పెరిగే ప్రతి చెట్టూ**
> **ప్రగతికి మూలం**
> **పర్యావరణానికి**
> **వెలకట్టలేని మూలధనం!**
>
> – బి.వి. నరసింహారావు,
> పేరాల, ప్రకాశం జిల్లా

లోకి లంఘించడానికి ఉద్యుక్తుడవుతు న్నాడు.. ఆంజనేయుడు లంకకి జంప్ చేసి, సీతమ్మని చూసిన పిమ్మట, రిటర్న్ జంప్‌కి ఎంతటి మహదానందంతో తయా రయాడో అదేరకమైన ఆనందంతో..

"బంగార్రాజుగారూ! ఉండండుండండి! మనం ముగ్గురం కూర్చొని సమోసాలు లాగించేశాం, బాగుంది. కానీ ఆవిడా.. అదే భాగ్యలక్ష్మిగారు కూడా ఆఫీసు నుంచి అలిసిపోయి, ఆవురావురుమంటూ వస్తారు కదా! ఆవిడిక్కూడా మీరు చేసిన గుమ్మ యిన సమోసాలు- ఓ నాలుగు పట్టికెళ్లి పెట్టండి. తిని బహుసంతోషపడతారు వాటి గ్రాండ్ టేస్ట్ నాలిక్కి తగిలి. టీ కూడా ఉంది ఫ్లాస్కులో పోసిస్తాను పట్టు కెళ్లండి" అంది రియల్ కన్సర్న్ కనప రుస్తూ సుందరి.

ఆమె చూపిస్తున్న ఆ ఉదార గెస్చర్‌కి (టైముకి సరైన ఎక్స్‌ప్రెషన్ దొరికి చావదు కదా! ఇంగ్లీషు మీడియం స్కూళ్లల్లో చదివి చావడం కాదుగానీ) పొంగిపోతూ, తన ఫ్లాటులోకి పునర్గంపు చేశాడు బంగార్రాజు ఆవిడిచ్చిన సరుకూ సరంజామాతో.

సమోసాలు, టీ ఫ్లాస్కు, చక్కగా టేబుల్ మీద అమర్చి మంచి అందమైన ప్లాస్టిక్ పూలని కూడా ఫ్లవర్‌వాజ్‌లో అమర్చి మంచినీళ్ల జగ్ అందేంత దగ్గర్లో పెట్టి, కాస్త దూరంగా నిలబడి ఫొటోగ్రాఫ ర్‌లా లాంగ్‌షాట్‌లో సెట్టింగుని వీక్షించి, బహుసంతోషించినవాడై నిల్చున్న తరు ణంలో.. డోర్ బెల్ లయబద్ధంగా రింగ యింది. తలుపు తెరిచాడు. ఎదురుగా భాగ్యలక్ష్మి.

ఆశించిన విధంగా మొగుడు హేంగ్ డాగ్ ఎక్స్‌ప్రెషన్‌తో కనపడ్డేదు సరికదా! హై స్పిరిట్స్‌లో ఉన్నవాడి లాగ కనిపిస్తు న్నాడు. ఈ రకమైన అభిప్రాయం కలిగేస రికి కోపం తన్నుకొచ్చేసింది భాగ్యలక్ష్మికి. గబగబా బాత్రూములో దూరిపోయి, కోపంతో మండిపోతున్న మొఖాన్ని చన్నీ ళ్లతో కడిగి చల్లబరచాలని చూసింది. అయినా కోపం తగ్గుముఖం పట్టలేదు.

ఆఫీసు డ్రెస్ మార్చి చేతికి దొరికిన ఎర్ర చీరని చిరాకుపడుతూ కట్టుకొని, నడిచి వస్తున్న మంటలా భోజనం బల్లదగ్గరకి వచ్చింది. 'కిచెన్ లాక్ చేసుకుని మరీ వచ్చేశాను కదా! అంచేత టిఫినూ కాఫీ లాటివేవీ తయారుగా ఉంచలేడు మొగుడు. ఏ బిస్కట్లో తిని సరిపెట్టుకో వాలి' అని అనుకుంటూ రంగ ప్రవేశం చేసిన భాగ్యలక్ష్మికి మరో పెద్ద ఆశా భంగం.

ఏదో గ్రేండ్ పార్టీకి అలంకరించినట్లుగా కనిపిస్తున్న టేబుల్, దానిమీద నోటిని ఊరిస్తూ డిజైనర్ ప్లేటులో అమర్చి ఉన్న సమోసాలు, ఫ్లాస్కులో వేడి తేనీరు, టేబుల్‌కి ఒక పక్కగా ఆరెంజి కలర్ ఫ్లవర్ వాజులో అందాన్ని చిలకరిస్తూ గ్రీను, పింకు కలర్ ఫ్లవర్సు ప్లాస్టిక్‌వే అయితేనేం గాక.. ఒక్క క్షణం మతి పోయినట్లనిపించింది భాగ్యలక్ష్మికి ఈ ఏంబియన్స్‌ని చూసి. ఆవిడకి సమోసాలంటే పిచ్చి ఇష్టం. వాటిని తయారుచెయ్యడంలో తన భర్త సిద్ధహస్తుడని కూడా తెలుసు. టేబుల్ మీద కనిపిస్తున్న సమోసాల సైజు, వాటిని దోరగా వేయించిన వైనం.. ఇవన్నీ చెప్పకనే చెపుతున్నాయి, ఈ సమోసాల తయారీదారు సాక్షాత్తు తన భర్తే అని.

ఆకలితో నకనకలాడుతూ వచ్చిందా ఇంటికి, నోరూరించి మరీ ఆహ్వానిస్తున్నాయి సమోసాలు. ఇంతలో సడెన్‌గా ఫ్లాష్‌లాటి ఆలోచన. దాంతో కాళికావతారం ఎత్తింది భాగ్యలక్ష్మి. ఆమె ధరించిన ఎర్రచీర మంటలా కనిపిస్తోంది - ఆ కోప సన్నివేశంలో.

"ఎక్కడివీ సమోసాలు? " అని గద్దించి రంకె వేసింది. వెధవ ఫ్లాట్లకి గోడల మందం మరీ తక్కువగా ఉంటుంది కదా! అరిస్తేచాలు పక్కవాటాల్లో ఉన్న వాళ్లందరికీ డైలాగులన్నీ వినిపిస్తూంటాయి. ఈ సంగతి బాగా తెలుసు భాగ్యలక్ష్మికి. అందుచేతనే రంకె వేసినా, అది చాలా లో పిచ్‌లోనే వేసింది.

రెండోమారు కూడా గద్దింపు రిపీట్ అయినాక బంగార్రాజు నుండి సమాధానం వచ్చింది "నేనే చేశాను" అని.

"అలాగా! . చాలా సంతోషం! అయితే ఎక్కడ చేసేరేమిటి? "

"కోడి కుయ్యకపోతే తెల్లవారదనుకున్నావా? "

"సామెతలు తరువాత తీరిగ్గా చెబుదురుగానీ, డొంక తిరుగుడు మానేసి ముందు అడిగిందానికి సమాధానం చెప్పండి!"

"అలాగా? అయితే విను! సుందరిగారి కిచెన్‌లో చేశాను"

"భేష్! మరి బాగా చేసేరనీ, రుచిబాగా కుదిరిందనీ మెచ్చుకున్నారా? "

"ఆహా! చాలా బాగున్నాయని లొట్టలు వేసుకుంటూ మరీ తిన్నారు"

"మరి మీరు ఇంత బాగా సమోసాలు చేసి తినిపించినందుకు ఓ నాలుగు చేతిలో పెట్టి, వంటవాళ్లకి ఇచ్చే ఈనాంగా ఈ నాలుగు సమోసాలు ఇంటికి పట్టికెళ్లి మీ ఫేమిలీకి తినిపించండని ఇచ్చి ఉంటారు. ఏం అంతేనా? కష్టపడి చేసి పెట్టినందుకు ఎంత కూలి ముట్టచెప్పేరేమిటి? "

"ఏయ్! నీ ఉద్దేశమేమిటి? "

"నా ఉద్దేశం మరేమీ లేదు నా మొగుడికి సాఫ్ట్‌వేర్ ఉద్యోగం ఊడిపోతేనేం? ఇరుగూ పొరుగూ వాళ్లకి వంటావార్పూ చేసి, కేటరింగులు చేసీ, ఇటు డబ్బుకి డబ్బు అటు రోజూ విందు భోజనాలు మిగులూ తగులూ వంటకాల్ని కేరేజిలో సర్ది తెచ్చుకుంటే, ఇంటిదగ్గరున్న పెళ్లానిక్కూడా విందు భోజనం. బలే లైఫ్! కదా!"

"భాగ్యం! నువ్వు హద్దుమీరి అవమానిస్తున్నావు నన్ను"

"నిజం! నా మాట నమ్మండి! నేను అవమానించడం లేదు మిమ్మల్ని. అభినందిస్తున్నాను. ఇంత వేగంగా, ఇంత సుళువుగా వంటవాడి ఉద్యోగం సంపాదించేసుకున్నందుకు అభినందించకుండా ఎలా ఉండగలను, చెప్పండి? సాయంత్రం అలా ఓమారు బజార్లోకి వెళ్లి ఓ బోర్డు రాయించుకురండి 'ఫలానా బంగార్రాజు, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గారి ప్రత్యక్ష పర్యవేక్షణలో మీకు కావలసిన అన్నిరకాల వంటలూ, పిండివంటలూ మీరు నచ్చే రుచులతో, సకాలంలో

తయారుచేసి ఇవ్వబడును. కేరేజి, కేట రింగు సదుపాయాలు కూడా లభ్యం. సరసమైన ధరలు. నేడే త్వరపడుడు. మీ వివాహాది కార్యక్రమాలకి, శ్రాద్ధకర్మలకు ప్రత్యేకం - గారెలు, నువ్వుపప్పు పచ్చడి. అదిరిపోతుంది బిజినెస్. బోర్డు తగిలించి చూడండి!"

"చాలా ఇన్సల్టింగ్‌గా మాట్లాడుతున్నావు"

"అలాగా? అలా అయితే మీరు చేసిన పనేమిటి? నిన్నటిదాకా ముక్కూమొఖం తెలియనివాళ్ల ఇంటికి వెళ్లి - వాళ్ల పిండి, వాళ్ల నూనె, వాళ్ల ఉప్పూకారం ఉపయోగించి, వాళ్ల రుచిమేరకి సమోసాలు చేసిపెట్టేరు. పనిపూర్తయి ఇంటికి వెళ్లిపోతున్న వంటవాడికి 'మీ ఇంటి వాళ్ల కోసం ఈ నాలుగూ పట్టుకెళ్లవయ్యా!' అని సమోసాలు ఇస్తే, అసలుసిసలు వంటవాడిలా వాటిని పట్టుకొచ్చి నాకు టిఫిన్ పెట్టేరు. ఈ ఎంటైర్ ఎపిసోడుని తలచుకుంటుంటేనే తలకొట్టేసినట్లనిపిస్తోంది. మీకు ఏమీ అనిపించడంలేదంటే ఏమనుకోమంటారు? రేపు ఆ సుందరి, దాని మొగుడు ఎదురుపడితే నేను మొఖం ఎక్కడ పెట్టుకోవాలి? " అని రోదన స్వరంతో ఆక్రోశించింది భాగ్యలక్ష్మి.

ఇలా ఘాటైన చీవాట్లని తిన్నాక అంతర్మథనం ఆరంభమయింది బంగార్రాజులో, తను ఏమైనా పొరపాటు చేశానా? అని. అలా ఆలోచిస్తూ తన గదిలోకి వెళ్లిపోయేడు.

సమోసాల్ని మొత్తం గార్బేజ్ క్యాన్‌లోకి విసిరేసి, కోపంతో కుతకుత ఉడికిపోయి, భాగ్యలక్ష్మి డ్రాయింగ్ రూములోకి వచ్చింది, కుర్చీలో కాసేపు కూలబడాలని. కానీ అక్కడ టీపాయ్ మీద ఉన్న లాప్‌టాప్ ఆమె కంట పడింది.

'ఇదెక్కడి నుండి వచ్చింది చెప్మా? ' అని గతుక్కుమంది.

"ఆ లాప్‌టాప్ ఎక్కడిదీ? " అని మళ్లీ గద్దించింది మొగుడ్ని గదిలోకి వెళ్లి. ఆ గర్జనలో అనేకరకాల ధ్వనులు- కోపం, భయం, ఆక్రోశం, ఆందోళన, ఏడుపు.. ఇలా. ఈ లాప్‌టాప్ కొంపతీసి తనకి ఛాలెంజా?

'ఇంట్లో ఉన్న కంప్యూటర్ని నువ్వు అమ్మిపారేస్తే నాకు మరెక్కడా కంప్యూటరు దొరకదనుకున్నావా? ' అని బంగార్రాజు ప్రశ్నిస్తున్నట్టు అనిపించింది ఆ కంప్యూటర్ని చూస్తుంటే.

బంగార్రాజు ఇచ్చిన సమాధానం విని కుర్చీలో కూలబడిపోయింది భాగ్యలక్ష్మి. ఆమె కళ్లంట ధారలుగా నీరొచ్చేస్తోంది.

'మీకు ఇంటర్నెట్టే కాలక్షేపం అయితే కొన్నాళ్లపాటు నిస్సంకోచంగా నా లాప్‌టాప్‌ని వాడుకోండి. రాత్రనక, పగలనక ఆ దిక్కుమాలిన కంప్యూటర్లని చూసి చూసి ప్రాణం విసుగెత్తి పోయిందనుకోండి. కంప్యూటర్ కంటపడితే చాలు పిచ్చికోపం వచ్చేస్తోంది. ఏం బోరండీ బాబూ! ఈ కంప్యూటర్ ముందు నిత్యం అలా పడిగాపులు పడి ఉండడం! ఓమాట అంటాను మరేం అనుకోకండి! అదేపనిగా ఇన్‌ఫర్మేషన్ కోసం కంప్యూటర్‌లో సెర్చ్‌చేస్తూ కూర్చోకండి! చూడక తప్పదనుకునే ఇన్‌ఫర్మేషన్ అవసరమైతే మా ఆయనగారి లాప్‌టాప్ ఉంది కదా! దాన్లో చూస్తాన్లెండి నేను. మళ్లీ మీరు కొత్త లాప్‌టాప్ కొనుక్కున్నదాకా దీన్ని హాయిగా వాడుకుంటూ ఉండండి' అని సుందరి చెప్పిన ఉపోద్ఘాతం అంతట్నీ ముక్కస్యముక్క చెప్పి, 'నువ్వు నిష్కారణంగా కంప్యూటర్ని అమ్మిపారేసేవు నాకదొక్కటే కాలక్షేపం అని తెలిసి కూడా. కనీసం పొరిగింటావిడని చూసైనా నేర్చుకో.. ఔదార్యం అంటే ఎలా ఉంటుందో!' అన్నట్టుగా బంగార్రాజు చూసిన చూపు బాకులా గుండెలకి గుచ్చుకుంది భాగ్యలక్ష్మికి. దాంతో కుర్చీలో కూలబడి వలవల

ఏడ్చేసింది.

'ఎంతటి అవమానం! సినిమాలు, చిత్రకథలూ కూడా చూడమని చెప్పి ఉంటుంది. మొగుడు చూస్తున్న అసభ్యమైన బొమ్మలు నచ్చకే కదా! తను ఆ కంప్యూటర్ని అమ్మేసింది. సరిగ్గా అలాటి వాటినే చూడండి! కాలక్షేపం అవుతుంటుంది అని చెప్పినా చెప్పి ఉండవచ్చును ఆ వన్నెల విసనకర్ర. అదను దొరికింది కదా ఇక అడ్డమైన బొమ్మల్నీ చూస్తూ కూర్చుంటాడీ పన్లేని మొగుడు. ఆ బోడి లాప్‌టాప్‌ని పట్టికెళ్లి అమాంతం ఏ నూతిలోనో పడేస్తే సరి!' అనిపించింది భాగ్యలక్ష్మికి. కానీ అదికాస్తా ఆ పక్కింటి చుప్పనాతి దానిది. దాన్ని ముట్టుకున్నప్పుడల్లా ఆ సుందరిని తాకుతునట్టే ఫీలవుతుంటాడేమో ఈ బంగారిగాడు?

అసహనంతోనీ, అవమాన భావంతోనీ గిలగిల కొట్టుకుంటోంది. దాంతో, ఆపకుండా అటూఇటూ పచార్లు చేసింది, మెక్‌బెత్‌లా స్వగతించుకుంటూ. తనకిలా శృంగభంగం అవుతుందని ఊహించను కూడా ఊహించలేకపోతోంది. తన మొగుడు తెలివైనవాడేను! అలాటివాడు - ఇలా జావకారిపోయి, ఆ సుందరి ముందు నీళ్లు నవులుతూ నిలబడిపోతాడని ఎలా అనుకోగలదు తను? అయినా తన మొగుడు ఇంతలా దిగజారిపోవడానికి - కొంపతీసి - తనే కారణం కాదుకదా? బూతుబొమ్మల్ని చూస్తున్నాడని కంప్యూటర్ని అమ్మిపారేయడం, పక్కింటి వాళ్లకి తన పాకశాస్త్ర ప్రావీణ్యాన్ని ఎక్కడ ప్రదర్శించి చూపిస్తాడోనని వంటగదికి తాళం పెట్టి వెళ్లిపోవడం.. ఇవన్నీ తను వేసిన రాంగ్ స్టెప్స్ కావా? గోడదాకా తరిమితే పిల్లిలాటిది కూడా తిరగబడుతుందంటారు. మరి తను చాలా దుందుడుకుతనంతో చేసిన పనులకి విసుగెత్తిపోయి, తన మొగుడు, పక్కింటి సుందరి తియ్యటి కబుర్లని ఎరగా చూపిస్తోంటే.. మోజు పడిపోకుండా ఎలా ఉంటాడు? తప్పు బహుశా తనదే. ఇప్పుడీ పక్కింటి అందాల రాక్షసి ఉపద్రవాన్ని ఎలా ఎదుర్కోడం? మొగుడి ఈ దిగజారుడు వ్యవహారం

## చతురలో మొదటి నవల



**ఎ.వి. రెడ్డి శాస్త్రి**

ఇంగ్లీషు లెక్చరర్‌గా ప్రభుత్వ కళాశాలల్లో పని చేసి రిటైరయ్యాను. ఉస్మానియా యూనివర్సిటీలో ఎమ్.ఫిల్, సీఫెల్‌లో పి.జి. డిప్లొమా చేసే రోజుల్లోనే గజ్జల మల్లారెడ్డి, రాచమల్లు రామచంద్రారెడ్డి, రాంభట్ల, వల్లంపాటి వంటి గొప్పవారి ఉపన్యాసాలు, ప్రసంగాలు విన్నాను. సాహిత్యంపై మక్కువ ఏర్పడడానికి అవి నాకు ప్రేరణ అయ్యాయి. 'నల్ల గులాబి' అనే కథ విపులలో అచ్చయింది. అనేక కథలు దిన, వార, మాస పత్రికల్లో అచ్చయ్యాయి. ఒక మాసపత్రిక నిర్వహించిన కథల పోటీలో 'చరితార్థము' కథకు రెండో బహుమతి అందుకున్నాను. చతురలో ఇది నా మొదటి నవల. 'పునరావాసం', అనే నవల, 'అసంగతసంగతాలు', 'ఈ మంటలు చల్లారవు', 'కృష్ణమ్ శరణమ్ జగద్గురుమ్' అనే కథాసంకలనాలు కూడా వెలువడ్డాయి.

చిరునామా:
ఎ.వి. రెడ్డి శాస్త్రి, రిటైర్డ్ లెక్చరర్
ఉమెన్స్ కాలేజీ ఎదురుగా,
శ్రీకాకుళం-532001

ఇంకా మరింత దిగజారకుండా చర్యలు తీసుకోవాలని గట్టి నిర్ణయానికొచ్చింది భాగ్యలక్ష్మి.

మర్నాడు పొద్దున్నే లేచి, తనే ఉప్మా చేసి, మొగుడ్ని పిలిచింది తింటానికి రమ్మని.

"అబ్బ! చాలా బాగా చేసేవే" అన్నాడు బంగార్రాజు, మెచ్చుకోలుగా. మనుషుల్ని మెచ్చుకోవడం అనేది పాజిటివ్ ఎప్రోచ్‌లో ఒక గొప్ప ఎత్తుగడ అని బంగార్రాజుకి బాగా తెలుసు.

"మీ సుందరి ఇంతకంటే బాగా చేస్తుందేమో!"

"అబ్జెక్షన్ యువరానర్! 'మీ సుందరి' అనడం చాలా అబ్జెక్షనబుల్ పాయింట్. రెండ్రోజుల పరిచయంతో, పక్కింటావిడ 'మీ' ఎలా అయిపోతుంది? ఇక కమింగ్ టు ది రెండో అప్రస్తుత పాయింట్..(ఛీ! వెధవ తెలుగు సమాసాలు- ఎప్పుడూ దుష్టసమాసాలే స్ట్రైక్ అవుతూ ఉంటాయి) అసలావిడకి ఉప్మా చెయ్యడం వచ్చునా? రాదా? వచ్చినచో నీ కంటే బాగా చెయ్యగలదా? లేదా? అన్నది - సమాధానం తెలియని ప్రశ్న" అనేసి, తింటున్న ఉప్మాని వదిలేసి, లేచిపోయాడు బంగార్రాజు.

ఈ పనికిరాని గొడవ లేవనెత్తడం కాదుగానీ, అంత మంచి ఉప్మాని తినాలనే కోరిక చచ్చిపోయింది అతగాడికి. నోట పెట్టుకోబోతున్న స్పూన్‌ని కాస్తా ప్లేటులో పడేసి, కుర్చీలోంచి లేచిపోయాడు.

"ఛాఛా! ఉత్తినే! మిమ్మల్ని ఉడికించడానికన్నాను. కూర్చోండి ప్లీజ్! ప్లీజ్!!" అని బతిమాలే ప్రయత్నం చేసింది భాగ్యలక్ష్మి.

అయినా బంగార్రాజు తిరిగి కూర్చోలేదు టేబుల్ దగ్గర. అంత మంచి ఉప్మా అలా ఉండిపోయింది.

మొదటిసారిగా అనిపించింది భాగ్యలక్ష్మికి 'అయ్యో! అనవసరంగా అతని మనసు నొప్పించేనే! ఇష్టంగా తింటున్న ఉప్మాని తిననివ్వకుండా చేసేనే!!' అని.

ఆవేళ సాయంకాలం ఆవిడ ఇంటికి వచ్చిందా.. ఒకర్తీ రాలేదు, ఆవిడ వెనకాతల ఓ మనిషి కూడా వచ్చేడు. ఆ వచ్చినవాడు ఓ పెట్టెని మోసుకుంటూ వచ్చాడు. ఆ పెట్టెలో ఒక సరికొత్త లాప్‌టాప్ డెల్ కంపెనీ వాళ్లది ఉంది. దానిని టీపాయ్ మీద పెట్టి చాలా వినయంగా బయటికి వెళ్లిపోయాడు, దానిని మోసుకొచ్చిన మనిషి.

బంగార్రాజు తన టేబుల్ దగ్గర కూర్చొని చాలా సీరియస్‌గా ఏదో వర్క్ చేసుకుంటున్నాడు, సుందరి అతగాడికిచ్చిన లాప్‌టాప్ మీద. ఒక్క క్షణమంటే ఒక్క క్షణం తన తలని ఇటు తిప్పి చూసి ఆశ్చర్యపోయాడు, టీపాయ్ మీద వున్న కొత్తడెల్ లాప్‌టాప్‌ని చూసి. చూసీచూడగానే తెలిసిపోయింది అది లేటెస్ట్ కన్‌ఫిగరేషన్‌తో ఉన్న లాప్‌టాప్ అని. దాన్నొకమారు ఆన్ చేసి, ఏయే సాఫ్ట్‌వేర్‌లు దానిలో లోడయి వున్నాయో చూడాలని ఉవ్విళ్లూరింది మనసు. కానీ తను ప్రస్తుతం చేస్తున్న పని మాంచి క్రూషియల్ స్టేజ్‌లో వుండి ఎక్స్‌పెక్ట్ చేసి రిజల్ట్ రావడానికి సిద్ధంగా వుంది. ఇలాంటి సమయంలో ఏ రకమైన డీవియేషనూ రాకూడదు. ఎటెన్షన్ డైవర్ట్ కాకూడదు. అలా చేస్తే వర్క్‌మీద ధ్యానం పోయి, చేసిన కృషంతా బూడిదలో పోసిన పన్నీరులా అయిపోవచ్చును. ఈ రకంగా ఆలోచించి కొత్త సిస్టమ్‌ని చూడాలని మనసు ఎంతలా వురకలు వేస్తున్నా, దానిని బలవంతంగా ఆపి, చేస్తున్న పని మీదకి దృష్టి మళ్లించాడు.

అతని అనాసక్త ధోరణిని, నిర్లక్ష్య వైఖరిగా జమకట్టింది భాగ్యలక్ష్మి. అలాంటి భావం కలగ్గానే బాగా చిన్నబుచ్చుకుంది మనసులో. దాంతో మంటలాంటి ఈర్ష్య ప్రారంభమయింది. తనకొంగు బంగారం

అనుకున్న మొగుడు, ఈ రకమైన నిర్లిప్తవైఖరి తను కొన్న వస్తువు విషయంలో కనపరుస్తున్నాడంటే.. దానికి ఆ జిత్తులమారి సుందరే కారణం అనే నిర్ణయానికి వచ్చేసింది భాగ్యలక్ష్మి. అది ఎర్రగా బుర్రగా వుంటుంది. చనువుగా, తియ్యగా కబుర్లు చెపుతుంది. అందమైన ఆడది కనిపిస్తే చాలు చొంగలు కార్చే స్వభావం తన మొగుడిది. కాకపోతే మరేమనుకోవాలి? ఒకటిన్నరో, రెండ్రోజులో వున్న పరిచయం పురస్కరించుకొని ఏళ్లుగా కలిసి జీవిస్తున్న భార్యని నిర్లక్ష్యం చేసి, దాని మాయలోపడి తేలుతున్నాడంటే ఏఁవిటనుకోవాలి? ఈ రకంగా ఈర్ష్యాజనితమైన ఆలోచనలతో రాతిరి రాతిరల్లా నిద్దర లేకుండానే గడిపింది భాగ్యలక్ష్మి. పక్కనే, ఏ చీకూచింతా లేకుండా గురకలు పెట్టి మరీ నిద్రపోతున్న మొగుడ్ని చూస్తుంటే చాచి తన్నాలనిపించింది.




ఉద్యోగం పోయిందన్న వూహే మనసుని కుంగదీస్తుంటే, ఏదో కాస్త టైమ్‌పాస్‌లా వుంటుంది కదా అని నెట్ ఫెసిలిటీని వినియోగించుకుంటుంటే, తనకి ఆ కాస్త ఆనందం కూడా మిగలనివ్వకుండా చేసింది భార్య. బాగా చదువుకుంది, మంచి వుద్యోగంలో వుంది, అంచేత అవగాహన వున్న మనిషి అని తను ఇన్నాళ్లుగా పెట్టుకున్న ఆశ వుత్త భ్రమ అని తెలిసిపోడంతో కుంగిపోయాడు బంగార్రాజు. మనసంతా దిగులే అయికూర్చున్న స్థితిలో కాకతాళీయంగా పరిచయమైన సుందరి, ఆకారంలోనే కాకుండా మనసులోను, ఆలోచనా సరళిలోను కూడా సుందరే అని రుజువు చేసుకుంది. ఆమెది ఎంత ఉదార స్వభావం కాకపోతే 'నా లాప్‌టాప్‌ని మీరు స్వేచ్ఛగా వాడుకోండ'ని ఆఫర్ చేస్తుంది?

ఆమె పెద్దమనసుతో ఉదారంగా ఇచ్చిందాన్ని.. ఉల్ఫాగా దొరికిందని తక్కువగా ఆలోచించి, ఆటవస్తువులా ట్రీట్ చేసి దుర్వినియోగం చెయ్యకూడదని నిశ్చయించుకున్నాడు బంగార్రాజు. నాల్రోజులు వాడుకొని ఆటవస్తువుని తిరిగి ఇచ్చేసినట్టు ఇచ్చేస్తే, తనకీ, చిన్నపిల్లలకీ తేడా ఏమిటీ? అంచేత ఆమె ప్రసాదించిన ఈ వరంలాంటి ఆపర్చ్యునిటీని సద్వినియోగం చెయ్యగలిగితే 'వస్తువుని ఇయ్యడం ఎంత మంచిపని అయిందీ!' అని ఆవిడా, 'ఒకరు ఆయాచితంగా ఇచ్చిన వస్తువుని సద్వినియోగం చేసుకోగలిగేను' అనే తృప్తి తనకీ మిగులుతుంది. ఈ రకమైన ఆలోచనలతో బంగార్రాజు తన ఊహలో చాలాకాలంగా మెదలుతున్న ఒక సాఫ్ట్‌వేర్‌కి సీరియస్‌గా రూపకల్పన చెయ్యడం మొదలు పెట్టేడు. సీరియస్‌గా సాగుతున్న ఆ ప్లానింగ్ నుండి డీవియేట్ కాకుండా చూసుకుంటున్నాడు. అదృష్టం కలిసొచ్చేలా కనిపిస్తున్నాయి అప్పటి వరకూ వచ్చిన ఫలితాలు. డెవిలిష్ డిటర్మినేషన్‌తో వర్క్‌ని కంటిన్యూ చేస్తున్నాడు బంగార్రాజు. మూడోరోజు మధ్యాహ్నానికి అనుకున్నది సాధించేసేడు. అనుకున్న లైన్లో సాఫ్ట్‌వేర్ తయారయిపోయింది. ఆ సాఫ్ట్‌వేర్ మార్కెట్లోకి వెళ్లిందంటే, బిజినెస్ వరల్డ్ అదిరిపడుతుంది.. ఆ విషయం ఖాయం. ఆనందంతో వుక్కిరి బిక్కిరయిపోతున్నాడు బంగార్రాజు. తన సక్సెస్ స్టోరీ గురించి

ముందుగా భార్యకి చెప్పాలని అనిపించ లేదు, ఎందుకనో! ఆవిడికి చెప్తే ఎంకరేజింగ్‌గా ఒక్కమాట కూడా అనదు సరి కదా! ఏవో వంకలు ఎంచి సూటీపోటీ మాటల్ని అని తీరుతుంది. తన ఉత్సాహం మీద చన్నీళ్లు చిలకరించడం ఆవిడకి అలవాటయిపోయిన విద్య. అలాటి మని షికి తను సాధించిన విజయం గురించి చెప్పి ప్రయోజనమేమిటి? క్రమేపి ఆవిడకే తెలుస్తుంది, ప్రొడక్ట్ మార్కెట్లోకి వచ్చి విజయయాత్ర సాగిస్తూవుంటే. చాలా కాలం తర్వాత ఎందుకో హాయిగా, తృప్తిగా అనిపిస్తోంది జీవితం. ఏదో గొప్ప కంప్లేసెంట్ ఫీలింగ్! నిద్ర మీద, భోజనం మీదా ధ్యాస లేకుండా ఈ నాలుగైదు రోజులూ గడిపాడేమో హాయిగా కాసేపు నిద్ర పోతే బావుండ్ననిపించి దుప్పటీ తన్ని నిద్రలోకి జారుకున్నాడు.

తన ప్రజెన్స్‌ని ఏమాత్రం పట్టించు కోకుండా నిద్రపోతున్న బంగార్రాజు నిద్రకి మరోరకంగా భాష్యాన్ని యిచ్చుకుంది భాగ్యలక్ష్మి.

ఒక మంచి ఆలోచనతో నిద్రలేచేడు బంగార్రాజు. తను సుందరికి ఎంతగానో రుణపడి వున్నాడు. ఆమె ఇచ్చిన లాప్‌టాప్ మీద వర్క్‌చేసే ఈ కొత్త సాఫ్ట్‌వేర్‌ని విజయవంతంగా డిజైన్ చెయ్యగలిగేడు. ఈ వర్క్ ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ కార్పొరేట్ ప్రపంచంలో ఓ చిన్నసైజు సంచల నాన్ని సృష్టించడం ఖాయం. ఇకపోతే, దీని తర్వాత తన భవిష్యత్ ఎలా వుండ బోతోంది? 'మెటియోరిక్ రైజ్' అన్న విష యంలో అనుమానమే లేదు. తను కూడా ఐటి రంగంలో ఓ సెలబ్రిటీ అయి కూర్చుంటాడు అచిరకాలంలోనే, అనుమా నంలేదు. అయితే ఈ విజయానికి నిజ మైన కారణం మెయిన్ సోర్స్ ఆఫ్ ఇన్‌స్పిరేషన్ సుందరి.. సుందరి.. సుందరి.. ముమ్మాటికీ సుందరే కారణం. ఇంతకు ముందు మాత్రం తన దగ్గర సిస్టమ్ లేదా ఏంటిటి? కానీ దానిమీద తను ఏమేనా సాధించగలిగేడేమిటి? ఓ డజనో, రెండు డజన్లో క్లాస్ అయిన అమ్మాయిల్ని నగ్నంగా చూడగలగడం తప్పిస్తే? అదుగో ఆ సమయంలోనే, కాంప్రమైజింగ్ పోశ్చర్సులో వున్న అమ్మాయిల్ని చూస్తూ కాలం గడిపేస్తున్నానని గమనించి, ఆ సిస్టమ్‌ని కాస్త అమ్మిపారేసింది తన భార్య.

బహుశా దానివల్ల కూడా మంచే జరిగిందేమో! ఒక విలువైన వస్తువుని సవ్యంగా వాడుకునే పద్ధతి ఏదో తెలిసివచ్చింది. సుందరి ఎంతో మంచి మనసుతో సిస్టమ్‌ని లెండ్ చేసి వుంటుంది. లేకపోతే, తను ఇంత తక్కువ వ్యవధిలో ఇంత మంచి మార్కెట్‌టూల్‌గా ఉపయోగపడ డానికి అవకాశం వున్న సాఫ్ట్‌వేర్‌ని ఎలా తయారుచేయగలుగుతాడు? సిస్టమ్‌ని ఇస్తూ ఆమె అన్న మాటలు తనకి బాగా జ్ఞాపకం వుండిపోయేయి.

“బంగార్రాజుగారూ! మీరు అనవసరంగా వర్రీ అయిపోకండి, నాకేదో పనికొచ్చే పరికరాన్ని కర్టసీ కోసం మీకు లెండ్ చేస్తున్నానని. సహజంగా నేను చాలా బద్ధకస్తురాల్ని.. చూస్తున్నారు కదా! బంగారంలాటి మొగుడికి కనీసం కొంచెం మంచి భోజనం కూడా వేళకి పెట్టలేక పోతున్నాను. చెప్పుకోడం కాదుగానీ మా ఆయన నిజంగా బంగారుకొండ! కనక సరిపోతోంది. నేనే గడ్డి పెట్టినా పల్లెత్తుమాట అనకుండా తినేస్తాడు. నా గురించి తల్చుకుంటుంటే నాకే అసహ్యం వేస్తుంటుంది. ఒక్కొక్కప్పుడు ఛీ! ఏమిటిది? ఇంతమంచి మొగుడికీ రుచిగా రెండంటే రెండు వంటకాలు చేసి అన్నం పెట్టలేకపోతున్నానే అని. అలా అనిపించినప్పుడల్లా ఏడుపొచ్చేస్తుంటుం దంటే నమ్మండి!

నిజం చెప్పడానికి నేనెన్నడూ వెనకా డను. ఈ మూడ్నాలుగు రోజుల్నుండి

మీరు తయారుచేసి ఇస్తున్న కూర, పచ్చడి, సాంబారులతో చచ్చిన జిహ్వ లేచొచ్చినట్ట నిపించి, కొంచెం తిండి వంటపడుతోం దంటే నమ్మండి! దాంతో స్వయంగా ఆయనే అన్నారు 'సుందరీ! బంగా[రాజుగా రికి ఏం చేస్తే రుణం తీర్చుకోగలమే? పాపం! ఆయన తన సాఫ్ట్‌వేర్ పర్స్యూ ట్స్‌ని ఇంటిదగ్గరే కంటిన్యూ చెయ్యడానికి వీలుగా లాప్‌టాప్ కూడా వున్నట్టులేదు. నువ్వు ప్రస్తుతానికి ఏమీ వర్క్ చెయ్యడం లేదు కదా! పోనీ నీ లాప్‌టాప్‌ని అతనికి కొన్నాళ్ళు లెండ్‌చెయ్యకూడదూ' అని. అంచేత మీరు మొహమాట పడకుండా ఈ సిస్టమ్‌ని కొన్నాళ్ళు వాడుకోండి" అంది.

> **కొత్తగాలి...**
>
> **అమ్మ ప్రేమ ఆకాశమంత!**
> **త్యాగానికి అర్థం అమ్మ!**
> **బాధ్యతకు అద్దం అమ్మ!**
>
> – గిరిపట్ల,
> మణికొండ, హైదరాబాద్

'భార్య, భర్త ఇద్దరికిద్దరూ ఎంత మంచి వాళ్ళు! ఎంత మంచి మనసుతో ఇచ్చేరో! కనకనే తన ఎఫర్ట్ క్లిక్ అయి, ఇంత అదృష్టం నాలుగు రోజుల కృషితోనే కలి సొచ్చేసింది. ఇది నాకు లక్‌ని తెచ్చిపెట్టిన లాప్‌టాప్. అంచేత, ఎలాగైనా దీన్ని నాద గ్గరే అట్టిపెట్టేసుకోవాలి, ఆమెకి మళ్ళీ వాపసు చెయ్యకుండా. అయితే ఆమె వస్తు వుని ఆవిడకి తిరిగి ఇవ్వనంటే, సబబుగా వుండదు కదా! దీనిమీద వర్క్ చేసు కుంటూ పోతే, ఇంకా ఎన్నెన్ని విజయాల్ని సాధించడానికి అవకాశాలు వస్తాయో! ఏం చెప్పగలను? దీనికి బదులుగా భాగ్యలక్ష్మి కొని తెచ్చిన కొత్త లాప్‌టాప్‌ని ఆవిడకి ఇచ్చేస్తే ఎలా వుంటుందిట? భేషుగ్గా వుంటుంది! తీసుకున్న వస్తువుని వాపసు చేసినట్టూ వుంటుంది.. కృతజ్ఞతా నివేదన చేసుకున్నట్టూ వుంటుంది..' ఈ రకంగా సాగుతున్నాయి బంగా[రాజు ఆలోచనలు.

'మరి అలా చేస్తే! నీ భార్యతో గొడవ వస్తుందేమో కదా!' అని హెచ్చరించింది మనసు.

'అవును! అదీ నిజమే! భాగ్యం గొడవ చేసి తీరుతుంది. కానీ ఇది నా వ్యక్తిగత సమస్య. కుటుంబానికి సంబంధించిన సమస్య కానేకాదు. నేను చెప్పడానికి వీల్లే నంతగా సుందరికి రుణపడి వున్నాను. మాటవరసకి- ఇన్నాళ్ళూ స్ట్రైక్ అవని ఈ కొత్తసాఫ్ట్‌వేర్ ఐడియా ఆవిడ యిచ్చిన లాప్‌టాప్ మీద వర్క్ ప్రారంభించీ ప్రారంభించగానే ఎందుకు స్ట్రైక్‌అవాలి? ఐడియా ఇన్నాళ్ళూ రాలేదనీ కాదు, రావనీ కాదు! ఐడియాలు వస్తూనే వుంటాయి. కానీ వచ్చిన ప్రతి ఐడియా కాంక్రీటు షేప్‌ని సంతరించేసుకుందేవిటి? ఇదే చూడ్రాదూ! ఓ మిరాకిల్‌లాటి తమాషా! సుందరిగారి లాప్‌టాప్ మీద వర్క్ ప్రారం భించీ ప్రారంభించగానే.. ఈ కొత్త సాఫ్ట్ వేర్ గురించి ఐడియాస్ ఫ్లడ్‌లాగ వచ్చేయ డమేమిటి? నాలుగు రోజుల్లో సాఫ్ట్‌వేర్ ఫైనల్ డ్రాఫ్ట్ తయారయిపోడమేమిటి? ఇదంతా నథింగ్ షార్ట్ ఆఫ్ ఎ మిరాకిల్!'

ఈ రకంగా బంగా[రాజు స్వగతించుకుం టుంటే, అవతల భాగ్యలక్ష్మి తన స్వగ తంలో తనుంది. 'అంత ఖరీదైన లాప్ టాప్‌ని కొన్నానా? అది వారం రోజులుగా అలా ఆ టీపాయ్ మీదనే అఘోరిస్తోంది. కనీసం దాని పేకింగ్ విప్పైనా చూడలేదు ఈ మొగుడుగాడు! ఆ కులుకులాడి ఇచ్చిన డబ్బాని అలా అంటిపెట్టేసుకొని మరీ కూచుంటున్నాడు అహోరాత్రాలూ! అంటే దానర్థం అది విసిరిన వల బాగా బిగుసు కుందన్న మాట..!' అనుకుంటూ.

ఇవతల బంగార్రాజు తన స్వగతాన్ని మరికాస్త పొడిగింపచేస్తూ ఇలా మొదలెట్టేడు. 'ముచ్చటైన లాప్‌టాప్‌ని కొని తెచ్చింది నా కోసం. అప్పుడే వారం కావస్తోంది, వస్తువు ఇంటికొచ్చి. పాపం! ఏమిటనుకుంటోందో? ఏమిటో? నేను కనీసం దానివైపు చూడనైనా చూడలేదని. అసలే బొత్తిగా అనుమానాల మనిషి. పక్కింటావిడతో కాస్త కలుపుగోలుగా వుంటుండడం, ఆవిడిచ్చిన లాప్‌టాప్ మీద అదేపనిగా రాత్రీపగలూ అనకుండా వర్క్ చేస్కుంటూ ఉండడం.. ఇవన్నీ చూసి బహుశా బాగా ఈర్ష్య పడిపోతూ వుంటుంది. ఈర్ష్యే కదా స్త్రీలకి అలంకారం అన్నారు? సుందరి ఆ లాప్‌టాప్ ఇవ్వడం కాదుగానీ దెబ్బకి దయ్యం దిగి వచ్చినట్టయింది! కొంచెం అశ్లీలంగా అనిపించే బొమ్మల్ని చూస్తూ కూర్చోడం తప్పే! కాదనను, కానీ అక్కడికి నేనేదో ఘోరాలు చేస్తున్నట్టు గుండెలు బాదేసుకొని తిన్నగా ఆ సిస్టమ్‌ని తీసికెళ్ళి అమ్మిపారేయడం ఏం న్యాయం? ఇదిగో ఇప్పుడీ డెల్ లాప్‌టాప్ పట్టుకొచ్చింది! తను చేసిన పొరపాటుకి ఎమెండ్‌మెంట్‌లాగ.

ఎంత డబ్బు పోసి కొందో? ఏమిటో? లేటెస్ట్ కన్ఫిగరేషన్ వున్న సిస్టమ్‌లా అనిపిస్తోంది, ప్యాకింగ్ చేసిన పద్ధతి చూస్తుంటే! ఉద్యోగం వున్నన్నాళ్ళూ కన్నూమిన్నూ కానకుండా వచ్చిన డబ్బంతా చిల్లపెంకుల్లా ఖర్చు పెట్టడం వల్ల ఇవాళ చిన్నచిన్న సరదాల కోసం కూడా ఆవిడ మీదే ఆధారపడవలసి వస్తోంది. ఇంకా నయం! దేవుడు మేలుచెయ్యబట్టి భాగ్యానికైనా వుద్యోగం నిలబడి వుంది. అంచేత తిండికీ, మామూలు దర్జాలకీ లోటులేకుండా బండి నడిచిపోతోంది.

లేకపోతేనా, ఏ స్టార్‌హొటెల్‌లోనేనా చెఫ్‌గా చేరవలసి వచ్చేది. అయితే, బాగా ఆలోచిస్తే అనిపిస్తుంటూంది ఈ బోడి ఐటి వుద్యోగం కన్నా వంటవాడి వుద్యోగమే బెటరేమోనని! తుమ్మితే వూడిపోయే ముక్కులా వున్నాయి ఈ ఐటీ వుద్యోగాలు. అయినా మాంచి పాకశాస్త్ర వైదుష్యం వున్నందుకు నన్ను నేను అభినందించుకోవలసిందిపోయి- అభిశంసించుకుటున్నానేమిటి? అక్కడికదేదో హీనమైన బతుకులాగ! ఏ రోడ్డు చివరేనా ఓ కాకా హోటల్లాటిది పెడితే చాలు! జనాలు ఎన్నాళ్ల నుండో తిండి దొరకని వాళ్లలా ఆవురావురుమని వచ్చి తినేస్తున్నారు, దొరికిన ప్రతిగడ్డినీ! అలాటిది తనుగానీ నేతి పెసరట్టు, జీడిపప్పు, టమోటా, ఉల్లి, నెయ్యి వేసి చేసిన ఉప్మా.. ఇలాటివిగానీ పెడితే? అదిరిపోదూ బిజినెస్! ఇన్‌కమ్ టేక్సు వాళ్లకి దొరక్కుండా లాభాల్ని దోచిపెట్టే ఏకైక బిజినెస్ బడ్డీహోటల్!

ఇంతకీ! అసలు విషయం మరిచేపోయాను. కొత్త లాప్‌టాప్‌ని కనీసం దాని రేపరైనా ఊడదీసి ఓమారు చూడడం నా కనీస ధర్మం కదా? కానీ అది చెయ్యడానికి కూడా టైముండడంలేదు. ఈ కొత్త సాఫ్ట్‌వేర్ పని పూర్తయిన తర్వాతనే మిగతా పనులన్నీ, అంతే! ఇది క్లిక్ అవాలిగానీ, ఐటీ కంపెనీలవాళ్లు కుమ్మరించేవారు లక్షలకి లక్షలు! పొరుగు వాటా సుందరిగారు వాడుకోమని ఇచ్చిన లాప్‌టాప్.. అదే నా పాలిట ధనలక్ష్మి! వచ్చే డబ్బుతో ఆవిడకి కనకాభిషేకం చేసినా తీరదు రుణం. అసలావిడ మనస్సేమిటి? కేవలం వెన్నపూస!

ఒకరికి సాయపడాలనే గుణం అలవాటు చేసుకోవడానికి వీలుపడదేమో! మస్ట్ బి ఏన్ ఇన్‌బార్న్ గిఫ్ట్! బంగారానికి తావి అబ్బినట్టు! అంత అందమైన మనిషికి.. ఎంతో అందమైన మనసు కూడా ఇచ్చేడు దేముడు. ఆవిడకి తగిన భర్తే ఆ బాబూరావు కూడాను! భార్య ఏంచెప్పినా తలాడించి అంగీకారం చెప్పడమే గానీ నెగెటి

వ్‌గా కనీసం తలని ఆడించడం కూడా చెయ్యడే మానవుడు! అలాటి ఐడియల్ కపుల్‌ని చూడగలగడమే ఓ అదృష్టం! మా భాగ్యలక్ష్మి వుంది.. మనిషి మంచిదే కానీ.. ప్రతికూల భావాలకు కాణాచి! ఇంతకీ ఆవిడ కొన్న లాప్‌టాప్‌ని నేను కనీసం ఓపెన్ చేసి చూడనైనా చూడలేదని ఏ కారాలు మిరియాలు నూరుతోందో? ఏమిటో? నేను వర్క్ చేస్తున్న సిస్టమ్‌లోని వర్క్‌నంతట్నీ ఆ కొత్త సిస్టమ్‌లోకి ట్రాన్స్‌ఫర్ చేసి, వర్క్ కంటిన్యూ చెయ్యాలంటే ఇక పని అయినట్టే! జపం విడిచి లొట్టల్లో పడ్డట్టవుతుంది! ఇంతకీ అచ్చొచ్చిన ఈ లాప్‌టాప్‌ని వదిలేసి కొత్తది కదా అని దానిమీదకి మారితే దాని అదృష్టరేఖ ఎలా ఏడిచి చస్తుందో ఎవడికెరుక! అంచేత ఈ పనిమొత్తం పూర్తయ్యేదాకా మరో కంప్యూటర్ని తాకే ప్రశ్నే లేదు.

మరోవారం గడిచింది. బంగార్రాజు తను తయారుచేసిన కొత్త సాఫ్ట్‌వేర్‌ని కొన్ని ప్రముఖ సంస్థల దగ్గరకి తీసికెళ్ళి ట్రయల్ ప్రదర్శనలు చేశాడు. అచ్చం బజార్లో కూరగాయలవాళ్ళు కేకలువేసి, అరిచి, గంతులు వేసీ ఎలా తమ సరుకుని అమ్మాలని ప్రయత్నం చేస్తుంటారో, అలాగే రకరకాల విన్యాసాలతో, ధ్వనులతో వింటున్నవాళ్లని సమ్మోహనంలో పడేస్తూ తన సరుకుని ప్రదర్శించాడు. డంగైపోయారు సాఫ్ట్‌వేర్ కంపెనీల వాళ్లంతా. దాంతో మాకిచ్చీ అంటే మాకిచ్చీ అని ఒకటే మేడ్ రష్ - వర్చువల్ స్క్రాంబుల్! సాఫ్ట్‌వేర్ వర్తకులంతా పోటీలు పడి మరీ ఆఫర్లు! ఓ పేద్ద చెక్‌ని అందుకొని (కౌన్ బనేగా కరోడ్‌పతి క్విజ్ పోటీలో- విజేతలకి ఇస్తుంటారు చూడండి- ఓ చిన్నసైజు బ్లేక్ బోర్డంత సైజులో వుంటుంది చెక్కు- అలాటిది కాదు సుమండీ.. పెద్దచెక్కంటే. పెద్దచెక్కంటే కళ్ళు చెదిరేంత పెద్దమొత్తం వేసిన చెక్కన్నమాట!) గాలిలో, ఊహల మేఘమాలికల్లో తేలిపోతూ ఇల్లు చేరుకున్నాడు బంగార్రాజు.

అతను ఇంటికి వచ్చిన వేళకి భాగ్యలక్ష్మి ఇంకా ఆఫీసులోనే వుంది. బంగార్రాజు ఇంటికి ఎలాంటి ఉత్సాహంతో వచ్చాడూ అంటే- భార్యని అమాంతం ఎత్తేసుకొని, అటూఇటూ పరిగెత్తి, చిన్న ఫాక్స్ ట్రాట్‌లాటి డాన్స్ చేసి, ఆమె తన పిచ్చి ప్రవర్తన అర్థం చేసుకోలేక, భయంతోనీ, ఆందోళనతోనీ వెలవెలబోతుంటే చెక్కుని ఆమె చేతిలో పెట్టి ఆమె ముఖంలో వెలిగే ఆశ్చర్యపు సహస్రవాట్ల బల్బ్ కాంతిని దర్శించాలనే చండప్రచండమయిన కోరికతో ఇంటికి వచ్చాడు బంగార్రాజు. కానీ భార్యని ఇంటివద్ద కానక, మిక్కుటమైన నిరాశకు లోనయినవాడై తదుపరి ఏంచెయ్యాలో పాలుపోక, బాల్కనీలోకి వచ్చి అటూఇటూ పచార్లు మొదలెట్టేడు.

బంగార్రాజు కాలుకాలిన పిల్లిలా పచార్లు చేస్తుండడం కనిపెట్టిన సుందరి తక్షణం రంగప్రవేశం చేసి "ఏంవిట్రాజుగారూ! ఆలోచన తోచని వాడిలా అలా పచార్లు చేస్తున్నారు? ఇంతకీ పండా? కాయా? " అనడిగింది. ఈ పలకరింపు విని బంగార్రాజు ఎంతలా పొంగిపోయాడంటే, అమాంతం వెళ్లి, సుందరిని ఎత్తేసుకొని, ఘాట్టిగా ముద్దులాడి, ఆమె చేతిలో కంపెనీవాళ్లు ఇచ్చిన చెక్కుని పెట్టాలన్నంత తీవ్రమయిన ఎమోషన్‌లోకి వచ్చేశాడు. తన ఈ అదృష్టానికి కారణం ఆవిడ ఇచ్చిన లాప్‌టాపే కదా! తన కృతజ్ఞతని తెలియచేసుకోవాలి. దానికోసం ఏం చేస్తే బావుంటుంది? ఆమెని అమాంతం ఎత్తేసుకొని, గిరగిర తిప్పి, గట్టిగా ఓ రెండు ముద్దులు యిచ్చి, తరవాత ఆవిడ్ని కిందికి దింపి చెక్కుని చేతిలో పెడితే..? అది హద్దులు మీరడం అనిపించుకుంటుందా? బహుశా అనిపించుకోదు! కానీ బాల్కనీ

# నడుమెక్కడే నవలాంగి!

మన ప్రాచీన కవులు సుందరాంగుల గురించి చెప్పేటప్పుడు పిడికెడు నడుం అంటూ వర్ణించడం ఇలాంటి భామల్ని చూసే అనుకోవాలి. ఎందుకంటే - అమెరికాకు చెందిన ఈ క్యాథీ జంగ్ నడుం కేవలం 15 అంగుళాలే నట! మరో విశేషం ఏమంటే ఇప్పుడామె వయస్సు అక్షరాల డెబ్బయిపడేళ్లు! బాప్‌రే!! ఆమెను చూసినవారంతా అంత చిన్ననడుములో పొట్టలోని అవయవాలన్నీ ఎలా ఒదిగాయబ్బా? అని ఆశ్చర్యపోతున్నారు. ప్రస్తుతం జీవించి వున్నవారిలో అత్యంత సన్నటి నడుము కలదిగా ఆమె గిన్నిస్‌బుక్ రికార్డుల్లోకి ఎక్కింది!

వారేవ్వా!



లని వేరు చేస్తూవున్న బలమైన గ్రిల్స్ అతని వుత్సాహానికి అడ్డుకట్ట వేసేశాయి. అతనికి లాంగ్ జంప్, హైజంపుల్లో ప్రావీణ్యం వుండి వుంటే, బాల్కనీలకి గ్రిల్స్ లేకుండా వుండి వుంటే, రెండు పోర్ష న్లనీ వేరుచేస్తున్న పిట్టగోడని అవలీలగా లంఘించేసి, తను మనసులో ఉత్సాహప డిన కార్యక్రమాన్ని కొనసాగించి వుండే వాడు. కానీ అతనికి క్రీడల్లో ప్రావీణ్యం లేదే! అదియునుంగాక ఇనుప చట్రమొకటి అడ్డుగా వున్నది కదా! ఏతావాతా ఏక్షన్ కి అవకాశం లేకపోవడంతో దిశని మార్చి డైలాగుల్లోకి దిగేడు.

"ఇదేంవిటో చూడండొకసారి!"

కళ్లు చికిలించి చూసిన సుందరి "ఏంవి టది? ఏదో చెక్ లా కనిపిస్తోందే!" అంది.

"కనిపించడం ఏమిటండీ? చెక్కే! ఇంతకీ ఎంత ఎమౌంట్ కి అనుకుంటు న్నారు ఈ చెక్కు?"

"నాకు అంకెలు కనపడ్డం లేదండీ! కొంచెం హ్రస్వదృష్టి వుంది కదా!"

"మీకున్నది హ్రస్వదృష్టి కాదండీ బాబూ! ఐశ్వర్యదృష్టి! మహాలక్ష్మీ కటాక్షవీక్షణం! అందుకే అనుకుంటాను.. 'కనకధారాస్తో త్రం'లో శంకర భగవత్పాదులవారు లక్ష్మీ అమ్మవారిని స్తోత్రం చేశారు"

"ఏంవిటో రాజుగారూ! నాకసలు బోధప డని విషయాలు ఏవేవో అంటున్నారు. 'వాల్లభ్యలభ్య ధ్వజగ్రహణంబో, శృంగార పల్యంకికా హరణంబో' అన్నారట విష్ణుచి త్తులవారు పాండ్యరాజు కొలువులో వాద నకి వెళ్ళవలసిందని శ్రీహరి ఆజ్ఞాపిస్తే! కానీ నాబోటి దానికి వేయించిన సమోసా గ్రహణంబో, ఆలూ బోండా కైంకర్యంబో తప్ప మరే ఇతర విషయములూ తిన్నగా బోధపడి చావవే"

"అలా అనీకండి మేడమ్! 'చూపరుల కెరుకకాని రీతి మీరు పంచియిత్తురు సిరుల కటాక్షముల్!"

"ఇవాళ మీ ప్రసంగమంతా పురాణ భాషలో నడుస్తున్నది కదా! శరీరా రోగ్యము సవ్యముగా లేదన్న సాకుతో- కించిదౌషధ సేవనమొనర్ప లేదు కదా?"

"హరిహరీ! ఎంతమాట అన్నారు! నేను పూర్తి అదుపులో ఉండియే మాటాడుచు న్నాను. నేను గ్రాంథిక భాషలో ప్రసంగిం చున్నానని నిందిస్తున్నారుకదూ? అయితే మీరునూ ఏమీ తక్కువ తినలేదే! మీ భాషాభేషజంతో నాకు గుండె దడ వచ్చే టట్టు చేస్తున్నారు"

"ఇవన్నీ సరేగాని, బంగార్రాజుగారూ! ఇలా అప్రస్తుత ప్రసంగంతో కాలాన్ని గడి పేస్తారా? లేకపోతే చెప్పాలనుకుంటున్న పాయింట్ కి వస్తారా?"

"అమ్మయ్య! బండిని రైట్ ట్రాక్ లోకి తిప్పేరు థాంక్స్! ఒక్కొక్కప్పుడు చెప్పాల నుకున్నది డైరెక్ట్ గా చెప్పలేమండీ! ఈ రక మైన డొంకతిరుగుడు అప్రస్తుత ప్రసంగం తప్పనిసరై పోతుందండి! ఎలా ప్రారంభిం చాలా? అని భూమిక కోసం ఎదురుచూ స్తున్న నాకు ఒక తోవ చూపించేరు. కానీ మీరు చూపిన బాట మామూలు బాట కాదే! అది అచ్చు బంగారపు బాట! మీ స్వహస్తాలతో ఇచ్చిన లాప్ టాప్.. అది నాకు ఏం తెచ్చి పెట్టిందో తెలుసునా?"

"కొంపతీసి ఏ ప్రొస్క్రైబ్డ్ పిక్చర్స్(నిషే ధిత సినిమాలు)నో చూస్తూ పోలీసులకి దొరికి పోలేదు కదా?"

"అబ్బబ్బ! రసకందాయంలో రాక్షస ఘట్టాల్ని ప్రస్తావించి రంజుని పాడుచెయ్య కండీ!"

"మరైతే ఏం జరిగిందో వితౌట్ ఎనీ ఫర్దర్ సస్పెన్స్ చెప్పండి. భూమ్మీద నిల బడకుండా ఎందుకు ఇంతలా చిందులు వేస్తున్నారు?"

"చిందులు వెయ్యడం కాదండీ అది ఆనందతాండవం!"

"ఆనందతాండవమో? అలమండ

అంటుమామిడి తాండ్ర నృత్యమో? దాన్ని ఆపి, అసలు పాయింటుకి వస్తే కదా! మీరెందుకింతలా ఎక్సైటెట్ అయిపోతున్నారో తెలిసేది? "

"అయితే సరే! ఇంక మరే రకమైన డొంకతిరుగుళ్లు లేకుండా అసలు పాయింటు లోకి వచ్చేస్తున్నాను. నా సాఫ్ట్ వేర్ క్లిక్ అయిందండీ అందుకే ఈ టాప్ ఆఫ్ ది వరల్డ్ ఫీలింగ్. రేపట్నుంచీ నేను చిల్లర పైసలక్కూడా దేబిరిస్తూ నా భార్య ముందు ఒదిగి నిలబడవలసిన అవసరం లేదు. ఇక మనమే మన రిచ్చెస్‌ని అంద రికీ లిబరల్‌గా ఇవ్వగలిగే స్థితికి వచ్చే మన్నమాట!"

"అబ్బ! అబ్బ!! ఎంతమంచి మాట చెప్పారండీ బంగార్రాజుగారూ! ఉండండి! అర్జెంటుగా ముందు మీనోరు తీపి చెయ్యా నివ్వండి!" అని సుందరి సుడిగాలి వేగంతో తుర్రుమంది లోపలికి.

'అదీ రైట్‌స్పిరిట్ అంటే! సంతోషాన్ని సంపూర్ణంగా, ఎంతలా ముఖంలో ఎక్స్ ప్రెస్ చేసింది? ముఖంమీద ఎప్పుడూ మిరియాల కషాయం, శొంఠి కలిసి మరుగుతున్నట్టు గ్రిమ్ ఎక్స్‌ప్రెషన్ కని పించదే!' అని స్వగతించుకుంటూ, 'ఇంకా ఏ రకంగా మాడ్యులేషన్ వుంటే తన సంతోషాన్ని ప్రోపర్‌గా వ్యక్తీకరించ గలు గుతామా?' అని ఆలోచిస్తూ బంగార్రాజు, ఆ మూడూ బై ఆరు బాల్కనీలో ఒక కేజ్డ్ పాంథర్‌లా పచారు చేస్తున్న సమ యంలో..

సుందరి చిన్న వెండిగిన్నెని సుతారంగా తన అరచేతిలో పొజిషన్ చేసి - అపర జగన్మోహినీ అవతారంలా రంగప్రవేశం చేసింది. ప్రవేశిస్తూనే "ఇదిగో బంగార్రాజు! కంగ్రాట్స్ షర్ ద ఎఛీవ్‌మెంట్! ముందు ఈ స్వీటు తినండి! నేను స్వయంగా చేసింది" అంటూ ఓ చిన్నసైజు బాల్‌లాటి వస్తువుని బంగార్రాజుగారి బాల్కనీలోకి విసిరింది.

సాక్షాత్తు శ్రీమహాలక్ష్మే సదరు స్వీటుని తన మీదికి విసిరినట్టు భావించి భక్తి భావంతో దాన్ని క్యాచ్‌పట్టి కళ్లకి అద్దుకు న్నాడు.

అందుకున్నాడే గానీ, ఆ గుండ్రని పదా ర్థపు తాకిడికి కించిత్ చలించినవాడై.. "ఇది పిరియాడిక్ టేబుల్‌లో మనకింతవ రకూ కనిపించి వుండని ఏదేనా కొత్త మూలకంతోగానీ తయారయిందా? అని పించగా మనస్సులోనే ఎందుకో కించిత్ కీడుని శంకిస్తూనే, నోటికి అందించి ఓ కొరుకు కొరికేడు. ఆ కొరుకు దెబ్బకి మీద నున్న పళ్లు, కిందనున్న పళ్లు కూడా కుదు ళ్లతో సహా కదిలినట్టనిపించి కెవ్వున అర వబోయి, ఆ అరుపుని యమప్రయత్నంతో

కొత్తగాలి...

**మేకప్పు వేస్తే**
**హీరో!**
**పేకప్ చెప్పాక**
**జీరో!!**

– వి. శ్రీలక్ష్మి,
హైదరాబాద్

బయటికి రాకుండా ఆపి, సదరు స్వీటుని నోట్లోంచి బయటకి తీసి, ఇటిక పెళ్లని పట్టుకున్నట్టు దాన్ని పట్టుకొని ముఖం నిండా రాని నవ్వుని తెచ్చి పెట్టుకుంటూ.. "వెరైటీగా వుంది స్వీటు! దీనికి చాలా పో సిబిలిటీస్ వున్నట్టు అనిపిస్తోంది. దీనిమీ ద ఓ సాఫ్ట్‌వేర్ తయారుచెయ్యలేమా? " అన్నాడు.

"దానికేం భాగ్యం! అలాగే చెయ్యొచ్చు! మరోసారి మళ్లీ ఉద్యోగం వూడిందను కోండి! అప్పుడు ఈ స్వీటుకి సంబంధిం చిన సాఫ్ట్‌వేర్ తయారుచేద్దురుగాని!

అయితే దీన్ని సాఫ్ట్‌వేర్ అనడం కంటే హార్డ్‌వేర్ అంటే మోర్ ఎప్రోప్రియేట్‌గా వుంటుందేమో!

ఈ స్వీటుకి పాకం కాస్త బాగా ముదిరి పోయిందని, దానివల్ల ప్రొడక్ట్ హార్డ్‌గా, గ్రేనైట్‌లాగ తయారయిందని మీరు పసిగట్టేశారా?

దీన్ని తయారుచేసీ చెయ్యగానే మా బడుద్ధాయికి తినమని పెట్టేను. దాన్ని నమిలి, కెవ్వున కేకపెట్టి 'ఓమారలా డెంటిస్టు దగ్గరకి వెళ్లొస్తాను సుందరి!' అన్ని బయల్దేరాడు. అతగాడు అలా వెళ్లేడు, ఇలా మీరూ వచ్చేరు. 'స్ట్రైక్ ది ఐరన్ వైల్ ఇట్ స్టిల్ హాట్' అన్న నానుడి గుర్తుకు వచ్చి పోనీ వేడిగా వున్నప్పుడే కాస్త బంగారాజుగారిక్కూడా పెట్టి చూద్దాం! అనిపించింది. చల్లారితే ఇది కాంక్రీటులా సెట్ అయిపోయి హరిబ్రహ్మాదులకి కూడా లొంగని ఘనపదార్థం అయిపోతుందనిపించింది. ఫర్వాలేదు! మీరు బాగానే రిసీవ్ చేసుకున్నారు. కెవ్వున కేక వెయ్యలేదు.. రయ్‌మని డెంటిస్టు దగ్గరకీ పరుగులు తియ్యలేదు" అంది సుందరి కూల్‌గా.

'యమ గట్టిగా వుందని తెలిసీ తనకి పెట్టిందంటే ఈవిడ ప్రాక్టికల్ జోక్స్ కూడా ప్లే చేస్తుంటుందేవిటి చెప్మా!' అనిపించింది బంగార్రాజుకి. సరే! ఓ విసురు విసిరి చూద్దాం అనిపించి "స్వీటుని కాస్త గుల్లగా, నవలడానికి అనువుగా చెయ్యగలిగితే దీనిమీద మీరు పేటెంట్ రైట్స్ తీసుకోవచ్చు" అన్నాడు.

"అలాగే అంటున్నాను కదా! ఈసారి మీకు మళ్లీ వుద్యోగం పోవడం జరిగితే ఇక ఈ దిక్కుమాలిన ఐటి రంగం పేరెత్తొద్దు! ఒట్టు పెట్టుకోండి! హాయిగా కలినరీ సైడ్ వచ్చేద్దురుగాని. అదిగో! అప్పుడు 'పంటినొప్పితో బాధ పడుతున్న వాళ్లకి స్వీట్ రిలీఫ్ కోసం ప్రత్యేకంగా తయారుచేసిన స్వీటు' అని బోల్డ్‌లెటర్స్‌తో ఎడ్వర్టయిజ్‌మెంట్ యిచ్చి, నా స్వీటుకి పేటెంట్ రైట్స్, ఇంటర్నేషనల్ రైట్స్ తీసుకుందురుగాని! అన్నట్టు మరిచేపోయేను, ఈ సాఫ్ట్‌వేర్లూ, ఐటీ కంపెనీ తిప్పలూ మీకెందుకండీ బాబూ! సమోసాలో నాలుగు వెరైటీలని తయారుచేసి పేటెంట్ రైట్స్ తీసుకుంటే ఈ బోడి సాఫ్ట్‌వేర్లమీద వచ్చిందానికి నాలుగురెట్లు లాభాలు గడప దాటకుండా కూర్చొని లాగొచ్చు. పుల్లారెడ్డి స్వీట్ల సక్సెస్ స్టోరీ మనముందు వుండనే వుంది కదా! ఆలోచించండి ఆ లైన్లో!"

"ఉంది! వుంది!! ఆ రకమైన ఆలోచన కూడా వుంది! నిజంగానే ఒక న్యూ రెసిపీ మనసులో అస్పష్టంగా కదులుతోంది. అది కాంక్రీటు షేపులోకి రాగానే, ఓ ట్రయల్ వంట చేసి, మీలాటి ఆప్తులకి తినిపించి, ప్రమాదం లేదని నిర్ధారించుకున్నాక 'మా ఇంటి వంట' లాటి కార్యక్రమంలో ప్రదర్శిస్తాను. ఫలహార ప్రియుల నుండి ఫీడ్‌బ్యాక్ సంపాదించి, అంతా పాజిటివ్‌గా వుంది అని అనిపించగానే, పెద్ద అడ్వర్టయిజ్‌మెంట్ బ్లిట్జ్ క్రీగ్, ఆపైన అంతర్జాతీయంగా పేరుమోసిన భోజన ప్రియుడ్ని ఆహ్వానించి అట్టహాసంగా ఓపెనింగ్.. ఇలా చాలా చాలా ఐటెమ్స్ వున్నాయి ప్లానింగ్ స్టేజ్‌లో. దాన్నంతటినీ అలా వదిలిపెట్టి, ముందుగా మన

## కొత్తగాలి...

**భూమ్యాకాశాలు పత్రాలు**
**కారడవులు కలాలు**
**సప్తసముద్రాలు సిరా**
**రాసేవాడు విధాత!**

– కృష్ణ మాధవరపు,
కాకినాడ

పాయింటుకి వద్దాం! ఇవాల్టి నా విజయానికి అసలు సిసలు సూత్రధారులు మీరు! ముమ్మాటికీ మీరే!!"

"నేనా? ఎలాగట? "

"మీరు మీ లాప్‌టాప్‌ని ఏ మంచి మనసుతో యిచ్చారో తెలీదు కానీ, ఇక అక్కడ్నుంచి అంతా సక్సెస్ స్టోరీయే! నేను డెవలప్ చేసిన సాఫ్ట్‌వేర్‌ని ఇవాళ హ్యూపింగ్ ప్రైజ్‌కి అమ్మగలిగేనంటే అదంతా మీ లాప్‌టాప్‌చలవే!"

"పోదురూ! మీరూ, మీ బడాయీనీ! మరీ ఇంతలా పొగిడితే ఏమనుకోవాలి చెప్పండి? చూశారా చోద్యం, నేనూ ఆ లాప్‌టాప్‌ని ఉపయోగించడం మొదలుపెట్టగానే ఏకంగా నా వుద్యోగమే పోయింది! మరి మీరేమో అది క్లిక్ అయి మీరు గుడ్ ఫార్ఛ్యూన్ తెచ్చి పెట్టిందంటున్నారు!"

"అంటే అబద్ధం చెపుతున్నానంటారా? "

"ఛాఛా! అలా ఎందుకంటానండీ? విధి విన్యాసాలు ఎంత చిత్రంగా వుంటాయో చూశారా? అని అంటున్నాను, అంతే! నా విషయంలో నెగెటివ్‌గా పనిచేసిన లాప్‌టాప్ మీ దగ్గర కొచ్చేటప్పటికి పాజిటివ్‌గా పనిచేసింది కదా! దీనిని బట్టి మనం ఎలాంటి అవగాహనకి రావలసి వుంటుందంటారు? నేనేమిటనుకుంటున్నానో? తెలుసా రాజుగారు? ఈ కంప్యూటర్లని తయారుచేస్తున్నప్పుడే ఎవరికీ అర్థంగాని ఒక విలక్షణమైన అదృష్ట సాఫ్ట్‌వేర్‌ని ఇన్‌బిల్ట్ చేసి వుంటారని.. అందుకే ఈ ఐటి పరిశ్రమ ఇలా ఆటుపోట్లకి గురవుతోందని..! సరే! ఈ ఫిలాసఫిక్ కంక్లూజన్స్‌ని అలా పక్కకి పెడదాం. ఇంతకీ మీరనేదేమిటి? ".

"మీరు మీ లాప్‌టాప్‌ని నాకు ఇవ్వబట్టి కదా! నేనివ్వాళ ఇలాగ సెవెన్త్ హెవెన్ ఆఫ్ హ్యాపీనెస్‌లో తేలియాడగలుగుతున్నాను! అంచేత మీకు కృతజ్ఞత తెలియచేసుకోవాలి! అదెలాగ అని? "

"ఎత్తుకొని ముద్దాడడం కంటే ఆడదానికి మీరు ఇవ్వగలిగిన మంచి బహుమతి మరొకటి వుండదు"

"అదే నేనూ అనుకున్నాను గానీ.. "

"అది జరగడానికి వీలులేదు! అంతేకదా! ఎందుకంటే, నేనాల్రెడీ నా బద్ధకం మొగుడికి ఎంతో ఇష్టమైన భార్యని కాబట్టి! బద్ధకస్తుడయితే అవుగాక! నాక్కూడా మా ఆయనంటే చచ్చేంత ప్రేమ సుమండీ!"

"అదేవిటండీ? అంతటి మనిషిని పట్టుకొని బుద్ధావతారం, బద్ధకం మొగుడూ అంటూ విశేషణాలు తగిలిస్తారు. నన్ను పట్టుకొని మా ఆవిడ నంగిరి పింగిరిగాడని భావిస్తున్నట్టు"

"ఆడవాళ్లు అబద్ధాలు ఆడరండీ బాబూ! మా ఆయన బుద్ధావతారం అన్నానంటే, అందులో ఆవగింజంతయినా అబద్ధం వుందంటారా? ఆయన అసలు సిసలు బుద్ధుడు. దేనికీ చలించని మనిషి. బహు దొడ్డ గుణాలున్న మనిషిలెండి! ఇదే చూడండి 'ఇవాళ నేనేమీ చెయ్యలేకపోయానండీ తినడానికి' అని అన్నాననుకోండి! ఆయన రియాక్షన్ ఎంత కూల్‌గా వుంటుందో తెలుసునా? 'నువ్వు వర్రీ అవకు సుందరి! అలా వెళ్లి మంచి హోటల్లో టిఫిన్ తిని నీకూ పార్శిల్ చేయించి పట్టుకొచ్చేస్తాను' అని ఎంతో నింపాదిగా బజారుకి బయల్దేరతారు.. ఇంతటి బద్ధకం మనిషీని. ఒకవేళ అతనికి నిజంగా బాగా ఆకలి వేసినప్పుడు గానీ 'నేనేం చెయ్యలేనివాళ' అన్నాననుకోండి! 'పోనిద్దూ! ఒక్కపూట భోజనం లేకపోతే కొంపేం మునిగిపోదు' అని కుర్చీలో సెటిలయిపోతాడు.. అంత బద్ధకం, మనిషికి కదలడం అంటే..! కానీ ఇవాళ నేనెక్కడ ఆకలికి తట్టుకోలేకపోతానో? అని ఇంతటి బద్ధకస్తుడూను కాళ్లు జాడించి టిఫిన్ తేవడానికి బయల్దేరేడు. అతడు తిరిగి వచ్చేసరికి నేను కనీసం భోజనం బల్ల దగ్గర మంచినీళ్ళ,

పళ్లేలు అమర్చి సిద్ధంగా వుండకపోతే బాగుండదు కదా! అంచేత మీరు చెప్పాల నుకుంటున్నది టూకీగా చెప్పేసి ఈ కాన్ఫ రెన్స్ ముగించేయండి!"

"షూర్ ఒక్క నిముషం" అని చెంగున లోనికి లంఘించేడు బంగార్రాజు. మరు నిముషంలో ఒక చేతిలో తన భార్య కొని తెచ్చిన కొత్త లాప్‌టాప్ మరోచేత్తో పుల్లా రెడ్డి స్వీట్ల పేకెట్‌తో ప్రత్యక్షమై, "నేను మెల్లగా ఈ గ్రిల్స్‌ని పట్టుకొని పాకుతూ వచ్చి మీకివి అందిస్తాను! జాగ్రత్తగా అందుకోవాలి" అనేసి, గ్రిల్లుపట్టుకొని పాకడం అనే ఒడెస్సీ ఆరంభించేశాడు.

ఎక్కడ పట్టువదిలేసి కింద పడిపోతాడో అని కంగారు పడిపోతూ సుందరి "ఏవి టవి? " అని అడిగింది.

"ఎక్స్‌ప్లనేషన్ తర్వాత, మీ హస్బెండ్ వచ్చేసి అవతల వెయిట్ చేస్తుంటే ఇవతల మనం వివరణలు అవీ మాట్లాడుకుంటూ కూర్చోడం బాగుండదు కదా! అలాగే మా భాగ్యం కూడా కాస్త పెందరాళే వచ్చేసింద నుకోండి పెద్ద సీను క్రియేట్ అవచ్చుకదా! అంచేత చప్పున వీటిని ముందు అందేసు కోండి! తరవాత తీరిగ్గా అన్నీ మాట్లాడు కుందాం" అన్నాడు, ఊపిరి బిగబట్టుకొని.. బల్లిలా గ్రిల్స్ వెంబడి పాకుతూ.

తక్షణం వాటిని అందుకోకపోతే ఆతృ తలో ఎక్కడ పట్టువదిలేసి నాలుగో ఫ్లోరు నుండి కింద పడిపోతాడో అని భయపడి పోతూ.. అదే జరిగితే భాగ్యలక్ష్మి తనని తిట్టే తిట్లని వినడానికి 'కర్ణములు పదివే లైన చాలవు చాలవు రాజరాజ' అని రాయ బారం సీను పద్యాన్ని మనసులోనే మరో లా గుర్తుచేసుకుంటూ, బంగార్రాజు అందించిన వస్తువుల్ని అందేసుకుంది.

ఇంతలో 'సుందరం!' అని ఆమె భర్త వేసిన కేకా- 'ఏవండీ ఎక్కడున్నారు? ' అని భాగ్యలక్ష్మి అరిచిన అరుపూ ఏకకాలంలో వినపడగా సుందరి, బంగార్రాజులు తమ తమ బాల్కనీల్లోంచి, డ్రాయింగు రూము ల్లోకి ఉరికేరు.

★ ★ ★

టిఫిన్ తింటూ, మహా మోహనంగా నవ్వుతూ, నవ్వుతో సింక్రనైజ్ అయేట ట్టుగా గొంతుని మాడ్యులేట్ చేస్తూ, సుందరి వివరణ మొదలుపెట్టింది.. "ఆ బంగార్రాజుని చూసేరా! పాపం ఉత్తవెర్రి బాగులవాడు! మనిషిని నోరారా పలకరిస్తే చాలు! ప్రాణం పెట్టేసేటట్టున్నాడు. చూడండి! ఏవిటి చేసేడో? నా దరిద్ర గొట్టు లాప్‌టాప్ లేదూ..! దానిని ఎలా గేనా వదిలించుకుంటే బాగుండ్ననిపించి కదా 'మీరు వాడుతూ వుండండి, కాస్త కాలక్షేపంలా వుంటుంది' అని అతగాడికి చ్చేనా? ఆ సిస్టమ్ కాస్తా అతగాడి విష యంలో లక్కీ ఇన్‌స్ట్రుమెంట్ అయి కూర్చుందట! దానిమీద వర్క్‌చేసి ఏదో మంచి యూజ్‌ఫుల్ సాఫ్ట్‌వేర్ తయారుచే సేట్ట! దాన్ని ఏదో ఐటీ కంపెనీకి ఫాన్సీ ప్రైస్‌కి అమ్మేడట! అంచేత మనం బంగా ర్రాజు ఏదో వెర్రిబాగులవాడని అనుకుంటే మాత్రం పొరపాటే! ఇన్‌క్రెడిబుల్ స్పీడ్‌తో కొత్త సాఫ్ట్‌వేర్ తయారుచేసేయడం కాకుండా, దానిని కళ్లు తిరిగేంత పెద్ద మొత్తానికి మార్కెట్లో అమ్మేశాడంటే అతని తెలివితేటలు ఏ లెవెల్లో వున్నాయో ఆలో చించండి! అతని అమాయకమైన మాటలు.. చిన్నపిల్లవాడిలా చిన్నచిన్న మంచి మాటలకి కూడా పొంగిపోవడం.. ఇవన్నీ నటనేనా కావచ్చును! లేదంటే మనకి అర్థం కాని ఏదో కాంప్లెక్స్ పర్సనా లిటీ అయినా కావచ్చు! ఏతావాతా- అతను చెప్పుకొస్తున్న కథ ఏవిటో విన్నారా? 'సుందరిగారు! మీరిచ్చిన లాప్‌టాప్ మరి మీకు రిటన్ చెయ్యను! అది వచ్చిన వేళా విశేషంతో నా అదృష్టం పూర్తిగా యూ టర్న్ తీసుకొనేలా కనిపిస్తోంది. అంచేత దాన్ని మరి మీకు రిటన్ చెయ్యను. దానికి

## మార్చి - 2015
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.

1. **కొత్తపల్లి కళావతి**
   - టెక్కలి, శ్రీకాకుళం జిల్లా
2. **కె. స్రవంతి**
   - బద్వేల్, కడప జిల్లా
3. **ఆర్. గాయత్రమ్మ**
   - డాక్టర్స్ కాలనీ, కర్నూలు
4. **పేర్వేల రాంబాబు**
   - అమృతాహిల్స్, హైదరాబాద్
5. **కె. శ్యాంసుందర్‌రెడ్డి**
   - మంచిర్యాల, ఆదిలాబాద్ జిల్లా

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. శేషమ్మ | 6. స్వప్న |
| 2. దుబాయ్ | 7. కాంతిమతి |
| 3. కొండయ్య | 8. కీమ్ |
| 4. అలకనంద | 9. వెల్డింగ్ టెక్నీషియన్ |
| 5. నేరేడుకొండ | 10. గంధం యాజ్ఞవల్క్యశర్మ |

బదులుగా ఈ కానుకని స్వీకరించండి!' అంటూ ఈ కొత్త లాప్‌టాప్‌ని గ్రిల్స్ పట్టుకొని పాక్కుంటూ వచ్చి నాకందించేడు.

సక్సెస్ రుచి తగిలి చాలా రోజులయిపోయినట్టుంది! మనిషి ఆనందంతో ఉబ్బితబ్బిబ్బు అయిపోతున్నాడు. సరే! అతగాడు అంతలా ఊహల పల్లకీలో ఊరేగుతూ వుంటే కఠినంగానూ, నిక్కచ్చిగానూ మాట్లాడి అతన్నెందుకు ఆనంద పల్లకీలోంచి కిందికి తోసేయడం అనిపించి అతగాడందించిన స్వీట్ల పేకెట్నీ, లాప్‌టాప్‌నీ అందుకున్నాను సుమండీ! అలా చెయ్యడం పొరపాటా డార్లింగ్? " అంది సుందరి, గొంతుకని అమాయకత్వపు అమృతంతో నింపేస్తూ..

ఆమె పోతున్న వంకర్లని చూస్తే 'నో! యు ఆర్ రాంగ్' అనడానికి ఏ మగాడికి వశమవుతుంది? అంచేత ఆమె బుద్ధావతారంగా అభివర్ణించే ఆమె భర్త కూడా "అదేవిటి సుందరి? నువ్వేనాడేనా రాంగ్ స్టెప్ వేస్తావేమిటి? నేనింత బేఖాతరీగా బతుక్కు రాగలుగుతున్నానంటే అది నీ బతకనేర్చినతనం వల్ల కాదూ? " అన్నాడు.

ఆ మాట విని సుందరి గతుక్కుమంది మనుసులో! 'తన తత్వాన్ని గ్రహించేసి అపహాస్యంగానీ చేస్తున్నాడా ఈ బుద్ధావతారం? కొంపతీసి ఇతగాడి ఈ బుద్ధావతారంలో వేషం అంతా కేవలం ఒక పోజ్ కాదు కదా తనని, ప్రపంచాన్నీ మభ్యపెట్టడానికి! అతగాడి బాహ్యప్రవర్తనని తనకి అనుకూలంగా వుండేలాగ వాడుకొంటోందా? లేక అతగాడే కేవలం బడుద్ధాయిలా నటిస్తూ జీవితాన్ని నిష్పూచీగా, కులాసాగా గడిపేయడానికి తనని ఒక సాధనంగా వాడుకుంటున్నాడా? ' ఏది ఏమైతేనేంగాక సుందరి చాలా తెలివైంది కనక తన అంతరంగపు ఛాయల్ని ఏమాత్రం బయటికి కనపడనివ్వకుండా నవ్వుల సమ్మోహనపు వలని విసిరింది పతిదేవుడి మీదికి.. అతగాడు యిచ్చిన కాంప్లిమెంటుకో, ప్రదర్శించిన వ్యంగ్య వైభవానికో బదులు యిస్తున్నట్టు.

అక్కడ బంగార్రాజుగారింట్లో సీను డిఫరెంటుగా వుంది. తన విజయవార్తని బంగార్రాజు చెప్పగానే భాగ్యలక్ష్మి బహు సంబరపడిపోయింది. అమ్మయ్య! ఈ దెబ్బతో మొగుడు మళ్లీ ఆఫీసుకి పోతాడు కనక ఆ మాయలాడి సుందరితో బాతాఖానీలకి ఫుల్‌స్టాపు. అదీ ఆవిడ సంతోషం!

"చూశారా! మరి నేను కొనిపెట్టిన

లాప్‌టాప్ మీకు ఇన్‌స్టంట్ సక్సెస్‌ని తెచ్చి పెట్టేసింది” అంది పొంగిపోతూ, భర్త అందించిన కోవాబిళ్లని సుతారంగా కొరికి, దాని రుచిని ఆస్వాదిస్తూ ఆనందిస్తూ నిమీలితా నేత్రాలతో భర్తని వీక్షిస్తూ. ‘అబ్బ! ఏదో అనుకున్నాను గానీ.. చాలా అందంగా వుంటాడే ఈ బంగార్రాజు! ఏనుగ్గున్నలా వుండే ఆ మొగుడ్ని చూడలేకే ఆ సుందరి.. ఈ అందగాడితో నిత్యం బాతాఖానీ వేసుక్కూర్చుంటోంది..’ ఇలా సాగుతున్నయి భాగ్యలక్ష్మి ఆలోచనలు.

అయితే ఆమె ఆశించిన రెస్పాన్స్ రాలేదు మొగుడి దగ్గర్నుండి. ఆమె ఎన్నడూ ఊహించని ప్రతిస్పందన వచ్చింది. చిరునవ్వు నవ్వుతూ, కోవాబిళ్లని సుతారంగా కొరుకుతూ, బంగార్రాజు ప్రారంభించేడు “భాగ్యం! ఒక మాట అంటాను.. మరోలా అనుకోకు. నువ్విచ్చిన లాప్‌టాప్‌ని ఇప్పటిదాకా కనీసం తాకడానికి కూడా వీలు చిక్కలేదని నేనంటే కోపం తెచ్చుకుంటావా? ఫాక్ట్ ఏమిటంటే మన పొరుగింటి సుందరి లేదూ..! ఆవిడ ఏ బంగారం చేత్తో యిచ్చిందో? ఏమిటోమరి.. ఆవిడ లాప్‌టాప్‌ని? దానిమీద వర్క్ ప్రారంభించేనా..! అంతే మరి వెనక్కి తిరిగి చూడలేదంటే నమ్ముతావా? ఆవిడ ఇచ్చిన సిస్టమ్ ఎంతగొప్పది కాకపోతే నేను ఇంతటి లాభసాటైన సాఫ్ట్‌వేర్‌ని ఇంత వేగంగా ఎలా తయారు చెయ్యగలుగుతాను



చెప్పు! అసలు సిసలు నిజం చెప్పుకోవాలంటే సుందరిగారు మనకి లాప్‌టాప్‌ని ఇవ్వలేదు.. పెన్నిధిని కటాక్షించింది!"

ప్రహ్లాదుని విద్యాపరీక్ష సందర్భంగా ఆశించిన సమాధానాలు రాకపోవడంతో 'శివశివా! ఏమి ఈ శత్రుసంకీర్తనం' అని హిరణ్యకశిపుడు చెవులు మూసుకొని నెత్తి మొత్తుకుంటాడే అదిగో అచ్చం అలాటి ఘట్టమే ఎదురయింది భాగ్యలక్ష్మికి. మొగుడి మాటలు వినీవినగానే తను నవులుతున్న కోవాబిళ్ల రుచిని కోల్పోయి ఏదో మట్టి పెల్లని చప్పరిస్తున్న భావన కలిగించింది.. ఆ మట్టిపెల్లని తుపుక్కున వాష్‌బేసిన్‌లో ఉమ్మి రోషకషాయిత నేత్రాలతో భర్తని వీక్షిస్తూ.. "అలాగా? పోనీ అలాగయితే ఆ అదృష్టదేవత యిచ్చిన లాప్‌టాప్‌నే పట్టుకొని వూరేగండి. మీకు తెలుసునో? లేదో? మీకు అదృష్టాన్ని మోసుకొచ్చిందని ఏ లాప్‌టాప్‌ని చూసి మురిసిపోతున్నారో అదుగో ఆ ముదనష్టపు సిస్టమ్‌ని కొన్ననాటినుండే మీ లక్ష్మీదేవి సుందరికి డౌన్‌ఫాల్ ఆరంభమయింది. చివరికి ఉద్యోగం కూడా ఊడింది? తిండేనా తినగలుగుతున్నారో? లేదో! అయినా ఫరవాలేదులెండి! మీరున్నారు కదా! అట్లువేసో, ఇడ్లీలు చేసో ఆ మాత్రం ఆదుకోకుండా వుంటారా? ఆవిడ్నీ, ఆవిడ మొగుడ్నీ? ఎంతమాట! అదృష్టపు తావీదులాంటి ఆ పెంటియమ్ 3 సిస్టమ్‌నే వాడుకోండి! దాన్ని వాడుతుంటే ఇంకా



ఎన్నిరకాల అదృష్టాలు కలిసొస్తాయో? ఏమిటో? ఎవరూహించగలరు? నేను తెచ్చిన లేటెస్ట్ కన్ఫిగరేషన్‌తో వున్న సిస్టమ్‌ని నా మొహాన కొట్టండి! విలువ తెలియని వాళ్లకి విలువైన వస్తువుల్ని యిస్తే మాత్రం వాట్ని సద్వినియోగం చెయ్యడం కూడా తెలిసి వుండాలి కదా! నా సిస్టమ్‌ని వెంటనే తెచ్చి నా మొహంమీద పడేయండి!" అనేసి రుసరుసలాడుతూ గదిలోకి వెళ్లిపోయి. దఢాలున తులుపులు మూసేసుకుంది.

బంగార్రాజు నిశ్చేష్టుడైపోయి, నోట మాటరాక అలా కుర్చీలో కూలబడి పోయాడు. ఇలాటి డెవలప్‌మెంట్ మరీ ఇంత త్వరగా వచ్చేస్తుందని అతగాడు ఊహించలేకపోయాడు. తను చేసిన పనేమిటి? చాలా చాలా బేఖాతరుగా భార్య కొనితెచ్చిన లాప్‌టాప్‌ని సుందరికి బహుమతిగా ఇచ్చేశాడు. ఆవిడ లెండ్ చేసిన మెషినుపయోగించి ఇంతటి జాక్ పాట్‌లాటి విజయాన్ని సాధించేడు కదా! ఆ సహాయానికి కృతజ్ఞతా సూచకంగా ఏదో ఒక బహుమానం ఇవ్వడం మినిమమ్ కర్టసీ! అదే కదా! తను చేసింది? భార్య తన కోసం తెచ్చిన లాప్‌టాప్‌ని తన విజయానికి కారణ భూతురాలైన సుందరికి బహుమతిగా ఇచ్చేశాడు. అయితే నా లాప్‌టాప్‌ని తిరిగి నాకు ఇస్తావా? లేదా? అని భాగ్యలక్ష్మి పీకలమీద కూర్చోవడం.. చాలా అన్‌రీజనబుల్ డిమాండ్. ఇలాటి జటిలమైన సమస్య సడన్‌గా ఎదురైంది కదా! తను ఇప్పుడేం చెయ్యాలి? ఏం చెయ్యాలో తోచక ఏ సమాధానం ఇవ్వాలో తెలియక కర్తవ్యమూఢుడై కూర్చుండి పోయాడు బంగార్రాజు.

ఇంతలో గది తలుపుల్ని ధబేలున తెరచి గది గుమ్మం ముందు అపర కాళికాదేవిలా నిలబడింది భాగ్యలక్ష్మి. నిల్చొని, హూంకరిస్తున్న ధ్వనిచేసి "ఏవిటలా బెల్లం మొత్తిన రాయిలా కూర్చొబడిపోయారు? వెళ్లండి లేచివెళ్లి నా లాప్‌టాప్‌ని తెచ్చి నా మొఖంమీద తగలబెడితే నేను బజారుకి వెళ్లి దాన్ని షాపువాడికి రిటన్ చేస్తాను" అని గర్జించింది.

"అది లేదు" అని అనగలిగేడు బంగార్రాజు ఎంతో ప్రయత్నం మీద. వేయి నిలువుల లోతున్న నూతిలోంచి వినిపిస్తున్న గొంతులా వినిపిస్తోంది.

"లేదూ? లేక ఏమయింది? దాన్నిగాని అమ్మేసి సమోసాలు, స్వీట్లు చేసి తినిపించారా మీ సుందరికి? " అని అవహేళన స్వరంతో గద్దించింది.

"నాకు వర్ణించలేనంత గొప్ప ఉపకారం చేసింది సుందరి. ఆ ఉపకారపు డెప్త్‌ని అర్థం చేసుకోగలిగిన శక్తి నీకు లేదులే! ఏతావాతా చెప్పేదేమంటే నువ్విచ్చిన లాప్‌టాప్‌ని కృతజ్ఞతా సూచకంగా నేను సుందరికి బహుమతిగా ఇచ్చేశాను"

భయంకరమైన నిశ్శబ్దం. ఆటంబాబు హిరోషిమా మీద వేసిం తర్వాత సర్వనాశనమై పోయినప్పుడు బహుశా ఇలాంటి నిశ్శబ్దమే రాజ్యం చేసిందేమో జపాన్ దేశంలో..! డైనింగ్ టేబిల్‌కి అటుపక్క బంగార్రాజు, ఇటుపక్క భాగ్యలక్ష్మి.. వారిద్దరి మధ్యనీ ఘనీభవించిన నిశ్శబ్దం! అలా ఓపది నిమిషాలు పది మన్వంతరాలంత తాపీగా గడిచేయి.

తదుపరి తన ముందున్న టిఫిన్ల ప్లేటును విసురుగా తోసేసి.. "సాయంకాలంలోగా నా లాప్‌టాప్ నాకు చేరాలి" అని తిరుగులేని అల్టిమేటమ్‌ని డెలివర్ చేసి అక్కడ నుంచి లేచి తిన్నగా తన గదిలోకి వెళ్లిపోతూ భళ్లున తలుపులు వేసింది.

ఆమె భళ్లున వేసిన తలుపుల చప్పుడు అన్ని ఫ్లోర్లలోని వున్న అన్ని అపార్ట్‌మెంట్ల వాళ్లకి వినిపించి భయభ్రాంతులైనారు, బిల్డింగంతా కూలిపోడంలేదు కదా అనే

భయంతో. మరి పక్క ఫ్లాట్‌లోనే వున్న సుందరికి కూడా వినిపించిందా, ఆ భూగర్జన లాంటి శబ్దం. ఆమె ఊహాశక్తి అసలు సిసలు పాదరసంలాంటిదేమో వెంటనే కీడుని శంకించింది. బంగార్రాజు తనకి బహూకరించిన లాప్‌టాప్ గురించి కాదు కదా పక్క ఫ్లాట్‌లో సంభవించిన ఈ పిడుగులాటి శబ్దం? ఆలోచన రావడమే తరువాయి ట్రబుల్ షూటింగ్‌కి దిగిపోయింది టార్పెడో వేగంతో. అంతే- రయ్‌మని బాల్కనీలోకి వచ్చేసి- కనబడీ కనబడని జాగాలో మహా డిస్క్రీట్‌గా నిలబడింది- బంగార్రాజు తనకిచ్చిన లాప్‌టాప్‌పట్టుకొని.

ఇక్కడ డైనింగ్ టేబుల్ దగ్గర బంగార్రాజు అవమాన భారంతో కుంగిపోయి కూర్చున్నాడు- ఏం చెయ్యాలో తోచక. భార్య తనని అనునిత్యం సూటీపోటీ మాటలంటూ వుండడం- తను వాటిని వినీ విననట్టు నటించి ఊరుకుంటూ వుండడం- మామూలయిపోయింది. కానీ- ఈమధ్యని హద్దులు దాటుతోంది ఈ సరసం. అరవడం, సహనాన్ని కోల్పోవడం, కించపరచడం- ఇలాంటి చేష్టలు ఎంత మాత్రం నచ్చవు బంగార్రాజుకి. అతగాడు సౌమ్యుడే కాకుండా సంస్కారం వున్నవాడు కూడాను. ఇవాళ చెలియలికట్టని దాటిన సముద్రం మాదిరిగా వుంది. గట్టిగా నీ భార్యకి బుద్ధి చెప్పవలసిన సమయం ఆసన్నమైందని మనసు గట్టిగా చెబుతోంది. అయినా జన్మతః వచ్చిన సంస్కారాన్ని వదులు కోడమా అని పరిపరివిధాల ఆలోచిస్తున్నాడు. ఆలోచనలు తెగక బోనులో చిక్కిన చిరుతపులిలాగ అసహనంగా అటూఇటూ పచార్లు చేస్తున్నాడు. కానయితే- ఈ ఫ్లాట్ల నిర్మాణం గదుల్లో నడవడానికీ, రెస్ట్‌లెస్ స్టేట్ వున్నప్పుడు సంచరించడానికీ పెద్దగా అవకాశాల్ని యివ్వవు. మంచికి కానివ్వండి, చెడుకు కానివ్వండి- ఆ దొప్పెడు బాల్కనీలోనే పచార్లు చెయ్యాలి. బాల్కనీలోకి వచ్చి మూడీగా పచార్లు చేస్తున్న బంగార్రాజుని డిస్క్రీట్‌గా పరదా వెనక నిలబడి ఉన్న సుందరి చిన్నగా చిటికె వేసి గ్రిల్స్ దగ్గరికి రమ్మని సైగ చేసింది.

"తుఫాన్లా వుంది.. దేనికట? "

బంగార్రాజు కళ్లలో కనిపించీ కనిపించని కన్నీటిపొర.

"ఛాఛా! బంగ్రాజుగారూ! ఏఁవిటిది? ఇలాంటి చిన్నవిషయాల కోసం మీలాటి ఎంటర్ ప్రయిజింగ్ అండ్ ఎమియబిల్ జెంటిల్‌మేన్ చలించి పోకూడదు" అంటూ గొంతుని ఎంతో మెత్తగా, ఎంతో మృదువుగా, ఎంతో ఆర్తిగా, ఎంతో అనునయంగా మాడ్యులేట్ చేస్తూ లాప్‌టాప్‌ని కొద్దిగా చూపిస్తూ- "దీని కోసమేనా..? " అంది నర్మగర్భితంగా.

బంగార్రాజు స్థాణువై నిలుచుండిపోయేడు. తన దైన్యావస్థనేవత్తూ ఆమె ఊహిగలిగింది అని అనిపించీ అనిపించగానే- 'ఈ మొత్తం ఫ్లాట్ల కాంప్లెక్సంతా- తన ఒక్కడితోనీ- అలా భూమిలోకి కుంగిపోకూడదు' అని ఎంతో ఆర్తిగా అనుకున్నాడు మనసులో.

"ఇందాక వచ్చారే గ్రిల్స్ పట్టుకొని పాక్కుంటూ- అలాగే మరోమారు వచ్చి దీన్ని చప్పున అందుకోండి!"

"నా ప్రాణం పోతే పోనివ్వండి- నేను మాత్రం మీకిచ్చినదాన్ని తిరిగి తీసుకోను!"

"ప్రతిజ్ఞలు తరువాత చేద్దురుగాని- ముందు గాలివాన ఆగేటట్టు చూస్కోవాలి. నేను అన్నిట్నీ ఊహించగలను. మీరు ఎలాంటి ఇబ్బంది పరిస్థితిలో వున్నారు- అన్నది కూడా అంచనా వెయ్యగలను. మీరు ఫీల్ అవకండి! మీరు ఇంట్లో శాంతి లేక బాధపడుతూ వుంటే- అదీ నా కారణంగా సఫర్ అవుతుంటే నా ఎగోనీకి అంతుండదు. నన్నేడిపిస్తారా? చెప్పండి!

నాకు ఈ కొద్దిరోజుల పరిచయంతోనే తెలిసిపోయింది- మీది ఎంతటి మృదుస్వభావమో! ఊఁ! క్విక్ వచ్చి అందుకోండి ముందు. తుఫాను తగ్గితే తర్వాత అన్నీ ఇన్‌ట్రోస్పెక్ట్ చేసుకుంటూ మరీ తీరిగ్గా కూర్చొని మాట్లాడుకుందాం!"

ఆ మాట చెబుతూనే సుందరి బాల్కనీ చివర క్రిటికల్ పాయింట్‌కి- అనునయంగా నవ్వుతూ "లాప్‌టాప్‌ని అందుకోండి" అంది, దాన్ని పొజిషన్ చేసి పట్టుకొని.

'సరే! ఇక సందేహించకూడదు. ఇంత మంచి మనసున్న సుందరికి ఏదో కొండంత బహుమానం మరొకటి ఇచ్చుకోలేకపోతానా? ఇచ్చుకొని మరీ ఈ జన్మని సార్థకం చేసుకుంటాను' అని నిశ్చయించుకొన్నవాడై- లాఘవంగా గోడని పట్టుకొని బల్లిలా పాకి తన గృహఛిద్రానికి కారణభూతమైన లాప్‌టాప్‌ని అందుకున్నాడు బంగార్రాజు.

"బెస్ట్ ఆఫ్ లక్! ఇంట్లో పీస్ ప్రివెయిల్ అవడం ముఖ్యం" అని ఎంతో మెల్లగా, ఎంతో మృదువుగా అతని చెవులకు మాత్రమే వినబడేటట్లు అనేసి ఇంట్లోకి వెళ్లిపోయింది సుందరి.

బాల్కనీలో- శిల అయిపోయినట్లుగా నిలబడిపోయాడు బంగార్రాజు. అతనికి కొద్ది నిముషాలుగా సంభవిస్తున్న ఆనంద విషాదాలకు ప్రతీకలా అతని చేతిలో లాప్‌టాప్. 'మనుషుల్లో సుందరిలాటి దేవతలు కూడా వుంటారా?' అదీ ఇప్పుడు అతన్ని వెంటాడుతున్న ఆశ్చర్యం.

అసూయే స్త్రీలకి అలంకారం అని అంటుంటారు కదా! అది భాగ్యలక్ష్మి విషయంలో నూటికి నూరుపాళ్లు నిజమైతే, సుందరి విషయంలో నూటికి నూరుపాళ్లు అబద్ధం.

అందంలోనే కాకుండా గుణాల్లో కూడా దేవతలకుండవలసిన లక్షణాలు ఈవిడకి ఎలా వచ్చాశాయో? ఇలాటి దేవతకి సాష్టాంగ నమస్కారం చేస్తే- అది ఆమెకి ఇవ్వవలసిన గౌరవం కంటే చాలా తక్కువే! అయినా అదొక్కటే కదా ప్రస్తుతానికి నేను చేయగలిగింది అని భావించి- లాప్‌టాప్ కిందకి దించి బాల్కనీ వరండాలో సుందరిగారి ఫ్లాట్ దిశగా తిరిగి సాష్టాంగపడి కృతజ్ఞతని తెలియపరస్తూ ఏవేవో మాటల్ని మనసులో మననం చేసుకున్నాడు. బెడ్‌రూమ్ కిటికీ ఉన్న టింటెడ్ గ్లాస్‌లోంచి ఈ తతంగాన్ని గమనిస్తున్న సుందరి కూడా కళ్ళు తుడుచుకోకుండా వుండలేకపోయింది.



4

అమావాస్య సాయంకాలం చీకట్లు ముసురుకుంటున్నాయి. ఫ్లాట్లన్నిట్లో దీపాలు క్రమక్రమంగా వెలుగుతున్నాయి.

బంగార్రాజుగారి ఫ్లాట్లో మాత్రం ఎందుకనో దీపాలు వెలగడం లేదు. అతగాడు ఇంతవరకూ భాగ్యలక్ష్మితో మళ్ళీ మరో మాట మాటాడలేదు. మర్నాడే తన కొత్త ఆఫీసులో కొత్త వుద్యోగంలో చేరాలి.. అందుకని తిక్కతిక్క ఆలోచనల్తో మనసుని మరింత పాడుచేసుకోకూడదని దృఢంగా నిశ్చయించుకున్నాడు. లైటుగా టిఫిన్ తిని వచ్చి, భార్యతో ఒక్కమాటైనా మాటాడకుండా, ఇంట్లో ఒక్క లైటైనా వెయ్యకుండా, బట్టలు మార్చుకొని తిన్నగా బాల్కనీలోకి వచ్చి, ఈజీ ఛైర్లో కూలబడ్డాడు. మనస్సు కందిరీగల పుట్టలా ఆలో

చనలతో గింగిరాలు కొడుతూ అల్లకల్లోలంగా వుంది.

ఇంతలో అవతల బాల్కనీలోంచి ఏవో మాటలు స్పష్టాస్పష్టంగా వినిపించేయి.

సుందరిగారి బాల్కనీలో కూడా లైట్లు వెలగడంలేదు.. ఏమయింది చెప్మా? 'వాళ్ల యింట్లో కూడా ఏదైనా అవాంఛిత సంఘటన జరిగిందా?' అని అనుకొని, కాస్త ఎటెంటివ్‌గా వాళ్లు అనుకుంటున్న మాటల్ని వినడం మొదలుపెట్టేడు.

"సుందరం! అప్పుడే నెల్లాళ్లు కావస్తోంది కదా- మన ఇద్దరికీ ఉద్యోగాలు లేకుండా! ఏదో పూర్వులు ఇచ్చింది ఇంత వుంది కాబట్టి, నిబ్బరంగా బతుకులు నెట్టుకు రాగలుగుతున్నాం. కానీ నిర్వ్యాపారంగా కూర్చోడం బోరనిపించడంలేదు?" అని బాబూరావు అన్న మాటలు వినిపించేయి.

"అదేవిటండి- అలా అంటున్నారు? ఇన్నాళ్లూ మీరు వేనకివేలు సంపాదిస్తున్నారు కదా! మీ సంపాదన ఆసరా చూస్కోనే కదా 'నాకేవిటి? మహారాణిని!' అనే ధీమాతో బతుక్కొస్తున్నాను"

"పోదూ! బడాయి! నీ డబ్బుని నువ్వు సంపాదించుకుంటూనే వున్నావు కదా ఇన్నాళ్లు! అదేదో నా డబ్బుతోనే రాణీవైపోయినట్లు మాట్లాడతా వేవిటి?"

"ఒదిలేద్దురూ! నా సంపాదన సంగతి! మీ డబ్బు చూసే కదా- నేను ఎప్పుడూ గర్వపడుతూ ఉండేది!"

"అందరూ నీలా ఉండరు కద డియర్! పక్కింటావిడ్ని చూడు! ఉద్యోగం పోయిం దగ్గర్నుండి బంగార్రాజుగారిని ఎలా గుడ్డిగవ్వని చూసినట్లు చూస్తోందో!"

"ఊరుకుందురూ మీరు మరీనూ! నేనూ ఆడదాన్నే కదా! ఎటొచ్చి ఆవిడకి కాస్త జెలసీ ఓవర్! పొసెసివ్‌నెస్ ఎక్కువ. ఆ విషయాన్ని అక్కడితో ఆపేద్దాం! మనపొరుగింటివాళ్ల గురించి వాళ్ల పరోక్షంలో ఏవేవో మాట్లాడుకోవడం సంస్కారం అనిపించుకోదు!"

"సారీరా! నీ సంస్కారం లెవల్ ఎంత మందికుంటుంది చెప్పు? సుందరం డియర్! రేపట్నుండి మనం సీరియస్‌గా ఉద్యోగాన్వేషణ చేద్దాం- ఏమంటావ్?"

"ఓకే! సంతోషంగా! నిరుద్యోగం, నిర్వ్యాపారం బోరు కొడుతోందన్న మాట మొగుడుగారికి! మీకు మళ్లీ ఏదేని మంచి వుద్యోగం వచ్చేస్తే నా మహారాణి స్టేటస్ రిస్టోరయినట్టు ఫీలవుతాను!"

"డబ్బు వచ్చినా? రాకపోయినా? నీ మహారాణి ఆలోచనల లెవల్ ఎప్పుడూ నీ సొంతమే! ఆ విషయంలో నీకు పోటి

# అబ్రహాం లింకన్ చతురోక్తులు



అమెరికాలో బానిసత్వాన్ని రద్దుచేసి, జాత్యహంకారి తుపాకిగుండుకు బలైన మహోన్నత నాయకుడు అబ్రహాం లింకన్. వివిధ సందర్భాల్లో ఆయన ఎక్కుపెట్టిన చతురోక్తులు కొన్ని..

## ముసుగు లేని వినతి!

ఒకరోజు శరీరం నిండుగా కప్పుకునేందుకు కూడా సరైన బట్టలు కట్టుకోలేని పేద అమ్మాయి అమెరికా అధ్యక్షుడు లింకన్ దగ్గరకు వచ్చింది. ఆమె ఉన్నంతలోనే సభ్యతగా సాదాసీదా ఉడుపులు వేసుకునివుంది. జైలులో శిక్షననుభవిస్తూ, దేశ బహిష్కరణకు గురైన తన అన్నను క్షమించమని వేడుకుంది.

అప్పుడు లింకన్ "అమ్మా! నువ్విక్కడకు సెనెటర్, గవర్నర్‌లాంటి వారినుంచి రికమెండేషన్ లేకుండానే నేరుగా వచ్చావు. మీ అన్నను విడుదల చేయాలంటే కొంచెం కష్టమే. అలా చేస్తే నన్ను మా వాళ్లు తీవ్రంగా విమర్శిస్తారు. కానీ నీ విజ్ఞప్తిలో న్యాయం, నిజాయితీ ఉన్నాయి. ఎందుకంటే నువ్వు ఎలాంటి ముసుగూ లేకుండా వచ్చావు. అందువల్ల ఎన్ని ఇబ్బందులు ఎదురైనా మీ అన్నను తప్పకుండా క్షమిస్తాను" అని చమత్కరిస్తూ అభయహస్తమిచ్చారు.

ఏనాడూ వుండదు. సరేగానీ- ఇలా రాత్రి తెల్లవారిందాకా మనం కబుర్లు చెప్పు కుంటూ గడిపేయగలం. కానీ ఇవాళెందుకో బాగా నిద్దరొచ్చేస్తోంది! లోప లికి పోదామా? " అన్నాడు బాబూరావు.

మరి మాటలు వినబడలేదు బంగార్రా జుకి. వాళ్లు లోపలికి వెళ్లి పోయుంటారను కున్నాడు.

అప్పుడు మొదలయింది. బంగార్రాజు స్వగతం 'నిజం! నిజం! సుందరిగారు నిజంగా మహారాణియే! మాటల్లోనైతేనేం, ప్రవర్తనలోనైతేనేం, ఔదార్యంలో నైతేనేం.. ఇలా ఏ విషయంలో చూసినా ఆవిడది

> **కొత్తగాలి...**
>
> **వటవృక్షం నీడలో**
> **మొక్కలు మొలవవు!**
> **బహుళ అంతస్తుల మేడల నీడలో**
> **పూరి గుడిసెలు నిలవవు!**
>
> – వాసాల నరసయ్య,
> మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా

రాణీదర్పమే! నేను రేపు ఉద్యోగంలో చేర గానే సమయం కనిపెట్టి వీళ్లిద్దరికీ కూడా ఉద్యోగాలు వచ్చేటట్లు ప్రయత్నం చేస్తాను. అప్పటికిగానీ వాళ్లిద్దరూ వాళ్ళ సహజమైన దర్జా మూడ్‌లోకి రాలేరు. నేనూ వున్నాను, ఎందుకు? పేరుకి బంగార్రాజు! చేతిలో ఎర్రని ఏగాణీ లేదు ఇవాళ మధ్యా హ్నందాకా! ఇంటిపేరు కస్తూరివారు ఇల్లల్లా గబ్బిలాల కంపూనట! బంగార్రాజట! బంగార్రాజు!! ఫకీర్రాజని పేరు పెట్టుంటే మోస్ట్ ఎప్రాప్రియేటివ్‌గా వుండేది, నా నిరుద్యోగ పర్వాన్ని తలుచు కుంటుంటే! కాకపోతే దీనస్థితిలో వున్నాను.. గొప్పలకి పోవడం బాగుండదు కదా! అని అందరూ మెచ్చుకొనేటట్లు ప్రవ ర్తించాలని చూస్తే, వంటవాడినని ఎద్దేవా చెయ్యడానికి స్వయాన కట్టుకున్న భార్యే సిద్ధమయింది. పైగా ఆ బట్టల్లేని అమ్మా యిల బొమ్మల్ని చూస్తూ దొరికిపోవడం కాదుగానీ భాగ్యలక్ష్మికి ఎంత చులకనైపో యాను. నేను పోగొట్టుకున్న పరువును తిరిగి సంపాదించుకోవాలి, ఎంత కష్టప డైనా సరే!' అనే నిర్ణయానికి వచ్చి తన గదిలోకి వెళ్లి పడుకున్నాడు బంగార్రాజు.

భాగ్యలక్ష్మి తన గదిలో మంచం మీద తెగ దొర్లుతోంది- నిద్దర్రాక! ఆవిడ మన సంతా చిందరవందరగా వుంది. ఈమధ్య జరుగుతున్న సంఘటనలు కాదుకానీ- తన ఆలోచనలు సరైన తోవలో నడవడం లేదని ఫీలవుతోంది భాగ్యలక్ష్మి. 'లాప్ టాప్‌ని తక్షణం తీసుకొచ్చి యిస్తావా? లేదా? అని మొగుడి పీకమీద కూర్చో వడం ఎంతవరకూ సబవూ అని ఇప్పుడు ఆలోచనలో పడింది. సుందరికి ఇచ్చేసిన ఆ ముదనష్టపు లాప్‌టాప్‌ని అడిగి వెనక్కి తీసుకోవాలంటే అతగాడు ఎంత ఆత్మనూ న్యత అనుభవించి వుంటాడో కదా అని ఇప్పుడు అనిపిస్తోంది. తిరిగి ఇచ్చేయండి! అని అడగడానికి అహం అడ్డు వస్తుంది- అంచేత దాన్ని అతగాడు అడిగి తేలేడూ- ఆ గొడవని పురస్కరించుకొని.. తను అత గాడ్ని సతాయిస్తూ వుండవచ్చని ఆశ పడుతూ వచ్చింది. కానీ- తను ఆశపడి నట్టు జరగలేదు. నా లాప్‌టాప్ నాకు తెచ్చిస్తావా? లేదా? అని తను డిమాండ్ చేసి అరగంటేనా దాటకుండానే తన లాప్ టాప్‌ని తెచ్చి తన ముఖంమీద కొట్టేడు. ఆ సుందరి ముందు నిలబడి 'నేనిచ్చిన లాప్ టాప్‌ని తిరిగి ఇచ్చేయండి' అని ఎలా అడ గ్గలిగేడో? అంటే- తన మొగుడు- తను అనుకున్న దానికంటే కూడా బాగా లో లెవెల్‌కి దిగిపోగలడన్నమాట! ఛీ!ఛీ!! వెధవ లాప్‌టాప్. దాన్ని తిరిగి తీసుకొని ఇవ్వు అని గదమాయించి ఎంత పెద్దపా

రపాటు చేసేను-' అని బాధపడింది భాగ్య లక్ష్మి. సమోసాలు చేసీ, చేగోడీలు చేసీ అసలే తన ఇమేజ్‌ని బాగా కిందికి దిగజా ర్చేసుకున్నాడు ఈ మొగుడుగాడు. తను తొందరపడి చేసిన పనివల్ల తన మొగుడు చవట నంబర్ వన్ అనీ, తను కర్రపట్టు కొని ఎలా గెంతమంటే అలా గెంతే కోత నీ- ఆ సుందరి, దాని మొగుడూ కన్‌క్లూజ న్‌కి వచ్చేసి నవ్వుకుంటూ వుంటారు. తన మొగుడు చీప్‌గా కనపడేటట్లు తనే చేసింది స్వయంగా. తను ఆలోచిం చకుండా అనవసరంగా ఓవర్ రియాక్ట్ అయ్యానని విచారించింది భాగ్యలక్ష్మి.

పాపం అతగాడు మాత్రం ఏం చేస్తాడు? ఉద్యోగం వూడింది! కాలక్షేపం లేదు! అవతల వాటాలో ఆ చుప్పనాతిది! దానికీ వుద్యోగం వూడి ఇంట్లోనే కూర్చుంది కదా! దాంతో బాల్కనీలోకి చేరి ఇద్దరి కిద్దరూ హలో! హలోలతో ఆరంభించి మీకు వుద్యోగం లేదా? అంటే మీకూ వుద్యోగం లేదా? అని పరామర్శించుకొని ఆ తర్వాత మీకు ఏ వంటలిష్టమంటే మీకే వంటలిష్టం అన్న భోగట్టాలకు దిగి.. ఛా!ఛా! అసలుసిసలు ఆడవాళ్ల భోగ ట్టాలు- ఏ వంటా చేతకాని సుందరోపక్కా.. అన్ని వంటలూ బేషుగ్గా చెయ్యడం వచ్చిన తన మొగుడో పక్క.

అందమైన ఆడది 'అయ్యో! అదెలా చేస్తారో నాకు తెలీనే తెలీదండి..' అని గొంతుకలో సన్నాయి నొక్కులు వినిపిస్తూ బిక్కమొగం వేసి నిలబడుతున్నట్లు అభిన యిస్తుంటే- ఆమెని ఓదార్చడానికి, మెప్పిం చడానికి నోటి నిండా నాలికేనా లేని తన మొగుడ్లాటివాడు ఆమెకి సమోసాలు చేసి తినిపించనేనా తినిపిస్తాడు. వంటేనా వండి తినిపిస్తాడు. అసలు తప్పంతా తనది. కంప్యుటర్లో ఏవేవో దరిద్రపుగొట్టు బొమ్మల్ని చూస్తున్నాడని పౌరుషం పడిపో యేనుగానీ ఏదో చూసీచూడనట్లు వూరుకొ నుంటే కథ ఇంతవరకూ రాకుండా వుండేది! ఛానల్ నుండి ఛానల్‌కి మారుతూ, అలా ఆ బట్టల్లేని ఆడగుంటల్ని చూసుకుంటూ, గది దాటి బయటికి అడు గుపెట్టకుండా ఇరవై నాలుగ్గంటలూ ఇంటి పట్టునే ఏడ్చి వుండేవాడు. ఆ కంప్యూటర్ని అమ్మేసి, తను ఘోరమైన తప్పుచేసింది. దానివల్లే ఇప్పుడీ పరిస్థితంతా దాపురిం చింది. ఆ సుందరి రాక్షసికి అబ్బ! ఎన్నెన్ని హొయల్లు? రంగులూ? వేషాలు! గమ్మత్తులూ వున్నాయో వర్ణించడం ఎవడి తరం? దాని వేషాల్ని చూస్తూ చొంగలు కారుస్తూ దానికి నచ్చేటట్లు ఆడుతున్నా డంటే తన మొగుడు ఇవాళ తను కొత్తగా కొనిపెట్టిన కాస్ట్‌లీ లాప్‌టాప్‌ని కూడా పట్టుకెళ్లి దానికి ఇచ్చేశాడంటే కథ ఎంత దూరం వచ్చేసినట్లు? ఇకనైనా తను మేల్కొని యాక్షన్‌లోకి దిగాలి! మరి తను చేసింది అదే కదా!

నా కంప్యూటర్ని వెంటనే తెచ్చిస్తావా? లేదా? అని డిమాండు చేసి. కానీ ఇందులో తనకి అర్థం కాకపోయిందేమి టంటే ఒక పక్క సుందరి సుందరి అని మురిసిపడిపోతూ దానికి ప్రజంటేషన్‌గా కట్టబెట్టిన ఆ కంప్యూటర్ని తిరిగి ఇచ్చిమని ఎలా అడగ్గలిగేడూ? అని! అలా అడగ్గల గడం నిశ్చయంగా చాలా హ్యూమిలేటింగ్ ఎక్స్పీరియన్స్! అలా అడిగి అడిగి సుందరి దృష్టిలో బాగా పలచనైపోయి వుంటాడు. కానీ ఆలోచిస్తుంటే ఇది ఓ రకంగా పాజి టివ్ డెవలప్‌మెంట్ అనే అనుకోవాలి. ఇచ్చిన ప్రజటేంషను వెనక్కి తీసుకుంటానని అనగానే వీడొట్టి బ్రజ మానం భజగోవిందంగాడై యుండాలి. ఇలాటి వాడితో మనకి స్నేహమేమిటి? అని నిశ్చయించి తెగతెంపులు చేసేస్కోవ చ్చును. అదే జరగాలి కానీ- ఇంకా అంత కంటే ఏంకావాలి? బంగారంలాంటి తన మొగుడు తన గుప్పిట్లోనే వుంటాడు. ఈ

రకంగా ఆలోచించిన తన ఏక్షన్ పాజిటివ్ రిజల్ట్‌నే ఇవ్వబోతోందన్న సంతృప్తితో పక్కకి తిరిగి హాయిగా నిద్రలోకి జారుకుంది భాగ్యలక్ష్మి.

నిద్ర పట్టందల్లా సుందరికే! ఛాఛా!! పక్కింటి భాగ్యలక్ష్మి తన హజ్బెండుని మరీ అంత షబ్బీగా ఎలా ట్రీట్ చెయ్యగలుగుతోంది? అతనికి వుద్యోగం, సంపాదనా లేకపోయినప్పటికి అతన్ని మరీ అంతలా గడ్డిపోచకన్న కనిష్ఠంగా ట్రీట్ చేస్తుందా? ఎంతటి అవమానకరమైన ప్రవర్తన? అలా అయితే నా వుద్యోగం ఎన్నాళ్ల కిందట పోయింది? ఇప్పుడు మా ఆయనక్కూడా ఉద్యోగం పోయింది! కానీ ఆవిడ్లాగ నేనూ మా ఆయన్ని చిన్నచూపు చూడగలనా? ఇంపాజిబుల్! ఛస్తే చెయ్యలేనే అలాటి పరువు తక్కువ పని! ఉద్యోగం వుంటేనేం? లేకపోతేనేం? నా మొగుడెప్పటికి నాకు బంగారం మొగుడే! ఎంత మంచివాడు మా ఆయన! నిజంగానే.. ఎంతో అదృష్టం చేసుకుంటేనే తప్ప అలాటి మొగుడు ఎలా దొరుకుతాడు? మొగుళ్లలో భార్యలకి నచ్చే ప్రధానమైన గుణం భర్తలు దేన్లోనూ కలగచేసుకోకుండా పడివుండడం! భార్య ఏది అడిగినా ఏ ప్రసక్తి తెచ్చినా 'అలాగే! నీ ఇష్టం!'లాటి స్టాక్ రిప్లయీస్ తప్ప.. మరే రకమైన జవాబూ చెప్పకూడదు. అదేం ఖర్మోగానీ నాకు వంటచేసే విద్య పట్టుబడ్లేదు. మా బాబూరావు ప్లేసులో ఇంకొకరెవరైనా నా మొగుడై వుండి వుంటే 'అది బాగాలేదు! ఇది బాగాలేదు! ఇలాగేనా వండి చచ్చేది?' అని సతాయించి నా ప్రాణాలు తినేసి వుండడూ! కానీ మా ఆయన అన్ని కోరికల్నీ జయించిన స్థితప్రజ్ఞుడిలా చిరునవ్వు నవ్వుతూ నేను గడ్డిపెట్టినా కిమ్మనకుండా తినేస్తాడే! గడ్డివంట కూడా చెయ్యడానికి నాకు ఓపిక లేని రోజుల్లో 'నేనలా వెళ్లి టిఫిన్ పార్శిల్ కట్టించి పట్టుకొచ్చేస్తాను! నువ్వు వర్రీకాకు!' అంటాడే కానీ మరోమాట వుండదే!

'ఏంతెమ్మంటావో చెప్పు!' అని తేవలిసిన టిఫినుక్కూడా ఛాయిస్ నాకే వదిలిపెడతాడే కానీ, తనకి మిగుల్చుకోడే! అదేం రుషి ప్రవర్తనో! నేనింతలా బంగార్రాజుతో మాట్లాడుతున్నా అపార్థం చేస్కోవడం, ఈర్ష్య పడ్డంలాంటి మానవసహజమైన గుణాలు అస్సలు కనపడి చావవే! నామీద అంత కాన్ఫిడెన్స్! మనిషిది కొంచెం భారీకాయం! అయితేనేంగాక! గుణమో అచ్చు బంగారం! ఔను ఆ పక్కింటి భాగ్యలక్ష్మికి ఎందుకు చెప్మా? నేనంటే అంత ఈర్ష్య! ఆవిడగారి మొగుడ్ని నేనేదో కొంగుక్కట్టేసుకుని కుక్కపిల్లని తిప్పినట్టు తిప్పుతున్నాననా ఆవిడగారి అభిప్రాయం. అయితే ఏమాటకామాటే అనుకోవాలి కదా బంగార్రాజుగారు కూడా ఎన్నదగిన బంగారంలాంటి మనిషే! అంత సరదాగా అంత చురుకుగా కబుర్లు చెప్తుంటాడా..! మనిషిలో వెకిలితనం అన్నది వెతికినా కననపడదు. 'సుందరిగారు' అని అతగాడు నోరారా పిలుస్తుంటే ఎంతటి భక్తి ధ్వనిస్తుంది ఆ గొంతులో! మాటల సంగతి సరే, వంటలు చెయ్యడంలో ఏమిటా నేర్పరితనం? నిజంగా నమ్మలేక పోతున్నాం! వంటల్చెయ్యడంలో రేర్ టాలెంట్ ఓ పక్క! సాఫ్ట్‌వేర్ ఎక్స్పీరియన్స్ మరోపక్క! ఆ రెండూ ఒక్క వ్యక్తిలో ఇమిడి వుండడం నిజంగా ఓ వండర్! గరిట తిప్పేడంటే నలుడూ భీముడూ కూడా ఈర్ష్యపడి చచ్చూరుకోవలసిందే! ఆ మధ్యన అతగాడు చేసి తినిపించిన సమోసాలో! అబ్బ! కరకరలాడుతూ నోట కరిగిపోయాయి. సాంబారు రుచో! అమోఘం కాదూ! రెండ్రోజుల్దాకా నాలిక మీద ఆ రుచి అలా ఉండిపోతుంది! వంటల్లోనీ, కబుర్లలోనీ మాత్రమే అతగాడు ఉద్దండ పిండం అనుకున్నానా ఇన్నాళ్లు..! కానీ

ఇన్నోవేటివ్ స్కిల్స్‌లో కూడా ఉద్దండపిండమే అని తెలిసిపోతోంది. వారం రోజుల బ్రీఫ్ పీరియడ్‌లో అతగాడు సాధించిన సాఫ్ట్‌వేర్ బ్రేక్‌త్రూని చూశాక.

ఆ తెలివితక్కువ భాగ్యలక్ష్మి అవకాశం వచ్చినప్పుడల్లా మొగుడ్ని పట్టుకొని వేపుకు తింటుందే గానీ, అతగాడి క్రియేటివ్ పొటెన్షియల్ని బయటికి తెచ్చేందుకు తగిన ప్రోత్సాహం ఇచ్చి, దానివల్ల వచ్చే డివిడెండుని కేష్ చేసుకుంటే ఎంత బాగుంటుంది! అన్న ఆలోచనే లేదు. ఇదే చూడ్రాదు! నేను విసిగిపోయి మూలపారేసిన కంప్యూటర్ని బయటకి తీసి చిన్న నవ్వు నవ్వి 'మీరు దీనిమీద వర్క్ చేసుకుంటూ వుండండి! కాస్త కాలక్షేపం కోసం' అన్నానా? నా నవ్వు అతగాడిని ఎంతలా ఇన్‌స్పైర్ చేసింది? తన ప్రతిభని సుందరి ముందు చూపించుకోవాలని కాబోలు డెవిలిష్ డిటర్మినేషన్‌తో పనిచేసి వారం రోజుల్లో ఓ కొత్త సాఫ్ట్‌వేర్‌ని తయారుచేసేసేడు! నిన్నటి దాకా చిన్నముఖం వేసుకొని గమ్యం తెలియని వాడిలా ప్రవర్తించిన బంగార్రాజు ఇవాళ బంగారం గన్నె కూర్చున్నాడు. ప్రోత్సాహం కోసం ఒక చిన్న మాట, ఒక చిన్న చిరునవ్వు.. ఇవి చాలుననిపిస్తోంది! మనుషుల్ని మంచిపనికి మోటివేట్ చెయ్యడానికి!

పాపం- ఆనందం పట్టలేక- పరాయి వాడి భార్యనైపోయానుగానీ- లేకుంటేనా? అమాంతం ఎత్తేసుకొని ముద్దులాడేసుండునేమో! ఆనందం పట్టలేకే అయుంటుంది.. తన భార్య కొనిచ్చిన సరికొత్త లాప్‌టాప్‌ని పర్యవసానాలు ఎలా వుంటాయి అన్నది కూడా ఆలోచించుకోకుండా- నాకు బహుమానంగా ఇచ్చేశాడు! స్మాల్ టోకెన్ ఆఫ్ గ్రాటిట్యూడ్. అంటూ- ఆ నిప్పురవ్వ వెళ్లి మొత్తం అతని కొంపకే అగ్గి పెట్టేసి వుండ్ను. ఏదో కాస్త సమయోచితంగా ప్రవర్తించేను కాబట్టి- డేమేజ్ కంట్రోల్ జరిగి వుండాలి కొంతమట్టుకేనా..!

అయితే ఎంతైనా ఆడవాళ్ల దగ్గరికి వచ్చే సరికి, ఈ మగాళ్ళంతా తెలివి తేటలన్నిట్నీ మరిచిపోతుంటారు కాబోలు! కాకపోతే మరేవిటి? ఇంతటి తెలివైన బంగార్రాజును తన భార్య మనస్థితిని అర్థం చేస్కోలేకపోయాడు! ఆ భాగ్యలక్ష్మి ముందు సత్యభామ ఎందుకూ పనికి రాదు- ఏడుపుగొట్టు గుణాల్లో. బల్లగుద్ది మరీ చెప్పగలను. అది గ్రహించలేకపోయిన ఈ పిచ్చి బంగార్రాజు, తగుదునమ్మా అని ఆ అపర సత్యభామ కొనిపెట్టిన లాప్‌టాప్‌ని నాకిచ్చేశాడు- కృతజ్ఞతా- బహుమానం- ఇలాంటి కబుర్లు చెప్తూ. అసలు- పుచ్చుకోడానికే భయపడిపోయాను- ఇదే చిచ్చుని రేపు

## కొత్తగాలి...

**పోస్టుకార్డు**
**బతకడం కోసం**
**గాలి కావాలి!**
**అదే కొత్తగాలి!!**

*– గుడిమెట్ల గోపాలకృష్ణ,*
అరసవల్లి

తుందోనని. భయపడినంతా అయింది. నేనిచ్చిన లాప్‌టాప్‌ని తక్షణం నాకు తెచ్చి యిస్తావా- లేకపోతే గుడ్డలు ఊడదీసి వీధిలో నిలబెట్టమంటావా? అని బెదిరించినట్టుంది! పాపం! ఆ బంగార్రాజు బిక్క మొఖం చూసేటప్పటికి నా గుండె చెరువయిపోయింది. ఇంకా నయం- నన్ను నేను అదుపులో వుంచుకోగలిగేను కనక సరిపోయిందిగానీ- నాకెంత ఏడుపు వచ్చేసిందో- అతగాడి బిక్క మొగం చూసేటప్పటికి. నాకెందుకు దాని ముష్టి లాప్‌టాప్? ఏదో- బంగార్రాజుని సంతోషపెట్టడానికి తీసుకున్నానుగాని- ఆ లాప్‌టాప్‌కి

జోడించి లక్ష డాలర్లు దక్షిణగా పెట్టినా సరే, నేను వేలువేసి ముట్టుకుంటానా? - ఏమిటి?

★ ★ ★

మర్నాడు బంగార్రాజుకి అర్జెంట్ ఫోన్ కాల్, అతని సాఫ్ట్‌వేర్‌ని పర్చేజ్‌చేసిన కంపెనీ నుండి. జరూరుగా సూటు తొడిగి బయల్దేరాడు. కంపెనీ బోర్డువాళ్ళు సమావేశం అయివున్నారు- ఇతగాడు బోర్డ్ రూములోకి ప్రవేశం చేసేటప్పటికి. అతగాడి ప్లీజింగ్ పర్సనాలిటీని, అతని పెదవుల మీద కనిపించీ కనిపించకుండా నాట్యం చేస్తున్న చిరునవ్వునీ, ప్రపంచాన్నే జయించగలనన్నట్టుగా కనిపిస్తున్న అతని

## కొత్తగాలి...

**కాళ్లు అరిగినయ్!**
**పిల్లాడి పెళ్లి**
**ఇంకా కాలేదు!**

– *శంకర,*
ఆచంట, ప.గో. జిల్లా

ధీమాని గమనించి ముగ్ధులైపోయారు కంపెనీ బోర్డ్ మెంబర్లు. కామధేనువులా కనిపిస్తున్న ఈ 'సాఫ్ట్‌వేర్ కౌ'ని సరైన పద్ధతిలో పాంపర్ చేస్తే కంపెనీని లాభాల పాలసముద్రంలో ఓలలాడించీడూ అనుకున్నారు- ఎవరి మనస్సులో వాళ్ళు. ఇలాంటి క్రాస్ ఫింగర్డ్ ఆలోచనలతో- అతని ముందు ఓ పేకేజీ వుంచేరు.

నోట మాటరాలేదు బంగార్రాజుకి. అన్నిటికీ- భార్యమీదే ఆధారపడడం కాదుగానీ కామత్ హోటల్లో కడుపునిండా టిఫిన్ తినడానికి కూడా ముందూ వెనకా చూసుకోవలసిన పరిస్థితిలో వున్నాడు నిన్నటి దాకా. ఇవాళ వీళ్లు ఆఫర్ చేస్తున్న పేకేజ్ చూస్తుంటే ఒళ్ళు జలదరిస్తోంది- 'నిజమేనా ఈ ఫిగరు?' అని. తనలో చెలరేగుతున్న భావ ప్రకంపనల్ని అదుపు చేసుకుంటూ- సున్నితంగానే చెప్తున్నా కరకుగా కూడా "వెల్ ఐ ఏక్సెప్ట్ యువర్ ఆఫర్ విత్ సమ్ రిజర్వేషన్స్. ఐ మస్ట్ హేవ్ మై ఫ్రీడమ్ టు లీవ్ యు వెనెవర్ వి ఫీల్ లైక్ లీవింగ్. బట్ ఒక హామీ. మీ బిజినెస్ ఎథిక్స్‌ని ఏనాడూ వయొలేట్ చెయ్యను. మీ ఫర్మ్‌లో వుండి మీ ఇన్‌ఫర్మేషన్‌ని నా సొంత లాభం కోసం ఏనాడూ వాడుకోనని చెప్తున్నాను. దటీస్ ప్రామిస్!" అన్నాడు.

అతడి ఫ్రాంక్‌నెస్, అతడు దాన్ని ఎక్స్‌ప్రెస్ చేసిన విధానం- వాళ్ళని బాగా ఇంప్రెస్ చేసింది. "రేపు ఫస్ట్ కదా! అంచేత మీరు రేపే మా కంపెనీ టీమ్ లీడర్‌గా జాయినయితే బాగుంటుంది!" అన్నారు.

సేలరీ ఎడ్వాన్స్‌గా, అతగాడు ఊహించలేనంత స్టాగరింగ్ ఫిగర్‌ని వేసి చెక్కుని అందమైన ఎన్వలప్‌లో పెట్టి అతని చేతిలో పెట్టేరు. ఇంటికి వెళ్ళడానికి ఎండీ గారి మెర్సిడెస్‌ని అతని ముందుంచారు.

బంగార్రాజు ఇంటికొచ్చేసరికి భాగ్యలక్ష్మి కారు ఇంటి ముందే వుంది. 'ఏంవిటి చెప్మా? ఇవాళ ఇంతవేగిరంగా వచ్చేసింది ఇంటికి?' అని కించిత్ ఆశ్చర్యపోతూ, ఇంటి తలుపు తట్టేడు. భాగ్యలక్ష్మి తలుపు తెరిచింది. ఆమె ముఖం ఎందుకనో ఉబ్బి, జేవురించినట్టుగా కనిపిస్తోంది. కళ్లు ఏడ్చేడ్చి అలసినట్లుగా కనిపిస్తున్నాయి. నిశ్చయంగా ఏదో సేడ్ మూడ్‌లో వునట్టు కనిపిస్తోంది ఆమె.

ఆమెకి తన విజయం గురించి చెప్పాలని ఉత్సాహం వురకలు వేస్తున్నా, ఆమె కనపడుతున్న తీరుని చూశాక తన వుత్సాహాన్ని నిగ్రహించుకోవలసిన అవసరం వున్నట్టు ఫీలయాడు బంగార్రాజు. దాంతో

ఉత్సాహ ప్రదర్శనని వాయిదా వేశాడు.

అయితే అతగాడు ఫుల్ సూట్లో వుండడం, మెర్సిడెస్ కారులోంచి దిగడం భాగ్యలక్ష్మి గమనించకపోలేదు. తను ఇవాళ వేళకాని వేళలో ఇంటికి వచ్చేసింది. ఇలాంటి వేళప్పుడు తన మొగుడు ఆ సుందరి యిచ్చిన ముదనష్టపు లాప్ టాప్‌లో అశ్లీలపు బొమ్మల్ని చూసుకుంటూ నోటి వూటల్ని మింగుతూ వుంటాడని వూహిస్తూ వస్తే- తన ఊహల్ని తల్లక్రిం దులు చేస్తూ, చిత్రంగా, కొత్త గెటప్‌లో కనిపిస్తున్నాడు- ఏమిటి చెప్మా? ఈ రక మైన వేషభాషలు? కొంపతీసి వీడూ, ఆ సుందరీ కలిసి వుడాయించీయాలని ప్లేను వేసుకున్నారా ఏఁవిటి? పోనీ, అలాగే చెయ్యనీ! కానీ, అదే జరిగితే! జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలిందట- ఆ రకంగా వుంటుంది మొత్తం నాటకం. దానికీ వుద్యోగం లేదు, వీడికీ వుద్యోగం లేదు- ఇద్దరూ కలిసి ఉడాయిస్తే- నాలు గంటే నాలుగు రోజులయేప్పటికి చిప్పలు పట్టుకొని చెరో వీధికి అడుక్కోడానికి బయ లుదేరాలి.

ఖాళీగా వున్నప్పుడల్లా ఇదే ఫక్కీలో సాగుతున్నాయి భాగ్యలక్ష్మి ఊహలు. దాంతో ఆవిడకి తిండి సయించడం లేదు, నిద్ర పట్టడం లేదు. మొగుడు ఇంటికి రావడానికి కొద్దిసేపు ముందు వరకూ నిజంగానే అతగాడు సుందరిని లేవదీసు కొని వెళ్లిపోయాడేమోననే ఆందోళన చెందింది. లేకపోతే ఈ సమయంలో ఆ దరిద్రపుగొట్టు లాప్‌టాప్‌ని ముందేసుకొని కూర్చోకుండా బయటికెందుకు వెళ్లినట్టు? ఆలోచనలు ఆ రకంగా సాగి సాగి ఆమె కుళ్లికుళ్లి ఏడ్చేటట్టుచేసి- కళ్లు పత్తికాయల్లా వాచేటట్టు చేశాయి.

అవతల ఫ్లాట్లో వున్న సుందరి కూడా బంగార్రాజు రాకని గమనించింది. 'అబ్బ! ఫుల్ సూట్లో ఈ మనిషి అదిరి పోతు న్నాడే! మెర్సిడెస్ కార్లో వచ్చేడంటే..? దాని మీనింగేఁవిటి? ఏనుగు కుంభస్థ లాన్ని కొట్టేశాడన్నమాట! పరుగెత్తాలి! పరుగెత్తాలి..! పరుగెత్తుకెళ్లి అభినంద నల్తో ముంచెయ్యాలి' అని- దూకుడుగా పరుగెత్తబోయి- తమాయించుకొని కాళ్ళకి సడన్ వేక్యూమ్ బ్రేకులు వేసింది. చుప్ప నాతి శూర్పణఖలాగ ఆ భాగ్యలక్ష్మి ఇంటి గుమ్మం దగ్గరే కాపలా నిలబడివుందే! 'ఒద్దుబాబూ! ఇప్పుడుగాని వాళ్ల ఫ్లాటు దగ్గరకెళ్లి, బంగార్రాజుని అభినందిస్తే దానికి ఏవేవో కొత్త అర్థాలు పీకి, మరో మారు అతని జీవితాన్ని హెల్ చేస్తుంది. కాసేపు ఆగితే, అతనే స్వయంగా వచ్చి చెప్తాడు. అప్పుడే అభినందిస్తాను మన సారా! మంచి వార్త ఏదివున్నా నాతో చెప్పకుండా ఊరుకోడు. ఈలోగా ఎందు కేనా మంచిది ఎవర్నేనా పంపి మంచి కలాఖండ్ స్వీట్ల పేకెట్ ఒకటి తెప్పించి వుంచుతాను' అని నిర్ణయించుకుంది సుందరి.

బంగార్రాజు కారు దిగేడు. షోఫర్ డోర్ తెరిచి పట్టుకుంటే, బంగార్రాజు స్టైల్‌గా కారు దిగేడు. అతని బ్రీఫ్‌కేసుని, లాప్ టాప్‌ని అందుకొని ప్రోటోకోల్‌కి ఎంతమ ట్టుకు అవసరమో అంతమట్టుకే దూరంలో నడుస్తూ- హాలు దగ్గరికి చేరుకుని- సామాను టీపాయి మీద వుంచి డిస్క్రీట్‌గా నిలుచున్నాడు షోఫర్.

"యు కెన్ గో నౌ" అని షోఫర్‌కి సెల విచ్చేసి డ్రాయింగు రూమ్ సోఫాలో చతికి లబడి చుట్టూ చూసేడు పరీక్షగా బంగా ర్రాజు. 'లక్కపిడతంత ఫ్లాటూ, షబ్బీగా కనిపిస్తున్న ఫర్నీచర్! ఏదో సామెత చెప్పి నట్టు 'ఇంటిపేరు కస్తూరి వారు ఇల్లల్లా గబ్బిలాల వాసనట!' అలా వుంది తన స్థితి కూడాను. లోపలికొచ్చిన షోఫరు గాడు ఎలా అంచనా వేశాడో? తన స్టేటస్ గురించి? తన వైభోగాన్ని అంచనా వెయ్య

## మీరయితే ఏం చేస్తారు?



కొంతమంది ప్రసిద్ధ వ్యక్తులు ఓరోజు వైట్ హౌస్‌కు వచ్చి, పాలనాయంత్రాంగంలో జరుగుతున్న కొన్ని పనులను విమర్శిస్తున్నారు.

లింకన్ వారు చెప్పింది ఓపిగ్గా విని 'మీరనే దాంట్లో వాస్తవముంది. నేనేమీ పరిపాలనలో తప్పులు జరగవని చెప్పట్లేదు. మీ ఆస్తినంతా బంగారంగా మార్చి మీ స్నేహితుడి చేతిలో పెట్టి, నయాగరా నదిపై రోప్‌వే మీద నడిచి అవతలికి చేరాలని చెప్పారనుకోండి. అతను దాన్ని తీసుకుని జాగ్రత్తగా నడుస్తున్నప్పుడు మీరివతల నిలబడి ఆ రోప్‌వేను ఊపుతారా? అతను అవతలి ఒడ్డుకు సురక్షితంగా చేరేందుకు విలువైన సూచనలు చేస్తుంటారా? ఇపుడు మన ప్రభుత్వం కూడా అంతే. మీరు ఓపిగ్గా సహకరించి, దాన్ని అవతలి ఒడ్డుకు చేర్చాలి' అన్నాడు.

దాంతో వచ్చినవారు తమ దుందుడుకు స్వభావాన్ని, అవగాహనా లేమికి సిగ్గుపడ్డారు.

కుండా చెయ్యడానికి- వాడ్ని రోడ్డు మీద నుంచే పంపించేసి వుండవలసింది! జరిగిపోయిందాని గురించి విచారించి లాభం లేదుకదా!! ఫైనాన్షియల్ పొజిషన్ కాస్త మెరుగవగానే ఏదేనా పోష్ బిల్డింగ్‌లోకి మారిపోవాలి..' ఇలా స్వగతించుకుంటూ డ్రాయింగు రూములో వున్న పాతకాలపు సోఫాలోనే చేరబడ్డాడు.

ఇంతలో మరి ఏం బుద్ధి పుట్టిందో? ఏమిటో? భాగ్యలక్ష్మి కాఫీకప్పుతో ప్రత్యక్షమయింది. కప్పుని మొగుడికందిస్తూ "ఏంవిటి విశేషం? ఏదేనా పగటి వేషాల కంపెనీలో ఉద్యోగంగానీ దొరికిందా ఏమిటి? ఈ దొరవేషం, దొరల కారు, డ్రైవరు, వాడు మీ సుందరి లాప్‌టాప్‌ని మోసుకురావడం.. అంతా చాలా తమాషాగా వుంది చూట్టానికి. పోనీండి సరదాగా కాలం గడపడానికి ఏదో కాలక్షేపం దొరికినట్టుంది! సంతోషం!" అంది బోలెడు వ్యంగ్యంగా మాటల్ని పలికిస్తూ.

భార్య నోటంట వస్తున్న వ్యంగ్యం గునపంలా గుండెలో దిగుతున్నా, ఆమె అజ్ఞానానికి జాలిపడి జవాబేదీ ఇవ్వకుండా, మౌనంగా కూర్చున్నాడు బంగార్రాజు. కాఫీ అందుకొని సిప్ చేసి తల ఆడించేడు కాఫీ బాగుందని. దాంతో భాగ్యలక్ష్మి కించిత్ ప్రసన్నవదనంతో పెదవుల మీద చిరునవ్వు మొలిపించి "చెప్పండి! ఏమిటో ఈ హడావిడంతాను? " అంది.

బంగార్రాజు వెంటనే సమాధానం ఇవ్వలేదు. కాఫీని సిప్ చేస్తూ, తీసుకోగలిగినంత టైము తీసుకొని చివరికి నిదానంగా బ్రీఫ్‌కేసు తెరచి, అందులోంచి ఒక లైట్ బ్లూకలర్ పేపర్ మీద అందంగా ప్రింటు చేసిన లెటర్ తీసి భార్యకి అందించేడు. ఆ మెసేజ్ చాలా చిన్నదే కావచ్చు. కానీ దాన్ని చదివిన వాళ్లు మాత్రం తుళ్లిపడేంత డీప్ స్ట్రక్చర్ ఆ మెసేజ్‌లో ఇమిడివుంది. దాని సారాంశం టూకీగా ఇలావుంది. 'మిస్టర్ బంగార్రాజు! ఫలానా వెల్ నోన్ ఐటీ కంపెనీలో టీమ్‌లీడర్‌గా అప్పాయింట్ అయినారు. అతనికి నిర్ణయించిన సేలరీ.. గుండె కొంచంసేపు ఆగిపోయేటట్టు చేసేంత పెద్ద అంకె!

ఆర్డరు కాగితం చదివి అలా నోరు వెళ్లబెట్టేసి ఆశ్చర్యంతో చూస్తూ నిలబడిపోయిందామె!

అంతలోనే మరో సర్‌ప్రైజ్‌ని చేసేడు బంగార్రాజు. తన బ్రీఫ్‌కేస్ తెరచి అందులోంచి ఒక చెక్‌ని తీసి భాగ్యలక్ష్మికి అందించేడు. దాని మీద వున్న అంకెని చూసేటప్పటికి ఆవిడకి నిజంగానే మూర్ఛ

వచ్చేసినట్టయింది. తను ఉత్తి నంగిరి పింగిరిగాడుగా ముద్రవేసిన ఈ మొగుడు గాడేనా? ఇలాటి మిరాకిల్ సాధించింది? వీడికి నెట్‌లో బూతు బొమ్మల్ని చూస్తూ కూర్చోడం తప్పిస్తే, మరొకటేదీ తెలిసి చావదని తను గట్టిగా నమ్ముతూ వచ్చిందే? మరి యిదేమిటి? వీడు సాఫ్ట్ వేర్‌దేన్నో తయారుచేసేయడమే కాకుండా, దాన్ని తీసికెళ్ళి ఏదో ఐటీ కంపెనీకి, వింటే కళ్ళు తిరిగి పడిపోవలసినంత పెద్ద మొత్తానికి అమ్మేసేడు కూడానా? అంటే, ఇప్పుడీ భజగోవిందంగాడు ఒక చిన్నసైజు కుబేరుడన్నమాట! అక్కడితో ఆగకుండా అదేదో ఆ ఐటీ కంపెనీలో టీమ్ లీడర్ ఉద్యోగం కూడానట! పిచ్చెక్కిపోయేంత పెద్ద జీతం! ఏతావాతా ఈ మొత్తం షాకింగ్ న్యూస్ (న్యూస్‌కి ప్లూరల్ ప్రత్యేకంగా లేదట!) లన్నీ కలిసి ఆమెలో అరిస్టాటిల్ చెప్పిన సానుకూల భావాల్ని ప్రొడ్యూస్ చేసేయి. దాంతో పిచ్చి ఉద్రేకంతో మొగుడ్ని వాటేసుకుంది. వాటేసుకోడంతో ఆగిపోకుండా, బంగార్రాజుకి ఊపిరి సలపకుండా ముద్దులాడేసింది.

ఉపద్రవం లాంటి ఈ ఉద్రేకం కాస్త చల్లబడ్డాక "ఇదంతా నేను నమ్మలేకపోతున్నాను డియర్! ఎలా సాధ్యపడిందీ మిరాకిల్?" అనడిగింది.

"లక్ష్మీ క్షీరసముద్రరాజ తనయాం.. ఎక్స్‌ట్రా ఎక్స్‌ట్రా.. ఆ తల్లి దయవల్ల..!"

"అబ్బ! మీకు లక్ష్మీదేవి మీద ఇంత గురన్నమాట! నాకేనాడూ తెలీదే!"

"సాక్షాత్తు- ఆ లక్ష్మీదేవి అవతారం మన కళ్లముందే నిత్యం కనిపిస్తున్నా, చూడలేని మన అశక్తత వల్లనే కాబోలు ఎవరో ఒక సినిమా కవి- 'కనులుండి చూడలేరు- గళముండి పాడలేరు' అని ఒకపాట రాశాడు"

"అయితే, ఎవరుబాబూ? మేమింత కాలం కనులుండి కూడా కానలేని ఆ లక్ష్మీదేవి అవతారం?" అంది భాగ్యలక్ష్మి కాస్త గోముగా! 'భాగ్యలక్ష్మీ! నువ్వే నా లక్ష్మివి' అని బంగార్రాజు సినీఫక్కీగా అంటూ, వాటేసుకుంటాడని ఆశ పడిందేమో? ఆ పిచ్చి భాగ్యలక్ష్మి!

కానయితే అతగాడు ఆమె ఆశించిన మాటలు అనలేదు. ఆమెని ప్రాణం పోయేంత ఉత్కంఠతో వెయిట్ చేయించి, చివరికి ముక్తసరిగా "సుందరి" అనేసి ధ్యాన పారవశ్యంలో వున్నవాడి మాదిరి తాదాత్మ్యంతో నిలబడిపోయాడు నిశ్చలంగా.

హారీ పాటర్ నవలలో ఉచ్చరించడానికి వీలులేని పేరొకటుంటుంది- సుందరి పేరు అలాంటిదే భాగ్యలక్ష్మికి. ఉచ్చరించడానికి కూడ వీలులేని ఆ పేరు తన చెవుల పడేటప్పటికి- ఆకాశం అమాంతం నెత్తిమీద పడిపోయినట్టూ, సముద్రం యావత్తూ ఆవిరయిపోయినట్టూ- భూమి పెనుప్రళయంగా కంపించినట్టూ- అనిపించి ఆగ్రహావేశాలతో ప్రళయకాల విస్ఫోటన లాంటి ధ్వనితో ఛీత్కారం చేసి- తన గదిలోకి వెళ్ళిపోయి- దడేలుమనే శబ్దంతో తలుపులు మూసేసింది. ప్రళయాగమన సూచకమైన ఆ ధ్వనినాలకించిన సర్వ ఫ్లాట్లలోని సకలజనులున్నూ, భయకంపితులై, ఫ్లాట్లనుండి పరుగులు తీయుటకు తమని తాము సిద్ధం చేసుకున్నారు.

ఈ రకమైన రియాక్షన్ బంగార్రాజుకి కొత్తేంకాదు. కానీ కనీసం, కాసుల వర్షం కురిసిన్నాడేనా- అలా కురిపించిన దేవత మీద- భక్తి, గౌరవం చూపించడానికి బదులుగా అక్కసుని కనపరచడం అతని మనసుని బాగా గాయపరిచింది. ఆ భావం క్రమేపీ- జుగుప్సగా మారింది. ఈ రకమైన మానసిక సంఘర్షణతో బంగార్రాజు సతమతమవుతున్న తరుణంలో మరో ఊహించని సంఘటన జరిగింది. జుట్టుపీక్కొనో, చీరని చింపుకొనో, కృష్ణుడి మీద దాడికి దిగిన సత్యభామ మాదిరి- భాగ్య

లక్ష్మి అలాంటి ఆహార్యంతోనే గదిలోంచి రివ్వున వచ్చి "ఏంవిటీ? - ఆ శూర్పణఖ రికమెండ్చేసి- మీకీ ఉద్యోగం ఇప్పించిందా? లేక- మీ దైన్యావస్థని చూడలేక- ఏదేనా పోష్ లొకాలిటీలో సమోసాల షాపు తెరుచుకోమని- ఉపాధి పథకానికి అడ్వాన్స్‌గా ఆ ముదనష్టపు చెక్‌ని చేతిలో పెట్టిందా? అలాంటి పనులు చేసి కాపరాలకి ఎసరు పెట్టడానికి కావలసినంత డబ్బుండి తగలడింది కదా- దాని బొండాం మొగుడికి! అది ఎంతేనా తెగించగలదు, బొండాం మొగుడితో మరి వేగలేక సీమ మిరపకాయలా కనిపిస్తున్న మీ మీద కన్నేసినట్టుంది. అది ఇస్తే యిచ్చింది కానీ- మీరెలా పుచ్చుకోగలిగేరు? " అంది అసూయతో.. నయాగరా జలపాతంలా అతని మీద విరుచుకు పడిపోతూ.

ఇక భరించలేక పోయాడు బంగార్రాజు. "విల్ యు షటప్, యు స్లట్!"అంటూ విసురుగా చెయ్యెత్తి- గభీల్‌మని టైటానిక్ ఎఫర్ట్ చేసి- తనని తాను అదుపులోకి తెచ్చుకున్నాడు. ఎంత వుద్రేకం వచ్చినా తనని తాను అదుపులో వుంచుకోవాలన్నది అతగాడు నిత్యం మననం చేసే డిసిప్లిన్ సూత్రం. ఉవ్వెత్తుగా లేచిన కోపాన్ని అదుపు చేసుకున్నాడే గానీ, మనసుకి తగిలిన గాయం భరించ శక్యం కాకుండా బాధిస్తోంది. మరక్కడ వుండలేక విసవిసా నడిచి బయటికి వెళ్లిపోయాడు.

లోకం చాలా చిన్నదిగా కనిపిస్తోంది బంగార్రాజుకి. ఎక్కడికి వెళ్ళడం? ఏం చెయ్యడం? ఈ బాధ నుంచి ఎలా ఉపశమనం పొందడం? ఎంతటి ఆనందం! ఎంతటి ఆనందాన్ని మూటకట్టి మరీ అపురూపంగా ఇంటికి తెచ్చి- ఆ మూటని విప్పి ఐశ్వర్యాన్ని కుమ్మరిస్తే, దానికి రావలసిన మహదానందస్థితి లాటి రెస్పాన్స్ రాలేదు సరికదా! దానికి బదులుగా తనని చిత్రవధ చేసే ఆరోపణలా? చివరికి తనకీ సుందరికీ- ఛీ! తలుచుకుంటేనే జుగుప్సతో మనస్సు, శరీరం అగ్నిపర్వతాలై పోతున్నాయే! సుందరి బహు సుందరమైన స్త్రీయే! సందేహం లేదు. అయితే ఆమె అందరి లాంటి మామూలు స్త్రీయా? కాదే! ఆవిడ ఒక స్త్రీరత్నం! ఆమెది కేవలం శారీరకమైన అందమే అని ఎవరేనా అంటే, వాళ్ల అవగాహన ఎంత లోపభూయిష్టమైనదో తెలిసిపోతుంది సుళువుగా! ఆమె మనస్సు ఎంత సున్నితమైనది! ఎవరినీ బాధించడానికి ఇష్టపడని మనస్సు ఆవిడది! అలాంటి భావన అందరికీ వుండదు. ఎవరో చాలా అరుదైన వ్యక్తులకి మాత్రమే వుంటుంది అలాంటి మనస్థితి. ఆవిడ్ని ఎప్పుడు చూసినా తనలో ఏదో ఆరాధనా భావమే తప్ప మరేరకమైన చంచలమైన ఆలోచనలూ రాలేదే! సుందరి, బాబూరావుల అన్యోన్యతని చూసి 'ఆహా! ఆదిదంపతులు.. వీళ్లిద్దర్నీ తమ పోలికలో భూమ్మీద ఒక జంట వుండాలని సంకల్పించి సృష్టించి- వుంటారు అనిపిస్తుంది.

సుందరి ఒక అలౌకిక స్వప్నం. స్వప్నం- అలా స్వప్నంగానే వుంటే బాగుంటుంది! కానీ అది అగ్లీ రియాల్టీగా మారితే ఎంత మాత్రం బాగుండదు. ఆరాధించవలసిన దేవత ఎప్పుడూ ఆ డివైన్ ప్లేన్‌లోనే వుండాలి.

కానీ ఈ భాగ్యం రాక్షసి- భాగ్యం కాదు- తనకి శాపంగా తయారైన దౌర్భాగ్యం- సుందరిని నీచస్థాయి స్త్రీగా చిత్రించాలని చూస్తోంది. వినరాని మాటలు దాని నోటంట వస్తున్నాయంటే- మనసులో ఎంత తీవ్రంగా నాటుకొని వుందో- అనుమాన బీజం!

ఇలా మానసికంగా అంతులేని క్షోభననుభవిస్తూ, దగ్గర్లోనే ఉన్న పార్కులోకి ప్రవేశించి ఒక మూలగా, ఎవరూ లేని జాగా చూస్కొని, అక్కడవున్న బెంచీ మీద చతికిలపడ్డాడు. ఏంవిటీ మానసిక

క్షోభ? పైగా ఇలాంటప్పుడా? రేపు తను టీమ్ లీడర్‌గా బాధ్యతల్ని స్వీకరించబో తున్న సమయంలోనా? రేపు తను టీమ్ మేట్స్ అందరినీ పలకరిస్తూ ఇష్టాగోష్ఠిగా మాట్లాడుతూనే తన ప్రయారిటీస్‌ని వివ రిస్తూ వాళ్లని ఇన్‌స్పైర్ చేసే మాటలు నాలుగు చెప్పాలి. ఆ విషయం గురించే కాంటెమ్‌ప్లేట్ చేస్తూ ఇంటికి వస్తే తన మూడ్‌నంతట్నీ ముక్కలు, ముక్కలు చేస్తూ భార్య యిచ్చిన రిసెప్షన్‌తో మైండంతా తునా తునకలైపోయింది. ఇలాంటి మనస్థితితో తను రేపు ఆఫీసుకి వెళ్లి, అక్కడ కొలీగ్స్ ముందు మాడు ముఖం వేసుకొని.. 'బే బే' అంటూ మాటలు తడబడితే తన గురించి వాళ్ళేం అనుకుంటారు? వీడేం టీమ్ లీడరు? వీడేం ఇన్‌స్పైర్ చేస్తాడు? అని నవ్వు కోరూ! ఈ లీడరుగాడు ఏదో బ్రహ్మాండమ యిన గైడెన్స్ ఇచ్చేస్తాడని బోలెడంత ఎక్స్‌పెక్టేషన్‌తో వస్తే ఇలా తుస్సుమనిపించే డని వాళ్ళు అనుకుంటే ఎంత అవమానం! అలా ఆలోచించుకొనేగా తన ప్రారంభోప న్యాసం అదిరి పోయేటట్టుగా వుండాలని తను వేయి వూహలతో ఇంటికి వస్తే, తన వూహలన్నిటి మీద ఐస్ వాటర్‌ని జల్లి తను నీరుగారిపోయేటట్టు చేసింది భార్యారత్నం. తన బలహీనతల్లా అందరి దగ్గర మంచిగా వుండాలనుకోడం- అదిగో! ఆ బలహీనతనే ఆసరాగా తీస్కొని తేరుకో లేని దెబ్బకొట్టింది.

మనస్సుని అల్లకల్లోలం చేసేస్తున్న ఆలో చనల సుడిగుండంలో కొట్టుకుంటున్న బంగార్రాజుకి సడన్‌గా సాక్షాత్కారం లభిం చినట్టయి ఆనందంతో ఉక్కిరిబిక్కిరైపో యాడు. ఎదురుగా సుందరి, బాబూరా వులు పార్వతీ పరమేశ్వరుల్లాగా! ఛా! బాగోలేదు. వీళ్లిద్దరూ- ఆదిదంపతులని అనవలసినంత ముసలి దంపతులేం కాదు

## ఎంగిలి చూయింగ్ గమ్ 14వేల డాలర్లు!

చూయింగ్ గమ్‌కి సంబంధించిన కొన్ని వింత విషయాలు

★ సింగపూర్‌లో చూయింగ్ గమ్ తినడం నిషిద్ధం. ఎక్కడ పడితే అక్కడ ఉమ్మేసి, నగ రాన్ని పాడు చేస్తారని నిషేధించారు. తింటూ పట్టుబడితే 1000 డాలర్ల జరిమానా విధిస్తారక్కడ.




★ 2012లో ఇంగ్లండ్‌లోని సూపర్ బజార్లలో చూయింగ్ గమ్ పేకెట్స్‌ని మాత్రమే దొంగిలించారు. రొమేనియాలో చిల్లరగా చూయింగ్ గమ్స్‌ని వాడతారు. అక్కడికి ఎగుమతి చేయడానికే ఇలా చేశారు.

★ 1927లో ఛార్లెస్ లిండ్‌బెర్గ్ న్యూయార్క్ నుంచి ప్యారిస్‌కి అట్లాంటిక్ మహా సముద్రం మీదుగా విమానంలో ప్రయాణించాడు. ఆ విమానంలో అతనికి కనపడనంత ఎత్తులో దిక్సూచిని బిగించారు. దాని ప్రతిబింబం కన పడేలా ఓ అద్దానికి వెనుక తిన్న బబుల్‌గమ్ లని అంటించి సమస్యని పరిష్కరించుకున్నాడు.

★ నటుడు రిట్జ్ అహ్మద్ 2014లో ఓ పాత్ర కోసం 30 పౌన్ల బరువు తగ్గాల్సి వచ్చింది. అందుకతను మెదడుకి, కడుపు నిండిందన్న సందేశం పంపే ఓ రసాయనిక పదార్థం పూసిన చూయింగ్ గమ్‌ని నమిలాడు.

★ హాలీవుడ్ నటి బ్రిట్నీ స్పియర్స్ నమిలిన చూయింగ్ గమ్ ఇ-బేలో 14,000 డాలర్లకి అమ్ముడైంది.

★ పెంటగాన్ అమెరికన్ ఆర్మీ కోసం నోటి బ్యాక్టీరియాని నశింపజేసి, దంత సమస్యలని అరికట్టే యాంటీ మైక్రోబియల్ పెపటైజ్ గల చూయింగ్ గమ్‌ని తయారుచేసింది.

కదా! అంచేత రతీ మన్మథుల్లాగ- ఇదీ బాగులేదు! బాబూరావు మన్మథుడి రోల్ కి ఫిట్టవడు! అంచేత 'చాలా అన్యోన్యమైన దంపతుల్లాగా..' అంటే అది సరిగ్గా సరిపో తుంది వాళ్లిద్దర్నీ వర్ణించడానికి. వాళ్ళు కూడా పార్కుకి వచ్చినట్టున్నారు.

మూలగా, భారంగా, నల్లని మబ్బు వేసి నట్టు కనిపిస్తున్న ముఖంతో ఒంటరిగా కూర్చున్న బంగార్రాజుని దూరం నుంచే గమనించి దగ్గరకు వచ్చేరు వాళ్లిద్దరూను.

తన ఎదుట నిలబడ్డ వాళ్ళిద్దర్నీ చూసే టప్పటికి బంగార్రాజుకి వర్ణించడానికి వీలు పడనంత ఆనందం కలిగింది. దూరం నుంచే అనుమానపడుతూ వస్తోందేమో, సుందరి ఎక్సరే కళ్ళు రూఢీగా కనిపెట్టే శాయి. సమ్‌థింగ్ ఈజ్ ఎమిస్ విత్ బంగార్రాజు అని. వెంటనే మనసులో నిర్ణ యించేసుకుంది- ఐ మస్ట్ రిపేర్ హిజ్ మూడ్! అని. వెంటనే "మనంవూ కాసేపు కూర్చుందామండి! ఈవెనింగ్ చాలా ప్లజెంట్‌గా వుంది" అంటూ బాబూరావుని బంగార్రాజు పక్కన కూర్చోబెట్టి, తనూ కూర్చుంది.

కొంచెం సేపు ఏవేవో పిచ్చాపాటీ కబుర్ల యాక మైకందకొని సుందరి కీ నోట్ ఎడ్రె స్సుని ఆరంభించింది.. "బంగార్రాజుగారూ! వచ్చిన కష్టాలేవయినప్పటికీ, మనతో అవి శాశ్వతంగా వుండిపోవు. తాత్కాలికమైన ఇబ్బందులు తరుచు వస్తూనే వుంటాయి. ఉద్యోగాలు లేక వూరేగుతున్న మా ఇద్దర్నీ చూడండి- అలాగన్నమాట! కానీ మాకు తెలుసు. దిస్ ఈజ్ ఓన్లీ ఎ బ్రీఫ్ లల్- అని. వియార్ స్యూర్ టు బౌన్స్‌బ్యాక్ టు అవర్ నార్మల్ స్టేట్ ఒన్స్ ఎగైన్. అలాగే మీరున్నూ- మీ సాఫ్ట్‌వేర్ క్లిక్ అయిందన్నారు కదా- అదీ రిటర్న్ ఆఫ్ ది గుడ్ డేస్‌కి సంకేతం. గత కొద్దిరోజులుగా మిమ్మల్ని హంట్ చేస్తున్న బ్యాడ్

## చతుర ప్రవేశిక

### ఏప్రిల్ చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. బంగార్రాజు పక్కింటావిడ?
   జ.
2. సుందరి భర్త?
   జ.
3. సుందరికి ఇష్టంలేని పని?
   జ.
4. సుందరింట్లో బంగార్రాజు చేసిన వంటకం?
   జ.
5. సుందరి బంగార్రాజుకిచ్చిన వస్తువేంటి?
   జ.
6. సుందరివాళ్లు ఏ దేశం ప్రయాణమయ్యారు?
   జ.
7. మురాద్ యజమాని కూతురు?
   జ.
8. 'ది గ్రేప్స్ ఆఫ్ రాత్' నవలా రచయిత?
   జ.
9. 'నైపీ డే' ఏ దేశంలో జరుపుకుంటారు?
   జ.
10. 'ఇంతకీ నేనెవరు?' నవలా రచయిత?
   జ.

పంపినవారి పేరు: ----------------------------------------------వయసు (    )

చిరునామా: ------------------------------------------------------------------

-----------------------------పిన్‌కోడ్ :                ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

గడువు తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

పీరియడ్ వెళ్లి పోయిందన్నమాట! మీ విషయంలో సరికొత్త ఉషోదయం వచ్చేసిందన్నమాట! ఆ ఊపునీ, ఉత్సాహాన్నీ అలాగే కంటిన్యూ చెయ్యండి. మండే సూర్యుడ్ని చిన్నచిన్న మేఘాలు అదుపు చెయ్యాలని చూస్తే అవే భంగపడతాయి- అంచేత విజయోత్సాహ ఆనందాల్ని కొనసాగించండి. మీరు ఏదో సీరియస్‌గా ప్లాన్ చేసుకుంటున్నట్టున్నారు! మీ ఆలోచనలకి అడ్డుగా వచ్చేమేమో..? మీ ఆలోచనామథనాన్ని కంటిన్యూ చెయ్యండి" అనేసి బాబూరావుని తీస్కొని వెళ్లిపోయింది.

'వాట్ ఏన్ ఇన్‌క్రెడిబుల్ లేడీ!' అని మనసులో అనుకోవలసిన మాటల్ని ఆనందహేలలో తేలిపోతూ బయటికే అనేశాడు బంగార్రాజు. ఆమె మాటలు గీతలోని 'భగవాన్ ఉవాచ' అన్నట్లుగా పన్చేశాయి అతని మీద. దాంతో అతన్ని గత కొద్ది గంటలుగా వేధించుకు తింటున్న మోనాటనీ, గ్రీఫ్, డిస్‌మే పటాపంచలయిపోయి, విత్ ఆల్మోస్ట్ ఇన్ హిజ్‌ఫుట్ ఎగురుకుంటూ ఇల్లు చేరుకున్నాడు.

★ ★ ★

ఆవేళ బంగార్రాజు కొత్త కంపెనీలో టీమ్ లీడర్‌గా జాయినవబోతున్నాడు. ట్రిమ్‌గా తయారై, సుందరి యిచ్చిన లాప్‌టాప్‌ని పట్టుకొని, వీధిలోకి వచ్చి మంచి శకునం కోసం చూస్తున్నాడు. ఈ సంగతిని ఎలా గ్రహించిందో ఏమిటో భాగ్యలక్ష్మి, చక్కగా ముస్తాబై, కేజువల్‌గా వస్తున్నట్టు బంగార్రాజుకి ఎదురుగా వచ్చింది. అయితే, అనెక్స్‌పెక్టెడ్ డైరెక్షన్‌లో సుందరి కూడా వచ్చింది. ఆమె చేతిలో ఒక బొకే, రెండో చేతిలో ఇంటికి కావలసిన పాలపేకట్! వేయివెలుగులతో విచ్చేసిన దేవతలా కనిపించింది ఆమె- బంగార్రాజుకి.

"హ్యాపీ అండ్ ప్రాస్పరెస్ టైమ్ ఇన్ ది న్యూజాబ్ బంగార్రాజుగారూ!" అని కీరవాణిలా బహుప్లజెంట్‌గా మంద్ర స్వరంలో గ్రీట్ చేసేసి, బొకేని అతని చేతిలో పెట్టేసి, తన ఫ్లాట్‌లోకి తుర్రుమందామె.

మొఖానికి చిరునవ్వుల మాస్క్ తగిలించుకొని అంతరాంతరాల నుంచి జనించిన అసలు సిసలు చిరునవ్వని భ్రమ కలిగించే చిరునవ్వుతో బంగార్రాజుకి ఎదురు రావాలనే సంకల్పంతో వున్న భాగ్యలక్ష్మికి అనుకోకుండా ఎదురుదెబ్బ తగిలింది. రామాయణంలోని మారీచుడు- మళ్లీ సుందరి వేషంలో జన్మించి- నోరూ వాయీ లేని రాముడ్లాటి తన మొగుడ్ని దొంగిలించుకుపోవడానికి- వెయ్యని వేషం లేదే! ఇలాంటి సమయంలో బయటపడిపోతే బాగుండదనిపించిదో- ఏమిటో- గొంతులో కక్షని ధ్వనింప చేస్తూ- మొగుడికి బెస్ట్ ఆఫ్ లక్ అనేసి చరచరా ఇంట్లోకి వెళ్లిపోయింది భాగ్యలక్ష్మి.

అయితే బంగార్రాజు మాత్రం ఈ చిన్న మంచిమాటకే ఎంతగానో పొంగిపోతూ సమధికోత్సాహంతో ఆఫీసుకి బయలుదేరేడు. తనని తీసుకువెళ్లడానికి వచ్చిన ఆఫీసు కారు పూలరథంలా అనిపించింది అతగాడికి. ఆఫీసు చేరేటప్పటికి, అందరూ సాదరంగా చిరునవ్వులతో, చిరుబొకేలని అందించి మరీ స్వాగతం పలికేరు. అతని రూపం, అతని ఆహార్యం, అతని వాచకం, అతని సెన్స్ ఆఫ్ హ్యూమర్- వీటన్నిటినీ నిశితంగా గమనించిన కొలీగ్స్ ఫ్లాట్ అయిపోయారు బంగార్రాజు ఛార్మింగ్ పర్సనాలిటీ ముందు. తన ఇన్‌స్పైరింగ్ ఎడ్రెస్‌తో అందర్నీ సమ్మోహితుల్ని చేసేసేడు. బాస్ అయితే మరి చెప్పడానికి వీల్లేదు, అంతలా పొంగిపోయాడు. అలాంటి మోస్ట్ ఫేవరబుల్ సమయం చూస్కొని- టీమ్‌లోకి ఒకరిద్దరు డైనమిక్ చాప్స్‌ని ఎవర్నేనా తీసుకుంటే అభ్యంతరమా? అని బాస్‌ని అడిగేడు బంగా

్రాజు.

"నో ప్రాబ్లెమ్ వాట్ సో ఎవర్! మీ ఇష్టం వచ్చినవార్ని తీసుకోండి. కంపెనీ పెర్‌ఫార్మెన్స్‌ని బెటర్ చెయ్యడానికి మీరు ఏ స్టెప్స్ తీసుకున్నా సరే- యు హేవ్ అవర్ అప్రూవల్. గో ఎహెడ్!" అని- సపోర్ట్ యిచ్చేరు.

వెంటనే బంగార్రాజు మనసులోనే డిక్రీడ్ చేసేసుకున్నాడు తన యాక్షన్ ప్లాన్‌ని. అంతే- ఆఫీసు నుంచి ఇంచు మించు గెంతుకుంటూ వచ్చేడు.

మొగుడు ఆఫీసు నుంచి వస్తూనే తనని చూసి కావలించేసుకొని, ముద్దుల్తో ముంచెత్తుతాడని కలలు కంటూ బాగా పెందరాళే ఆఫీసు నుంచి వచ్చేసి మరీ ఇంట్లో కూర్చుంది భాగ్యలక్ష్మి. రాబోయే సీను కోసమని కాబోలు అందాల ఆటబొమ్మలా తయారయి, వీధి తలుపుని బార్లా తెరిచి, తలుపుకి ఎదురుగా వున్న సోఫా అంచు మీద కూర్చుని బంగార్రాజు ఆగమనం కోసం ఎదురు చూస్తోంది.

అతగాడు రావడమయితే గాలిలో తేలుకుంటూనే వచ్చాడు. వస్తూనే భాగ్యలక్ష్మిని "హాయ్! డార్లింగ్!" అని పలకరించేడు కూడాను. లాప్‌టాప్‌నీ, బ్రీఫ్‌కేస్‌నీ తీసుకు వచ్చిన షోఫర్ వాటిని సోఫాలో పెట్టి అణకువగా నిలబడ్డాడు. "ఓకే! యు కెన్ గో!" అని అతనికి సెలవిచ్చి పంపించేశాడు కూడానూ.

ఇక తనని చేతుల్లోకి తీసుకొని ముద్దు మురిపాలతో ముంచెత్తే సీను ఆరంభం కాబోతోందని భాగ్యలక్ష్మి ఎంతో నమ్మకంగా అనుకుంటోందా - ఆవిడ ఆశించిన సన్నివేశం మాత్రం రాలేదు.

బంగార్రాజు చాలా హోదాగా సోఫాలో చేరబడుతూ సాంబ్రి మూడ్‌లో చాలా సీరియస్ మాడ్యులేషన్‌లో స్వగతం ప్రారంభించేడు "విధి ఎలాంటి ట్రిక్స్ ప్లే చేస్తుంటుంది! ఓ పది పదిహేను రోజులు కిందటి వరకూ కంప్యూటర్ మానిటర్ మీద నాకు నచ్చిన ప్రోగ్రామ్‌ని పెట్టుకొని చూడ్డానికి కూడా అవకాశం లేకుండా రోజులు గడపవలసి వచ్చింది. దేవుళ్లు లేరని ఎవరన్నారు? ఉన్నారు! నిశ్చయంగా వున్నారు. నా కష్టాల్ని గమనించిన దేవతలు 'యోగక్షేమం వహామ్యహం' అన్న గీతావాక్యాన్ని సత్యం చేస్తూ, సుందరి అనే దేవతని నా ఇంటి పక్క వాటాలోనే వుండేటట్టుచేసి, ఆమె ద్వారా నాకు కావలసిన కంప్యూటర్ని అందచెయ్యటమే కాకుండా, నేనా సాధనాన్ని ఏ రకంగా సద్వినియోగం చేస్తూ వినియోగించుకోవాలో కూడా నాకు ఎరుకపరచేడు పరమ యోగేశ్వరుడు. 'ఒరేయ్! బంగార్రాజూ! కాలక్షేపం బొమ్మల్ని చూడడానికి కాదురా కంప్యూటరనే మహాపరికరం! నీకు భగవత్ప్రసాదంలాగ లభించిన ఈ పరికరాన్ని సక్రమంగా వినియోగించి ఏదేనా పరమార్థాన్ని సాధించగలవేమో? ప్రయత్నించి చూడరా!' అని అశరీరవాణి రూపంలో నా మనసులో దూరి ప్రబోధించాడు.

అంతే! నాలో ఏదో కర్తవ్యదీక్ష ప్రవేశించింది. పదిరోజులపాటు మరో ఆలోచన అన్న మాటే లేకుండా తదేక ధ్యానంతో మనసులో ఎప్పటి నుండో లీలగా మెదులుతూ వున్న సాఫ్ట్‌వేర్ మీదనే లగ్నం

**కొత్తగాలి...**

**చతుర, విపుల**
**సాహితీ కలువలు**
**'ఈనాడు'**
**కన్న కవలలు!**

– వి.వి.యస్. మూర్తి,
చొదిమెళ్ల, ప.గో. జిల్లా

చేశాను దృష్టిని! మధ్యమధ్యన దేవతలు వచ్చి బుజ్జగించి ప్రోత్సహించినట్టు, సుందరి వచ్చి వేయి వెలుగుల చిరునవ్వొకటి నవ్వి 'గో ఎహెడ్' అని చిన్నగా తల ఊపుతూ ఉత్సాహపరుస్తూ వుండేది. అబ్బ! ఆమె తలని ఆడిస్తూ వుంటే ఎంత గ్రేస్‌ఫుల్‌గా వుంటుందీ! ఆనందంతో మైమరచి నృత్యం చేస్తున్న నెమలి మన వైపు తన తలని తిప్పి చూసినట్టు" ఇంత దాకా అనుకొని, బంగార్రాజు తాదాత్మ్యంలోకి వెళ్ళిపోయాడు కాసేపు. ధ్యానావస్థ బహుశా సుందరి చేసిన గ్రేస్‌ఫుల్ నాడ్‌ని మనోనేత్రంతో దర్శిస్తూ వుండివుండవచ్చు! కానీ తన మాటల్ని ఆలకిస్తున్న భాగ్యలక్ష్మికి మాత్రం ఆ మాటలు మరుగుతున్న తారు చెవుల్లోకి ప్రవేశిస్తున్నంత బాధని కలుగచేస్తూ వుండి వుండవచ్చుననే ఆలోచన రాలేదతగాడికి.

ధ్యానం నుండి బయటికి వచ్చి తన సాలిలోక్వి(స్వగతాన్ని) కంటిన్యూ చేశాడు బంగార్రాజు. 'ఆ రకంగా లభించిన ప్రోత్సాహ ఫలితంగా కొంతకాలంగా నా ఊహల్లో కదులుతున్న ఒక సాఫ్ట్‌వేర్ స్పష్టమైన ఒక రూపాన్ని సంతరించుకొని పావురంలా ఒదిగిపోయింది సుందరి బహూకరించిన ఈ లాప్‌టాప్‌లో- దానివల్ల ఏం జరిగిందీ? నిన్నటి వరకూ కుచేలుడి స్థితిలో వున్న నేను కుబేరుడి స్థాయిలోకి వచ్చేశాను- రెండంటే రెండే రోజుల టైమ్‌లో. కుచేలుడు అటుకుల్ని మూటగట్టి కృష్ణపరమాత్మకి కానుకగా తీసికెళ్లినట్టు, నా సాఫ్ట్‌వేర్‌ని పేక్‌చేసి పట్టుకెళితే కుచేలుడి పేద కానుకతో మహానందభరితుడయిపోయి . అమాంతం అటుకుల్ని ఆబగా నోట వేసేసుకున్న పరమాత్మలాగ- ఆ కంపెనీ బాస్ కూడా పొంగిపోయి నా సాఫ్ట్‌వేర్‌ని ఆబగా లాగేసుకొని సీడీని తన సిస్టమ్‌లో లోడ్ చేసేసి - చిన్నగుంటలు కంప్యూటర్ గేమ్‌ని వాచ్ చేస్తుంటారే, ఆ టైపులో వాచ్ చేశాడు. తరవాత తన సలహాదార్లతో ప్రైవేట్‌గా భేటీ అయిపోయి- లాభనష్టాలు బేరీజు వేసేసుకొని, బయటికొచ్చి నాచేతిలో ఊహాతీతమైన అంకె వేసిన ఒక చెక్‌ని వుంచాడు. ఇహ నుండి నేనతని ఆప్తబంధువుని అన్నట్టుగా చెయ్యి జాడించేశాడు- జాయింట్ కదిలిపోయేంతగా విగరస్‌గా. తన ఐటి ఫార్మ్‌కి కాబోయే సీఈఓని నేనే అన్నట్టుగా హింట్స్ డ్రాప్‌చేశాడు.

ప్రస్తుతానికి ఒక టీమ్ లీడరుగా వుండు అని చెప్పి ఏసీ రూము, రివాల్వింగ్ ఛైర్, చిరునవ్వుతో ప్రత్యక్షమయ్యే సెక్రటరీ- ఆ అమ్మాయికి మొహమల్లా స్ఫోటకం మచ్చలుంటేనేగాక- ఇంగ్లీషులో- కోయిల కూతంత మధురమైన ఉచ్చారణ, పెదిమల మీద సమ్మోహన మంత్రం లాంటి చిరునవ్వు, ఆమె ప్రజెన్సే ఒక కిక్కు-' అని తాదాత్మ్యాన్ని అభినయిస్తున్న బంగార్రాజు చేష్టల్నిగానీ, మాటల్నిగానీ ఇక ఎంత మాత్రం సహించలేకపోయింది భాగ్యలక్ష్మి. సుందరి భజనే భరించలేనంత బాధని కలిగిస్తోందనుకుంటుంటే, ఇప్పుడు కొత్తగా చిరునవ్వులని ఒలకబోసేస్తున్న మరో పాత్ర రంగప్రవేశం! దాంతో నాటకానికి ఊహించని కొత్త మలుపు.

మరి భరించలేకపోయింది భాగ్యలక్ష్మి అతగాడి స్వగతాల్ని. ఇక ఈ నాటకాన్ని ఆపుచెయ్యాలి. లేకుంటే తన బతుకే ఒక విషాదాంత నాటకం అయేటట్టు కనిపిస్తోంది, అతగాడి మాటలు వింటుంటే. ఇలాంటి ఆలోచన రాగానే ఈ తతంగం భరించలేనని నిశ్చయించేసుకొని సర్రున తను కూర్చున్న కుర్చీలోంచి లేచి, లోపలికి వెళ్లిపోయింది.

విస్తుపోయాడు బంగార్రాజు- ఏంవిటిదని. తన విజయ గాథని స్క్రీన్‌ప్లేలాగ సీన్ తరవాత సీన్‌ని వివరంగా చెప్పి ఎక్స్‌ప్లెయిన్ చేస్తుంటే తనని కట్ చేసినట్టు

హఠాత్తుగా లేచి వెళ్లిపోడమంటే తనని ఓపెన్‌గా ఇన్‌సల్ట్ చెయ్యడం కాదూ? ఇంకా నయం తను చెప్తున్న సీరియల్ కథ అర్ధంతరంగా ఆగిపోయింది. కథ ముగింపు దాకా విని వున్నట్టయితే సునామీలా విరుచుకు పడిపోయి వుండేదేమో!

మూడ్ పాడయిపోయింది బంగార్రాజుకి. విజయగాథలో తను పడిన శ్రమని సానుభూతితో ఎవాల్యూట్ చేసి, అందులో తను నిర్వహించిన దుష్టపాత్రకి సిగ్గుపడి- క్షమించమని అడుగుతుంది భాగ్యలక్ష్మి అని ఆశపడ్డాడు బంగార్రాజు. ఇప్పుడు తెలుస్తోంది. తనది ఎలాంటి స్టుపిడ్ ఆలోచనో! 'తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చు. ఎట్సెట్రా ఎట్సెట్రా- మూర్ఖుల మనసు రంజింపరాదు' అని కదా అన్నాడు కవి! కవి వాక్యం ఇంతలా నిజమవుతుందన్నమాట!

ఈ రకంగా ఆలోచనల సముద్రంలో కొట్టుకుంటున్న బంగార్రాజుకి సడన్‌గా గుర్తువచ్చింది తను కర్తవ్యాన్ని విస్మరించానని. ఆ సంగతి గుర్తుకు రాగానే పోయిందనుకున్న మూడ్ తిరిగి వచ్చేసింది. దాంతో కాళ్ల కిందని ఏదో స్ప్రింగు ఎగతన్నినట్టనిపించి చప్పున లేచి నిలబడి టైని మరోమారు సరిచూసుకొని హుందాగా అడుగులు వేస్తూ- దరహాసం మొగమంతా నింపుకొని- చందమామలా చల్లని కాంతితో మురిపిస్తూ- సుందరి, బాబూరావుల ఫ్లాటులోకి ప్రవేశించేడు.

మృదువుగా వినిపించిన తలుపుతట్టుడు విని తలుపు తెరిచింది సుందరి. ఒక నిముషం తన కళ్లని తనే నమ్మలేకపోయింది. ముఖాన డిజార్మింగ్ చిరునవ్వు, రేమండ్ మోడల్ మాదిరి గొప్ప స్టైలిష్‌గా కనబడుతున్న ఫుల్‌సూటు, సిల్వెస్టర్ స్టైలాన్‌లాగ సీరియస్ లుక్.. వీటన్నిటినీ కలబోసి పిక్చర్ ఆఫ్ కాన్ఫిడెన్స్‌లా కనిపిస్తున్న బంగార్రాజు. ఇతగాడు- ఇన్నాళ్లుగా తనకి తెలిసివున్న బంగార్రాజేనా? అని అనుమానం వచ్చి విస్తుపోయింది సుందరి. ఉద్యోగాలు పోయాయి కదా! మళ్లీ ఉద్యోగాలు సంపాదించుకోడం ఎలా? అని భార్యాభర్తలిద్దరూ బ్రెయిన్ స్టార్మింగ్ సెషన్‌లో వున్నారు.

క్షణం కిందటివరకూ ఏమీ పాలుపోక తలలు పట్టుకోడం వల్లనేమో బంగార్రాజు పర్సనాలిటీ మరింత ఇంప్రెసివ్‌గా కనిపిస్తోంది సుందరికి.

"యు లుక్ ఫెంటాస్టిక్! కమ్ వెల్‌కమ్! యు టెల్ అస్ యువర్ ఫస్ట్ డే ఫీలింగ్స్ ఇన్ ది న్యూ అసైన్‌మెంట్" అని కుశల ప్రశ్నలు వేసింది, మంచి ఆంగ్లేయ యాసలో సుందరి.

ఆమె మాటలు ఇవాళ రవిశంకర్ సితార్ వాదనం అంత మధురంగా వినిపించేయి బంగార్రాజుకి.

'అదీ! అలా వుండాలి మనిషంటే..! పిక్చర్ ఆఫ్ గుడ్ అండ్ అమియబులిటీ' అని మనసులోనే తన్మయం చెందాడు బంగార్రాజు.

సోఫాలో కూర్చుంటూ "సుందరిగారూ! బాబూరావుగారేరి? మీ ఇద్దరి కోసం హ్యాపీ టైడింగ్స్‌ని మోసుకొచ్చాను. అంతటి బరువైన వార్తని మోసుకొస్తున్నప్పుడు కాస్త అలసటగా అనిపించదూ? అంచేత మీ అమృత హస్తాలతో ఏదేనా ఇచ్చి ముందు నేను సేదదీరేటట్లు చెయ్యండి! తదుపరి మీరున్నూ, బాబూరావుగారున్నూ సావధానముగా ఆసీనులై నేను ప్రవచించబోవు కథా విధానమును శ్రవణము గావింతురు గాక!" అన్నాడు పక్కా నాటకఫక్కీలో.

సుందరి కిలకిలా నవ్వింది, అతని నాటకం డైలాగుల్ని విని. తదుపరి "బంగార్రాజుగారూ! మిమ్మల్ని చూస్తుంటే నిజంగానే చెప్పలేనంత ఆశ్చర్యం కలుగుతోంది. ఈర్ష్య కూడా వేస్తోందంటే నమ్మండి! అటు చూస్తే ఎంతోమంది ఆశించే అతి గొప్ప

## కాల్పుల శబ్దాలతో సంతోషం?!

అమెరికా అంతర్యుద్ధం సమయంలో 'నాక్స్‌విల్లీవైపు తుపాకులు కాలుస్తున్న శబ్దం విన్పిస్తోంది!' అని లింకన్‌కు టెలిగ్రామ్ వచ్చినపుడు 'చాలా సంతోషం!' అన్నారు లింకన్.



అక్కడున్న ఓ అధికారి 'తుపాకి కాలుస్తున్న శబ్దం వినిపిస్తుంటే సంతోషమంటారేం?' అని విడ్డూరంగా అడిగాడు.

అప్పుడు లింకన్ 'నిజం చెప్పాలంటే మిసెస్ సెలివార్డ్ పరిస్థితిలాంటిదే నాదీనూ. మా పక్కింట్లో ఉండే ఆమెది పెద్ద సంతానం. రోజూ ఎవడో ఏడుస్తూనో, అరుస్తూనో ఉండేవాడు. అది విన్నప్పుడల్లా ఆమె - అంటే నా బిడ్డల్లో ఇంకా చనిపోనివాడు ఒకడైనా మిగిలి ఉన్నాడన్నమాట. చాలా సంతోషం.. అని అంటుండేది" అన్నాడు.

ఐటీ జాబ్, ఇటుచూస్తే- కలినరీ ఎక్స్‌పర్టైజ్.. వీటన్నిటినీ కాదనుకుంటే నాట్యావధానం- ఏకపాత్రాభినయం- విదూషక పాత్ర నుంచి విశ్వసామ్రాట్ పాత్రవరకూ- విలన్ వేషం తప్పించి- కాగడాపట్టి వెదికినా మీలో విలన్‌కి కావలసిన లక్షణం ఒకటీ దొరకదు. మీ వ్యక్తిత్వ లక్షణాలు, సాఫ్ట్ స్కిల్స్- ఏ కార్పొరేట్ మేగ్నెట్‌లో దొరుకుతాయండీ? "

"ఆగండాగండి! మీ మాటలు వింటుంటూ ఉద్రేకం వచ్చేస్తోంది. ఆనందంతో ఉక్కిరిబిక్కిరై ఏమయిపోతానో అని భయంగా వుంది. ముందుగా నాకు తాగడానికి ఏదేనా ఇస్తే- అది తాగి చల్లబడి- మీ వేడి వేడి పొగడ్తలు వింటూ, సంతోషపడతాను!"

దాంతో చప్పున సుందరి లోపలికి వెళ్లిపోయింది. చెప్పొద్దూ బంగార్రాజుని వాటేస్కొని, ముద్దులతో ఉక్కిరిబిక్కిరి చేసేయాలనే కోరిక పెనుతుఫాన్లా చెలరేగిందా విడ్లో! మోహమాయాజాలంలా వినిపిస్తున్న అతని మాటలు వింటూ అక్కడే మరి కాసేపుంటే అంతటి అఘాయిత్యానికీ దిగిపోతానేమో ననిపించి- 'తాగడానికి మీకు డ్రింకు తెస్తానుండండి!' అని లోపలికి వర్చువల్‌గా పారిపోయింది.

ఇవతల సోఫాలో కూర్చున్న బంగార్రాజైతే, ఉద్వేగాన్ని ఆపుకోలేక కన్నీరు పెట్టుకున్నాడు! మరీ ఇంత మంచితనం కూడా ప్రపంచంలో వుంటుందా? అని. సుందరిలాంటి దేవతలు 'ఆనంద స్థాపనాయ సంభవామి యుగేయుగే' అనుకుంటూ, కలలాంటి ఒక ఉద్విగ్నస్థితిలో వుండిపోయాడు.

ఓ పదినిమిషాలు పోయాక సుందరి సీను మీదకొచ్చింది. ఓ సిల్వర్‌జగ్‌తో వాటరు, సిల్వర్ టంబ్లర్లు, తినడానికి ఏవో స్నాక్స్- ఫ్లాస్కుతో కాఫీ పట్టుకొని- వస్తోంది.

ఆ బరువుల్ని చూసి తత్తరపాటు చెందిన బంగార్రాజు గభీమని లేచి- వాటినందుకొని- ఆమెకు సాయం చేసి, వాటన్నిట్నీ టీపాయ్ మీద అందంగా అమర్చేడు.

"ఇన్ని వస్తువులు మోసుకొస్తున్నప్పుడు ఓ చిన్న కేక పెట్టలేకపోయారా? నేను వచ్చి అందుకునేవాడ్ని కదా! 'మీ అందాల చేతులు కందేను పాపం! సాయంవలదా?' అని నాగేశ్వర్రావులాగ పాడివుండేవాడ్ని కూడాను" అన్నాడు చిలిపిగా-

"ఊరుకోండి! యు నాటీ! రకరకాలుగా ప్రలోభ పెట్టేస్తున్నారు మనుషుల్ని" అంది సుందరి, లేని అలకని గొంతులో ధ్వనింప చేస్తూ.

ఆమె కళ్లలో ఎందుకో లీలగా తడి గోచ

రించింది బంగార్రాజుకి.

"ఎనీ థింగ్ రాంగ్.. మేడమ్? నేనుగాని మిమ్మల్నిగానీ హర్ట్ చేశానా నా ఇన్‌డిస్క్రీట్ వాగుడుతో? " అతన్లో ఏదేనా తప్పు చేసేశానేమో అనే గ్లాని.

"ఛా! ఛా!! అలాంటిదేంలేదు. నాకు తెలిసిన బంగార్రాజుగారికి ఎప్పుడూ మనుషుల్ని ప్లీజ్ చెయ్యడమే తెలుసు. తన సొంత బాధలు ఏమైనాకానీ ఇతరుల్ని ఎప్పుడూ గుడ్ హ్యూమర్‌లో వుంచడమే అతని నైజం" అంది సుందరి, నిజమైన ఫీలింగ్‌తో.

ఇంగ్లీషు మాటల్ని ఆమె ఉచ్చరిస్తున్న తీరు, ఆమె గొంతులో పలుకుతున్న మాడ్యులేషన్స్ చూసి ముగ్ధుడైపోయాడు బంగార్రాజు 'ఆహా! ఎంతగొప్ప సాఫ్ట్ స్కిల్స్ ఈవిడవి' అనుకుంటూ.

ఈలోగా సుందరి తన ఉద్వేగాన్ని అదుపులోకి తెచ్చుకొని కంటిన్యూ చేసింది. "చెప్పకేంగానీ బంగార్రాజుగారూ! వి ఆర్ ఎ బిట్ వర్రీడ్- ఇద్దరికీ ఉద్యోగాలు లేకుండా అయిపోయాయి కదా- అని. ఉద్యోగాలు లేకపోతే బతకలేమని కాదు. మాకు పూర్వుల నుంచి సంక్రమించిన ఆస్తిపాస్తులు బాగానే వున్నాయి. కానీ అదికాదు పాయింటు, చేతిలో మంచి మంచి క్వాలిఫికేషన్స్ వుండి కూడా నిరుద్యోగులుగా వున్నామే అని బాధ. మా ప్రజెంట్ పొజిషన్ చూసి మనుష్యులు అవహేళనగా చెవులు కొరుక్కుంటున్నారేమోననే ఫీలింగు. అంచేతనే కొంచెం అప్‌సెట్ అయినట్టు కనిపిస్తూన్నామేమో! అదర్‌వైజ్, వి ఆర్- అబ్సొల్యూట్లీ ఓకె! సారీ- కిల్ జాయ్‌లాగ మీ ఉత్సాహాన్నంతట్నీ పాడుచెయ్యడం లేదు కదా నేను? మీరు మీ విజయాన్ని సెలబ్రేట్ చేసుకునే మూడ్‌లో మా ఇంటికొస్తే నేను మీ హ్యాపీనెస్‌ని పాడు చేస్తున్నానేమో! మా గొడవల్నిచెప్పి.."

సుందరి తమ విషయాల్ని ఎంత కేజువల్‌గా చెప్పాలని చూస్తున్నా, ఆమె గొంతులో ధ్వనిస్తున్న ఆవేదనని పసిగట్టకపోలేదు బంగార్రాజు. అతగాడు చలించిపోయాడు. కళ్లనుండి నీరు వచ్చేసింది. గొంతు పూడుకు పోయింది. అతి ప్రయత్నం మీద మాట్లాడలేకపోయాడు.

"నాకు ఇవాల్టి రోజున ఉద్యోగం వచ్చిందంటే, దానికి వెనకాతల మీ ప్రేరణ వుంది. అలాంటిది సాక్షాత్తు మహాలక్ష్మిదేవీలాంటి మీరు నాలాంటి పేదవాడి ముందు కూర్చొని దీనంగా మాట్లడితే నేను ఎలా తట్టుకోగలను చెప్పండి? నాదృష్టికి మీరెప్పుడూ సర్వమంగళాదేవి స్వరూపమే. ఆ రూపం ఏరకంగా కలత పడినట్టు కనపడినా నేను సహించలేను. గుడ్ న్యూస్‌ని మనం నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నప్పుడు బ్రేక్ చేద్దాం అనుకున్నాను. కానీ అకేషన్ ఇలా అయింది కాబట్టి, మరి దాన్ని పోస్ట్‌పోన్ చెయ్యను. సన్నివేశం బరువెక్కిపోయింది అనవసరంగా. ఏది ఏమైనా గుడ్ న్యూస్ ఈజ్ ఆల్వేజ్ గుడ్ న్యూస్! మీరు, బాబూరావు గారూ ఇక ఏమాత్రం నిరుద్యోగులు కారు. రేపుపొద్దున్నే వచ్చి మీరిద్దరూ మా ఆఫీసులోనే జాయినవుతున్నారు. మా కొత్త బాస్ దగ్గర ఆ మేరకి ఎస్యూరెన్స్ తీసుకొని మరీ వచ్చాను మీదగ్గరికి. మీ సంస్కారానికీ, హోదాకి, టెక్నికల్ ఎక్స్‌పెర్టైజ్‌కి తగినట్టుగా వుంటాయి మీ జీతభత్యాలు. మనం ముగ్గురం కలిసి ఫెంటాస్టిక్ రిజల్ట్స్ సాధిద్దాం. మీరు ఎంకరేజ్ చేస్తూ పక్కన వుంటే హరికౌస్తుభాన్నయినా సాధించగలననే నమ్మకం నాకుంది. బాబూరావుగారికి చెప్పండి ఈ గుడ్ న్యూస్. ఆయన ఇంట్లో లేనట్టున్నారు. ఆయనలో వున్న గొప్ప విశేషం ఏమిటో చెప్పమంటారా? ఆయన నిశ్శబ్ద సంగీతం లాంటివాడు. మనం పట్టించుకుంటు

న్నామా? లేదా? అన్న సంగతి గమనించదు కదా సంగీతం.. అలాగే బాబూరావుగారున్నూ. ఆయన ఇప్పటికింకా మనతో జాయిన్ అవలేదంటే ఆయన ఇంట్లో లేరని అనుకుంటున్నాను"

"అదే! అదే! ఈ జాబ్స్ విషయమే ఎవరో ఫ్రెండ్ కేలిఫోర్నియాలో వున్నాడట! ఆయన్ని కాంటేక్ట్ చేసొస్తానని వెళ్లేరు. మాకెందుకో నెట్‌ప్రాబ్లమ్ వచ్చింది. అందుకని బ్రౌజింగ్ సెంటర్‌కి వెళ్లేరు. ఈపాటికి వచ్చేస్తూ వుండాలి! పని లేనప్పుడు గదిలో కూర్చొని తన పనేదో తను చూస్కోడం తప్పిస్తే అనవసరంగా మాటలు కలిపి వారినీ వీరినీ హర్ట్ చెయ్యడం వారికిష్టం వుండదు. అంచేత పనవగానే నేరుగా ఇంటికే వచ్చేస్తారు"

"అవునవును! మీరు చెప్పింది అక్షరాలా నిజం! మరి నేనో- బాబూరావుగారి మన స్తత్వానికి వ్యతిరేకం. ఆయన నిశ్శబ్ద సంగీతం అన్నాను కదా! అందుకని నన్ను నేను గలగల శబ్దంతో ప్రవహించే సెలయేరుతో పోల్చుకుంటాను. క్షణం కూర్చోలేను కదా, మాట్లాడకుండా!"

"మీ సంగతే వేరు బంగార్రాజుగారూ! మీరెప్పుడూ మాట్లాడుతూ వుండేమాట నిజమే అయినా.. 'సత్యం బ్రూయాత్! ప్రియం బ్రూయాత్! న బ్రూయాత్ సత్యమప్రియమ్!' అన్నట్లుగా వుంటుంది మీ సంభాషణ"

ఆవిడ చదివిన సంస్కృత శ్లోకం విని ముగ్ధుడై నిలబడిపోయాడు బంగార్రాజు, తరువాత తేరుకొని అన్నాడు. "అదేదో అన్నారు! కాస్త విడమరచి చెప్పండీ దాని భావం!"

"అంటే, మీరెప్పుడూ అబద్ధాలు చెప్పరు. పైగా చెప్పేదెప్పుడూ, ఇతరులకీ నచ్చుబడి అయ్యేటట్టు చెబుతారు.."

"అక్కడితో ఆపండి! చూస్తుంటే మీ నాలెడ్జి అంతులేని సముద్రంలా కనిపిస్తోంది. ఇంగ్లీషు కొటేషన్లు ఒక్కటే అనుకుంటుంటే, ఇప్పుడు సంస్కృత శ్లోకాలు కూడా ఉటంకిస్తున్నారు! నాలాటి వాడికి ఊపిరాడదు, ఇంత నాలెడ్జిని ఊహించేటప్పటికి. సరే! టు కట్ ఎ లాంగ్‌స్టోరీ షార్ట్! రేపొద్దున్న మీరిద్దరూ నాతోపాటే మా ఆఫీసుకొచ్చేస్తారు. ఈ మాట బాబూరావుగారితో చెప్పి, ఇక కేలిఫోర్నియాలనీ, కాల్ పర్నియాలనీ మరిచిపొమ్మని చెప్పండి"

"చేస్తానుగానీ ఈ 'కాల్‌పర్నియా' అంటే ఏమిటి? "

"జూలియస్ సీజర్స్ వైఫ్. పేరు వినేవుంటారు! 'సీజర్ వైఫ్ ఈజ్ ఎబౌ సస్పీషియస్' అన్న సూక్తిని. అంచేత ఇతరమైన మీ జాబ్ ప్లాన్స్ అన్నిటికీ స్వస్తి! మనం ముగ్గురం ఒక ఆఫీసులోనే పన్చేసి చరిత్ర సృష్టిద్దాం..!"

"అలాగే చెయ్యొచ్చుగానీ! మీ ఇంట్లో రోజూ పేలే అగ్నిపర్వతాల సంగతి ఆలోచించేరా? "

"ప్రతి అమృతభాండం వెనకా కాలకూట విషం పాత్ర కూడా పొంచి వుంటుందని మీకూ తెలుసు. మరేం చెయ్యగలం చెప్పండి? వి మస్ట్ టేక్ థింగ్స్ ఏజ్ దే కమ్ టు అజ్"

"ఫైన్! కానీ ఎవరిపైనా నిందవేయని మీ మనోప్రవృత్తి అందరూ అలవరచుకోగలిగితే, ఎంత బావుంటుంది!"

"మరి నేను వెళ్లొస్తాను సుందరిగారూ!" అని బయల్దేరిపోయాడు బంగార్రాజు.

నడుస్తున్నాడన్నమాటేగానీ వెళ్లాలనిపించడంలేదు. 'సుందరితో కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటే, కాలగమనమే తెలియడంలేదు. అయినా ఇంతసేపైన తర్వాత కూడా కదలకపోతే, తన ఆఫీసులో జాబ్ యిస్తానని ఆశ చూపించి అనువు కానంత సమయం బైఠాయించి ఎడ్వాంటేజ్‌తీసుకుంటున్నాడని భావిస్తే సుందరి? ఆవి

డలో అలాంటి భావం కలిగించడంకన్నా, ఇంకే నరకాన్నేనా భరించడానికి సిద్ధం..' అనుకుంటూ ఇల్లు చేరేడు.

అక్కడ నరకం సిద్ధంగానే వుంది. ఓ కాఫీలేదు.. టిఫిను లేదు! కనీసం పలకరింపు కూడా లేదు. చలికాలంలో చన్నీటిని చిలకరించినట్లుంది ఇంటి వాతావరణం.




**బా**బూరావు ఇంటికి రాగానే, బంగా[్రాజు [్రస్తావించిన విషయాన్ని చెప్పింది సుందరి.

అంతా విని బాబూరావు "సుందరి డార్లింగ్! నీ వుద్దేశమేమిటి? " అనడిగేడు.

"నాకయితే ఇష్టంలేదు!"

"ఎందుకట? "

"మనం ఉద్యోగం సద్యోగం లేకుండా ఇలా వున్నామా- మన ఈ స్థితిని చూసి కూడా ఓర్వలేక, మననేమీ అనలేక- బంగా[్రాజుని నానా తిప్పలూ పెడుతోంది కదా ఆ భాగ్యలక్ష్మి. మనమేగానీ అతడి ఆఫీసులో చేరితే ఆవిడ సహించగలదా- చెప్పండి! అంచేత మనం అతగాడ్ని మరిన్ని కష్టాల్లోకి దింపొద్దు! మనకి జాబ్స్ అంటారా? మీరెలాగూ [్రయత్నిస్తూనే వున్నారు. ఇవాళ కాకపోతే రేపేనా వస్తాయిగానీ రాకమానవుకదా!"

"ఇందుకే సుందరం! నువ్వంటే గౌవరం, ఎఫెక్షన్, అ[్రిసియేషన్! ఏ సమస్యనైనా ఎంతో ఎనలిటికల్‌గా చూస్తావు! నువ్వన్నది నిజమే! బాగా ఏడుస్తుంది- అది ఆవిడ సహజగుణం. ఇదే జరిగితే- బంగా[్రాజు అనుభవించే నరకానికి అంతే వుండదు. కానీ డార్లింగ్! ఆవిడ్ని రిపేర్‌చేసే మార్గం లేదా? "

"ఈర్ష్య, అసూయ, ద్వేషాలు పుట్టుకతోనే వచ్చేస్తాయని నా బిలీఫ్! వాటిని సరిద్దడం అసాధ్యం అని నా నమ్మకం"

"పర్‌హాప్స్ యు ఆర్ రైట్ డార్లింగ్! కానీ ఏనాడూ లేనిది, ఇవాళ నాకెందుకో కొంటె వూహలు వస్తున్నాయి!"

"రియల్లీ! దెన్ ఇట్ ఈజ్ ఎ సర్[్రైజ్! ఏంటో చెప్పండి" "మనం ఎలాగూ ఓ పది పదిహేను రోజుల్లో ఇండియా వదిలి పోవచ్చునని అనిపిస్తోంది నాకు. మా [్రెండు చాలా కాన్ఫిడెంట్‌గా వున్నాడు, మనకి జాబ్ సంపాదించగలనని. అంచేత ఇన్‌ది మీన్‌టైమ్ కేవలం సరదా కోసం ఈ బంగా[్రాజు భార్యని, మరింత ఉడుక్కునేలా చేయ్యాలని వుంది! ఏమంటావ్? "

"వాట్ యాన్ ఇన్[్రెడిబుల్ ఐడియా! కానీ దానివల్ల మనకేమొస్తుంది? అనవసరంగా ఆవిడ్ని మరింత రెచ్చగొట్టడం తప్ప"

"చెప్పేను కదా! ఫర్ ది షీర్ ఫన్ ఇట్ గివ్స్! అల్లరి పెట్టి ఫన్ చూడడమే నా ఆశయం! అయితే, ఏమో? ఏం చెప్పగలం? మనం ప్లాను చేస్తున్నది కేవలం ఫన్ కోసమే అయినా, దానివల్ల అనుకోకుండా మంచి కూడా జరుగుతుందేమో!"

"ఏమో బాబూ! నాకు [్రాక్టికల్ జోక్సంటే చాలా భయం! అవి ఏరకమైన వ్యతిరేక ఫలితాల్ని ఇస్తాయో? సరేగానీ! ఇంతకీ మీ ప్లాను ఏమిటిట? "

"మనం ఒక వారం రోజులు హెక్టిక్‌గా ఎఫర్ట్ చేస్తేనే తప్ప మనం స్టేట్స్‌కి వెళ్లడానికి చేస్తున్న [్రయత్నాలు ఫలించవు! అంచేత ఓ వారం రోజులపాటు నువ్వు బంగా[్రాజుగారి ఆఫీసులో చేరు. నువ్వూ, అతనూ కలిసి కార్లో ఆఫీసుకి వెళుతుంటే..

ఆవిడగారు అట్లపెనం మీద వేసిన మిరపకాయలా వయిలెంట్‌గా రియాక్ట్ అవుతుంటే, చూసి హాయిగా నవ్వుకోవాలని నా ప్లాన్! ఈ నిరుద్యోగం కాదుగానీ కాలాన్ని ఆనందించవలసిన పద్ధతిలో ఆనందించలేకపోతున్నాం. పి.జి. వుడ్‌హౌజ్ సృష్టించిన సన్నివేశంలాంటది ఒకటి రావాలి! అప్పుడొస్తుంది అవకాశం, ఆనందంగా నవ్వుకోడానికి! అందుచేత నువ్వు రేపట్నుండీ అతని ఆఫీసుకి వెళ్లు. దెన్ వియ్ షల్ వాచ్ ది అన్‌ఫోల్డింగ్ డ్రామా!" అన్నాడు బాబూరావు- ఏనాడూ నవ్వని వాడు చిరునవ్వు నవ్వుతూ.

అతని ముఖం మీద ఇప్పుడు కనిపిస్తున్న కొంటె నవ్వు చూచి ఆశ్చర్యపడింది సుందరి. తనకి పూర్తిగా తెలుసు అనుకుంటున్న ఈ మనిషిలో ఒక కొత్త డైమెన్షన్ కనిపించి ఆశ్చర్యాన్ని మరింత చిక్కబడేటట్టు చేసింది. దాంతో బాబూరావుని చూస్తూ అలా వుండిపోయింది కాసేపు. తరువాత "డియర్! ఒక విషయం మిమ్మల్ని అడగనా? " అంది.

ఆమె గొంతులో ధ్వనిస్తున్న సీరియస్‌నెస్ గమనించి, కొద్దిగా గాభరా పడ్డాడు బాబూరావు. సోఫాలో నిటారుగా కూర్చుంటూ- "అడుగు డియర్! నీకు సందేహం ఎందుకూ? మనలో మనకి, ఏనాడూ అడగాలా? అడగకూడదా? అనే ఊహ రాలేదు కదా!"

"అది నిజమేననుకోండీ! సరే, జాగ్రత్తగా వినండి! బంగార్రాజు అందంగా వుంటాడు. చాలా చలాకీగా కూడా వుంటాడు. పరుగులు తీస్తున్న సెలయేరులా నిత్యం గలగలలాడుతూ వుంటాడు. అలాంటి వాడితో నేను చనువుగా కబుర్లుచెప్తూ కూర్చుంటున్నాను కదా! రేపు అతని ఆఫీసులో కూడా జాయినవమంటున్నారు! మీకు మనసులో ఎప్పుడేనా ఏదోలా అనిపించదా? "

ఈ మాటలు విని బాబూరావు తాపీగా సోఫాలో చేరబడి కూర్చున్నాడు. చేరగిలబడి సుందరి వైపు అలా ధ్యానంగా చూస్తూ కాసేపు ఉండిపోయాడు. కొంతసేపైన తర్వాత "అంటే? నాకేమేనా అనుమానం లాటిది కలగడంలేదా? అనా నీ వుద్దేశం? "

సుందరి సమాధానం చెప్పలేదు. కానీ అతని మాటలు విన్నాక, ఆమె పెద్దపెద్ద కళ్ళలో కొద్దిగా నీరు తిరిగినట్లనిపించింది బాబూరావుకి. దాంతో "కమాన్ డార్లింగ్! కంపోజ్ యువర్‌సెల్ఫ్! మనుషుల మీద నమ్మకం, మమత, ఆత్మీయత పెరగడం.. ఇవన్నీ మన సంస్కారానికి ఇండెక్సులు! ఎలా అబ్బిందో నాకు తెలీదుగానీ, మనుషుల్ని నమ్మడమే నాకు తెలుసు. ఎవర్నీ, ఏ రకంగానూ అనుమానించడం నాకు తెలీదు. నా బంగారం ఎన్నటికీ కల్తీ బంగారం కాదని నా నమ్మకం!"

ఓ రెండు నిముషాలు ఆ గదిలో నిశ్శబ్దం! తరువాత సుందరి ఒక ఉప్పెన గాలిలా లేచివెళ్లి బాబూరావుని పెనవేసుకొని ముద్దులతో ముంచెత్తింది.

★ ★ ★

మర్నాడు పొద్దున ఆఫీసు వేళకి కంపెనీ కారొచ్చింది. స్టైలిష్‌గా కారుదగ్గర నిలబడి వెయిట్ చేస్తున్నాడు బంగార్రాజు. భర్తకి గుడ్ విషెస్ చెప్పడానికి బయటికి

## కొత్తగాలి...

**కాంతల కష్టాలకి**
**కారణాలు రెండే రెండు**
**కల్యాణం కావడం..**
**కాకుండడం**

– కుంటముక్కల సత్యవాణి,
కాకినాడ

వచ్చింది భాగ్యలక్ష్మి. ఆవిడకిప్పుడు కొంచెం గర్వంగా వుంది. కేవలం వంటకీ, సుందరితో హస్కుకీ, వీలుదొరికితే నెట్‌లో అశ్లీల చిత్రాల వీక్షణకీ మాత్రమే పరిమిత మైపోతున్నాడే తన భర్త అని బెంగపడిపో తున్న ఆవిడకి, తన మొగుడిప్పుడు ఏకంగా ఓ ఐటీ కంపెనీలో టీమ్ లీడర్! అందుకే ఆవిడకి గర్వంగా అనిపిస్తోంది. 'ఉద్యోగం సద్యోగం లేని మొగుడే కదా! అని ఇంతకాలం తను సరిగ్గా దృష్టిపెట్టి చూడలేదు గానీ, ఇప్పుడు చూస్తుంటే అబ్బ! ఆ రేమండ్ సూటులో అదిరిపో యేంత స్మార్ట్‌గా కనిపిస్తున్నాడే! జుట్టు ఏం స్టైలిష్‌గా దువ్వేడు! ఒకసారి దగ్గరి కెళ్ళి ఆ జుట్టు నిమిరితే బాగుండుననిపి స్తోంది. రానీ! రానీ! సాయంత్రం యింటి కొచ్చాక ఓ పట్టు--' ఇలా ఆలోచిస్తూ భర్త దగ్గరికి నడుస్తోంది భాగ్యలక్ష్మి.

ఇంతలో "బంగార్రాజుగారూ! యు లుక్ ఫెంటాస్టిక్ ఇన్ దట్ సూట్!" అని కాంప్లి మెంటుకి క్లారినెట్ నొక్కుల్లా ఆర్టిక్యులేట్ చేస్తూ, రంగుల జలపాతంలా మెట్లమీంచి దూక్కుంటూ వస్తున్న సుందరిని చూసి ఒక్క క్షణం చేష్టలుడిగిన వాడిలా నిలబడి పోయాడు బంగార్రాజు.

భాగ్యలక్ష్మి అయితే ఈర్ష్యతో దహిం చుకుపోతున్న ప్రతిమలా నిలబడిపో యింది- సుందరి హొయలు చూసి.

ఒకే ఒక్కక్షణం ముగ్గురూ అప్రతిభుల్లా అలా నిలిచిపోయిన దశ.

మరుక్షణంలో బంగార్రాజు తేరుకొని "నా మాటకేంగానీ, మీరు మాత్రం నిజం గానే ఫెంటాస్టిక్‌గా కనిపిస్తున్నారు మేడమ్! అవునూ! మీరొక్కరే వచ్చారు, బాబూరావుగారేరీ? " అని అడిగేడు.

"తనని ఎక్స్‌క్యూజ్ చెయ్యమని చెప్పమ న్నారు. కేలిఫోర్నియాలో వున్న ఫ్రెండుతో అవశ్యం మాట్లాడవలసిన పనివుందట! అంచేత తను జాయిను కాలేక పోతున్నా నని తన హెల్ప్‌లెస్‌నెస్‌ని తెలియపరచమ న్నారు. 'నువ్వూ వెళ్లకపోతే బంగార్రాజు హర్టవుతారు! మనకెన్ని పనులున్నా ఆయన చూపిస్తున్న అభిమానానికి మన గ్రాటిట్యూడ్ తెలియచేసుకోవడానికి, కనీసం నువ్వేనా వెళ్ళి జాయినవు' అని నన్ను పెర్స్యూడ్ చేసి పంపించేరు" అని చెప్పింది సుందరి, తన సింగ్ సాంగ్ వాయిస్‌తో!

"అలాగా! సర్లెండి! అతనికి అర్జంటు ఎంగేజిమెంట్ ఉన్నప్పుడు మనమేం చెయ్యగలం! హి నోస్ బెస్ట్ వాట్ ఈజ్ గుడ్ ఫర్ హిమ్. సరే! మనం బయల్దేర దామా? " అంటూ, ఎన్నాళ్లుగానో అల వాటు వున్నట్టు అనిపించే స్టైలిష్ బేరిం గ్‌తో కార్లో కూర్చున్నాడు. డ్రైవర్ రెండోపక్క డోర్ తెరిచి పట్టుకొంటే, సుందరి సీతాకోకచిలకంత తేలిగ్గా, బంగా రుబొమ్మ కారెక్కుతున్నంత వొయ్యారంగా కారెక్కి, బంగార్రాజు పక్కనే కూర్చుంది.

పోర్టికోలో పాసివ్‌గా నిలబడి ఈ తతం గాన్నంతా ఎక్స్‌ట్రీమ్ జెలసీతో వాచ్ చేస్తున్న భాగ్యలక్ష్మి, భగ్గున మండిపోయి తను బూడిదైపోతే బాగుండ్ననే ఫీలింగుకు వచ్చింది.

"బై..! భాగ్యం!" అని బంగార్రాజు కార్లోంచి ఊపిన చెయ్యి, తనని అపహాస్యం చెయ్యడానికి వూపిన చెయ్యి అని భావించి మరింత ఉడికి పోయింది భాగ్యలక్ష్మి. ఈర్ష్య, ద్వేషం, కసి లాంటి భావాలు పూర్తిగా ఆమెని ఆవరించుకొని వున్నా యేమో! ఏదో ట్రాన్స్‌లో వున్నట్లుగా నడుస్తూ ఇంట్లోకి వెళ్ళి ఏడు వీధులకి విన బడేటట్టు భళ్లున తలుపు మూసి మంచం మీద బోర్లా పడింది. ఆమె కళ్ళల్లో ఇప్పుడు చుక్కనీరు కూడా లేదు. అగ్నిధా రలు మాత్రం వర్షిస్తున్నాయి ఆ కళ్లు. ప్రపంచంలో ఈర్ష్య, ద్వేషం తప్ప ఇంకేమీ వున్నట్టు అనిపించడం లేదు భాగ్యలక్ష్మికి.

అయితే ఇంతటి ద్వేషాగ్నిలోనూ తనకో ఆఫీసు వుందనీ, అక్కడ ఇవాళ చెయ్యవలసిన అర్జంటు పనులు చాలానే వున్నాయనీ, ఈమధ్య తను అనుభవిస్తున్న మానసిక క్షోభవల్ల బోలెడంత వర్క్ పెండింగులో వుండిపోయిందనీ, ఆ వర్క్ నంతట్నీ ఇవాళ పూర్తిగా క్లియర్ చేసి మరీ వెళ్లమని బాస్ ఆర్డరు వేసేడనీ గుర్తు వచ్చి నిజంగానే పిచ్చెక్కిపోతున్నట్టు ఫీలయింది భాగ్యలక్ష్మి. తనని ముంచెత్తున్న దుఃఖం వరదలోంచి బయటికి వచ్చి ఆదరా బాదరా ఎదోలాగ తయారైపోయి, చల్లారిపోయిన బ్రేక్‌ఫాస్ట్‌ని విషం మింగినట్లు మింగి ఫ్లాటుకి తాళంవేసి ఆఫీసుకి పరుగెత్తింది.

ఆఫీసుకి వచ్చిందన్నమాటేగానీ, ఏ పనీ చెయ్యలేకపోతోంది! కన్ను మూసినా, తెరచినా తన మొగుడూ, సుందరీ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ, సరసాలాడుకుంటున్నట్టే కనిపిస్తోంది, ఊహల్లో!

లంచప్పుడు బాస్ పిలిచేడు భాగ్యలక్ష్మిని. ఆమె పంపించిన పేపర్లని ఆమె ముఖంమీదే ఊపుతూ "ఏమిటి మేడమ్ ఇదంతా? ఎక్కడికి పోయింది మీ స్మార్ట్‌నెస్ అంతా? మీ హబ్బీకి జాబ్ లేకపోవడంతో మీరు మెంటల్‌గా బాగా అప్‌సెట్ అయారని అనుకుందాం అంటే ఆయనకి మన రైవల్ ఫర్మ్‌వాళ్ళు ఏకంగా టీమ్ లీడర్‌గా తీసుకున్నారట కదా! పైగా వాళ్ళకి, అతనేదో చాలా మంచి సాఫ్ట్‌వేర్‌కూడా అమ్మేడట? నౌ యు మస్ట్ బి వర్చువల్లీ రోలింగ్ ఇన్ రిచెస్. కనీసం మీరు ఈ స్టేట్ ఆఫ్ యుఫోరియాలోనైనా రెట్టింపు ఉత్సాహంతో పనిచేస్తారని నేనెంతో ఆశపడుతుంటే, మీరు నన్ను నిలువునా కోల్డ్ వాటర్‌లో ముంచేసేటట్టున్నారు. ఏమిటి మీరు పంపించిన ఈ రిటన్స్? వీటినిగానీ మనం మన కస్టమర్స్‌కి పంపిస్తే, వాళ్ళు వెంటనే మన ఫర్మ్‌తో తెగతెంపులు చేస్కొని వేరే ఫర్మ్‌కి పోతారు. మరేం అనుకోకండి! ఏమిటయింది మీకు? ఎంతో యాక్టివ్‌గా పనిచేసేవారే! ఇలా అయితే చాలా కష్టం మేడమ్!" అన్నాడు నిష్ఠూరంగా.

'ఇలా అయితే కష్టం' అన్న మాటకి అర్థం.. ఇలా అయితే నిన్ను ఉద్యోగం లోంచి పీకేయవలసి వుంటుంది అని సూచించడమే.

భాగ్యలక్ష్మికి చెప్పలేనంత ఉడుకుమోత్తనం వచ్చేస్తోంది. సడన్‌గా వచ్చిన ఉద్రేకాన్ని ఆపుచేసుకోలేక "సార్! ఎందుకో బాగా అప్‌సెట్ అయిపోతున్నాను కొద్దిరోజుల్నుంచీ. మళ్లీ రికవర్ అయి నా ఒరిజనల్ స్టేట్ ఆఫ్ మూడ్‌కి రావడానికి ఓ వారం రోజులు పట్టొచ్చు. అంచేత నాకు ఒన్ వీక్ సెలవు ఇవ్వండి. ఆ సరికి కూడా నేను నా నార్మల్‌స్థితికి రాలేకపోతే మరింక ఆఫీసుకి రాను. నా రిజిగ్నేషన్ లెటర్ పంపుతాను. అంచేత మీరు ఏ రకంగా డిసైడ్ చేస్తారో నాకు ఆఫీసుక్లోజయేలోగా దయచేసి తెలియపరచండి!" అనేసి తన క్యాబికల్‌లోకి వెళ్లిపోయింది.

బాస్ చాలా నిదానమైన మనిషి. భాగ్యలక్ష్మి చాలా పనిమంతురాలని తెలుసు. ఎ నోన్ డెవిల్ ఈజ్ బెటర్ దేన్ ఏన్ అన్‌నోన్ ఏంజిల్! అన్న సంగతి కూడా అతనికి తెలుసు. ఈమెని పంపించేసి కొత్తవాళ్లని తెచ్చుకుంటే కొరివితో తలగోక్కున్నట్టే. వాళ్లు పుర్తిగా వర్క్‌లోకి ఇనిషియేట్ అయేదాకా, చచ్చేంత తలనొప్పి!

తన నిర్ణయాన్ని వెంటనే తేల్చి చెప్పేయకుండా స్ట్రేటజిక్‌గా నిశ్శబ్దాన్ని పాటించేడు బాస్.

భాగ్యలక్ష్మి తన సీటులో కూర్చున్నదన్న మాటేగానీ, ఇప్పుడు మరో కొత్త యాంగ్జైటీతో సతమతమవుతోంది. సెలవు యిస్తాడా? ఇంటికి దయచెయ్యమంటాడా? పొమ్మన్నాడంటే తన స్టేటస్

ఘోరంగా తయారవుతుంది ఆ సుందరి ముందు. దాని పొగరణచడానికి, తన దగ్గ రింక ఏ ఆయుధమూ వుండదు- ఏడుస్తూ కూర్చోవడం తప్పిస్తే. ఇప్పుడీ వుద్యోగం వూడిపోతే, ఇంకేమన్నా వుందా? తన మొగుడ్ని ఆ రాక్షసి పూర్తిగా తన చెమ్చాగా మార్చేసుకోదూ?

★ ★ ★

గడియారం అయిదు చూపిస్తోంది. ఆఫీసులో పనిచేస్తున్న వాళ్ళంతా మెల్లమెల్లగా లేచి తట్టాబుట్టా సర్దుకుంటున్నారు ఇంటికి వెళ్లాలనే ప్రయత్నంలో. నిస్త్రాణగా లేచి బేగ్ అందుకొని 'ఇక నేనూ బయల్దేర తాను..' అనుకుంటోంది భాగ్యలక్ష్మి.

ఇంతలోనే ఎటెండర్ వచ్చి "మేడమ్! సార్ రమ్మంటున్నారు" అని చెప్పేడు.

కొట్టుకుంటున్న గుండెలతో భాగ్యలక్ష్మి బాస్ ఛాంబర్ వైపు నడుస్తోంది. 'ఇక మీరు ఇంటికి వెళ్లి హాయిగా రెస్ట్ తీసుకోండి' అని చెప్పడానికే బాస్ అందరూ వెళ్లిపోయిందాకా ఆగేడని మనసులో నిశ్చయించేసుకుంది.

"వెల్! మేడమ్! మీ సర్వీసెస్‌ని వదులుకోడం నాకిష్టంలేదు. అందుకని మీరు కోరినట్లు మీకు ఒన్ వీక్ లీవ్ గ్రాంట్ చేస్తున్నాను. హోప్ యు విల్ బి బేక్ టు నార్మల్- సూన్!" అన్నాడు. 'వారం రోజుల్లో తనని తాను మెండ్ చేస్కోలేక పోతే, ఇక అంతే సంగతులు! మరి ఆఫీసుకి రానక్కర్లేదు! అబ్బ! వాట్ ఎ రిలీఫ్! సో నాట్ ఎవ్రీథింగ్ ఈజ్ లాస్ట్! అల్టిమేటమ్‌ని డెలివర్ చేస్తే చెయ్యనీ! మెండ్ ఆర్ ఎండ్ అని కదా- చెప్పేడు. చూద్దాం వాట్ దిస్ వీక్ హోల్డ్స్ ఇన్ స్టోర్' ఇలా

మనసులో అనుకుంటూ ఇంటికి చేరుకుంది భాగ్యలక్ష్మి.

ఇంటికి వచ్చేసరికి వాట్ ఎ సర్‌ప్రైజ్! బంగార్రాజు బాసు కదా? అప్పుడే ఇంటికెలా వచ్చేశాడు? వచ్చేయడమే కాదు, ఏవేవో మంచి మంచి కుకీస్ ప్లేట్లలో చాలా ఆర్టిస్టిక్‌గా అమర్చి, తనకోసం ఎదురుచూస్తూ కుర్చున్నాడు టేబిల్ దగ్గర. వాటన్నిట్నీ చూడగానే భాగ్యలక్ష్మికి ఇదీ అని వర్ణించడానికి వీల్లేనంత పెద్ద రిలీఫ్ వచ్చేసింది. 'అమ్మయ్య! సర్టన్లీ గుడ్ ఓల్డ్ టైమ్స్ హేవ్ కమ్ బాక్! ఏవేవో వూహించుకొని బాధపడిపోతున్నానుగానీ, నా మొగుడు నా మొగుడే! ఈమధ్యని ఉద్యోగం సద్యోగం లేనప్పుడు, ఎలా చక్కగా వేళకింత టిఫినుచేసి, టేబుల్ మీద అమర్చి తనకోసం ఎంచక్కా వెయిట్ చేస్తుండేవాడో! ఎందుకనో ఆ టైము మళ్లీ వచ్చేసినట్లనిపిస్తోంది. భర్త తన కోసం ఇలా వెయిట్ చేస్తూ కూర్చోడం ఎంతటి హాయిని కలిగించే సన్నివేశం! ఇలాటి అకేషన్ దొరకడం ఎంత అరుదైన సన్నివేశం! అంచేత ఇక యిప్పుడు ఏ రకమైన అనవసరపు శంకలూ పెట్టుకొని ఆనందాన్ని పాడుచేసుకోకూడదు!' అని నిశ్చయించుకుంది భాగ్యలక్ష్మి.

అలా నిర్ణయించుకొని "ఒక్క నిమిషం డియర్!" అని వసంతకోకిలలా- పలికి బాత్రూములోకి దూరిపోయింది. అయిదు నిముషాల్లో మంచుతో స్నానం చేసిన మల్లెపువ్వులా తయారై భోజనం టేబుల్ దగ్గర కూర్చొని గులాబ్‌జామ్ టబ్‌ని ముందుకి లాక్కుంది. బాత్ టబ్ షేపులో క్రిస్టల్ గ్లాసుతో తయారైన ఆ చిన్న టబ్బులో- షుగర్ జ్యూస్‌లో తేలుతున్న గులాబ్‌జాములు- పంచదార పాకంలో జలకాలాడుతున్న చిన్నసైజు దేవకన్యల్లా వున్నాయి. దగ్గరికి తీసుకొని రుచి చూడమని ఆహ్వానిస్తూ, సిరప్పంతా ఏలకుల ఘుమఘుమ, ఎసెన్స్ అరోమాతో కలసి టేస్ట్ బడ్స్‌ని టికిల్ చేసి వదిలిపెడుతోంది. గులాబ్‌జామ్‌ని సుతారంగా తింటూ, మధ్యమధ్యన జీడిపప్పు పకోడి, మైసూర్‌పాక్ కూడా రుచి చూస్తూ, ఆఖర్న ఇస్‌క్రీమ్ లాగించి, బ్రేవ్‌మని తేన్చి, "ఇప్పుడు చెప్పండి! అకేషనేమిటి? ఇంతటి భారీ సెలబ్రేషన్‌కి!" అని అడిగింది, కుర్చీలో వెనక్కి చేరబడి రిలేక్స్ అవుతూ.

"ఒకటని చెప్పమంటావా? లేక రెండని చెప్పమంటావా? బోలెడు అకేషన్లు వచ్చాయి సెలబ్రేషన్‌కి. ఇది మా మేనేజిమెంటు వాళ్లు ఇచ్చిన పార్టీ. నేను వాళ్లకి అమ్మిన సాఫ్ట్‌వేర్ బాగా క్లిక్ అయ్యేటట్టు వుందని మార్కెట్ సర్వేలు సూచనలు పంపిస్తున్నాయట! ఆ సాఫ్ట్‌వేర్‌ని తయారు చేసిన వ్యక్తి స్వయంగా ఇప్పుడు మా టీమ్ లీడర్ అని అప్పుడే డబ్బా వాయించడం ప్రారంభించేసేరు మార్కెట్లో. దానికి తోడు ఇవాళ సుందరి చేరింది కంపెనీ టీమ్‌లో. మొదటి రెండు గంటల్లోనే ఆవిడ ఎంత యాక్టివ్‌గా పనిచెయ్యగలదో, ఎంత వర్చువల్‌గా తనని తాను కండక్ట్ చేసుకోగలదో, ఆవిడ్ని ఎలా పెద్ద ఎస్సెట్‌గా తయారు చేస్కోడానికి అవకాశం వుందో బాస్ అంచనా వేసేసుకున్నాడు. దాంతో హి డిసైడెడ్ టు త్రో ఎ గ్రాండ్ పార్టీ అండ్ సెలబ్రేట్ ది ఈవెంట్‌ఫుల్ డే!

## కొత్తగాలి...

**ఫొటోల కోసం**
**'స్వచ్ఛభారత్' అంటూ**
**చీపురు పట్టక!**
**అది కూడా అవినీతే!**

– జి. విజయశ్రీ,
అరసవల్లి

అదీ కథ. 'మిసెస్ బంగ్రాజుగారు ఎటెండ్ అవలేకపోతున్నారు. షార్ట్ నోటీస్‌లో వారిని ఇన్వైట్ చెయ్యలేకపోతున్నాం మన సెలబ్రేషన్‌లో జాయినవమని. అంచేత వారికి మా క్షమార్పణల్ని కన్వే చేస్తూ, ఈ పాక్ వారికి అందచెయ్యండి' అని కార్లో పెట్టించారు. ఏతావాతా ఈ సందడివల్ల మధ్యాహ్నం సెషన్‌ని కట్ చేశారు. అందుకనే వేగిరంగా ఇంటికి వచ్చేశాం. సుందరికి కూడా ఒక పాక్ ఇచ్చేరు, బాబూరావుకు అందచెయ్యమని కోరుతూ. ఈసరికి ఆవిడ బాబూరావుకి వాటన్నిట్నీ తినిపించేసే వుంటుంది.

కానీ భాగ్యం! ఏఁవిటి ఆవిడ డ్రైవూ! ఆవిడ వర్క్ స్టైల్! ఆడుతూ, పాడుతూ అందర్నీ ఇన్‌స్పైర్ చేస్తూ పనిచేసుకుంటూ పోయే నాబోటిగాడు కూడా ముక్కుమీద వేలువేసుకోవలసి వచ్చిందంటే నమ్ము! సుందరి వర్క్ స్టైల్ చూసి.."

బంగ్రాజుని పూర్తి చెయ్యనివ్వలేదు భాగ్యలక్ష్మి. చివాలున కుర్చీలోంచి లేచిపోయి చేతిలో పట్టుకున్న స్టీలుగ్లాసుని దభేలున టేబుల్ మీద కొట్టి చరచర బెడ్ రూములోకి వెళ్లిపోయి చప్పుడు చేస్తూ తలుపులు వేసేసుకుంది.

బంగ్రాజు బాగా హర్ట్ అయ్యేడు. సుందరి పేరు వినిపిస్తే చాలు, భగభగ మండిపోతోందేఁవిటి ఈ భాగ్యం? సుందరిలాటి మంచి మనిషిని చూసి ఎవరేనా ఈర్ష్య పడతారంటే అది నమ్మలేని విషయంలా కనిపిస్తోంది బంగ్రాజుకి. అఫ్‌కోర్స్! భాగ్యలక్ష్మి కంటే సుందరి చాలా అందంగానూ, చలాకీగానూ వుంటుందన్నది ఒప్పుకోవలసిన వాస్తవం. బహుశా అది కూడా ఈవిడికి సుందరి మీదున్న ద్వేషానికి ఒక కారణమై వుంటుంది. 'ఛా! సంతోషంగా గడుస్తుందనుకున్న ఈవినింగ్ పాడయిపోయింది' అని విలవిలలాడేడు బంగ్రాజు.

ఆ మర్నాడు, ఆ మర్నాడూ కూడా సుందరి, బంగ్రాజులు నవ్వుకుంటూ ఇంచుమించు చెట్టాపట్టాలు వేసుకొని కారు దాకా నడిచివెళ్లి, కార్లో పక్కపక్కనే కూర్చొని కబుర్లాడుకుంటూ ఆఫీసుకి వెళుతుండడం చూసి అగ్నిగుండంలా భగభగా మండిపోయింది భాగ్యలక్ష్మి. ఆఫీసు బాసు తనకి వారంరోజులు టైమిచ్చేడు మూడీ బిహేవియర్‌ని మెండ్‌చేసుకోమని. లేకపోతే తీసేయడం తప్పదు. తన మొగుడితో ఈ సుందరి భాగోతం చూస్తుంటే బాగా శ్రుతిమించి రాగాన పడిపోయినట్టు కనిపిస్తోంది. అవును! నిశ్చయంగా శ్రుతిమించింది. అందుకే, తనకి మిగిలింది అనుక్షణం ఏడుపురాగం! దానికి నవ్వుల రాగం! ఈ రాగాలకి ఎలాగో ఓలాగ తక్షణం ఫుల్‌స్టాప్ పెట్టాలి. అలా పెట్టకపోతే తన జీవితానికే ఓ పెద్ద ఫుల్‌స్టాప్ తప్పదు. అంచేత, ఇక ఎంతమాత్రం ఆలస్యం చెయ్యకుండా తను కార్యరంగంలోకి దిగాలి. ఇలా ఆలోచిస్తూ కేజువల్‌గా వాచీ చూస్కొంది.

ఆఫీసులకి వెళ్లవలసిన వాళ్లంతా వెళ్లిపోయివుంటారు. ఇంటిపట్టునే వుండే వాళ్లంతా అన్నాలు తినేసి, ఆయాసపడుతూ కుర్చీల్లో కూలబడి జోగుతూ వుంటారు. ఇదీ సరైనవేళ! అని నిశ్చయించుకొని, తన ఫ్లాట్‌కి తాళంపెట్టి నింపాదిగా మెట్లెక్కి వెళ్లి, సుందరిగారి ఫ్లాటు తలుపు తట్టింది భాగ్యలక్ష్మి. ఆ తలుపు తట్టవలసి వచ్చినందుకు ఆమె పడిన నరక యాతన అంతా.. ఇంతా కాదు. ఆ మెట్లని ఎక్కిన తన కాళ్లని నరుక్కోవాలని, ఆ తలుపులు తడుతున్న చేతుల్ని ఖండించేసుకోవాలని ఉద్రేకపడింది- మనసులో. అయితే సుందరి కోసం కాదు కదా! తను ఈ మెట్లు ఎక్కుతున్నదీ, ఆ తలుపు తడుతున్నదీని! దానికీ, దాని చేతకాని మొగుడికీ మరిచిపోలేని గుణపాఠాలు నేర్పాలని



కదూ! తను ఇవాళ ఈ మెట్లు ఎక్కుతున్నది?

అందుకని కోపాన్ని తగ్గించుకోగలిగిన మేరకు తగ్గించుకొని, సంధించ తలపెట్టిన మారణాయుధాల్లాంటి మాటల్ని మనసులోనే మరోమారు పదును పెట్టుకుంటూ సుందరిగారి ఫ్లాటు తలుపు తట్టింది భాగ్యలక్ష్మి.

ఓ నిముషం నిశ్శబ్దం! తరువాత బాబూరావు తలుపు తెరిచేడు- ఎంతో నిండుగా నవ్వుతూ! భాగ్యలక్ష్మి ఒక్క నిముషం ఖంగుతింది, ఈ ఊహించని డెవలెప్‌మెంట్‌కి. అతగాడు ముటముటలాడుతూ, ముంగిలా మూతి ముడుచుకొని కనిపిస్తే- తన టాస్క్ ఈజీ అయిపోతుందని ఆశపడుతూ వచ్చింది భాగ్యలక్ష్మి. అనవలసిన నాలుగుమాటలూ గుమ్మం దగ్గరే నిలబడి అనేసి, దులపవలసిన నాలుగూ దులిపేసి, చక్కా వెనక్కి వచ్చేయాలని ప్లాన్ చేసుకొని వచ్చిన భాగ్యలక్ష్మికి బాబూరావు కనపరుస్తున్న సౌహార్ద్రత చూసి కంగుతినక తప్పలేదు. తను తయారు చేసుకొని వచ్చిన స్క్రిప్ట్‌ని రీరైట్ చేసుకోవాల్సి వచ్చేటట్టున్నదని గాబరా పడింది.

"రండి! వచ్చి ఇలా కూర్చోండి! రాక రాక మా యింటికి వచ్చిన అతిథులు మీరు! మీకు కనీసం ఓ కప్పు కాఫీయేనా ఇచ్చి ఆదరించడం కూడా చేతకానివాడ్ని. నాకు ఏ వంటపనీ రాదు. కాఫీ, టిఫినూ తయారుచెయ్యడం అసలు రాదు. అన్నీ సుందరే చూసుకుంటుంది. ఆప్యాయంగా చూసుకునే అమ్మలు అరడజను మంది వున్నా, వారి అందరి ఆప్యాయతల మొత్తం కూడా సుందరి ప్రేమాభిమానాలకు సరితూగవు. అయినా వుండండి! నా సంగతి తెలిసే అల్మారాలో బిస్కెట్ల పాకెట్‌లు, ఫ్రిజ్‌లో ఏదేనా జ్యూస్‌బాటిలు వుంచుతుంది సుందరి. 'ఎవరేనా ఇంటికి వస్తే నేను లేనని ఎలీబీ చూపించి మంచి నీళ్లయినా ఇవ్వకుండా తోలీకుమీ! బిస్కెట్లుపెట్టి ఈ డ్రింకు ఇవ్వు' అని జాగ్రత్తలు చెపుతూ వుంటుంది- బయటికి వెళ్లినప్పుడల్లా!



అందర్నీ ఆదరంగా పలకరించి నాలుగు మంచి మాటలు చెప్పే మహత్తరమైన మంచిగుణం సుందరికి ఎలా అబ్బిందో తలచుకుంటుంటే ఆశ్చర్యం వెయ్యక మానదు. ఏది యేం కానివ్వండి, సుందరి నా భార్య కావడం నేను చేసుకున్న మహా అదృష్టం అని అనుకుంటూ వుంటాను. అవునూ, మీకేమీ ఇవ్వకుండా నేనే మాట్లా డుతూ కాలక్షేపం చేసేస్తున్నానేమిటి? ఉండండి! బిస్కెట్లు తెస్తాను" అని వెనక్కి తిరగబోయాడు భారీకాయం బాబూరావు.

"బిస్కెట్ల మాట అలా వుంచండిగానీ! మిమ్మల్ని ఓ మాట అడగాలని వచ్చేను"

"తప్పకుండా అడగండి నాతో మాట్లాడే వాళ్లే తక్కువ. నాకు మాటకారితనం లేదు, మీకు తెలుసనుకుంటాను"

"అయినా రెండు బిస్కెట్లు నవులుతూ, మీరు అడగాలనుకున్న రెండు మాటలూ అడిగితే బావుంటుందని నా వుద్దేశం. ఉండండి!' అని బాబూరావు బిస్కెట్లు తేవ డానికి లోనికి వెళ్లేడు.

భాగ్యలక్ష్మి అంతర్మథనంలో పడింది. 'మనిషి లావుగా రుబ్బుడు పొత్రంలాగ వుంటే వుండుగాక! కానీ బాగా అవగాహన వున్న మనిషిలా కనిపిస్తున్నాడు. ఎంత చక్కగా, మితంగా నవ్వేడు నవ్వుని. అత

గాడి మాట తీరేంవిటి? అంత మెత్తగా, సున్నితంగా, మృదువుగా వుంది! అవునూ! ఇంత మంచి మర్యాదస్తుడ్లాటి మొగుడ్ని పెట్టుకొని నా మొగుడిమీద పడిందేమిటి చెప్మా, ఇంతటి గొప్పమనిషిని పక్కకి తోసేసి? వంటలు వండుకొనీ- బూతుబొమ్మలు చూస్తూ కూర్చొనీ- కొంచెం ఎర్రతోలున్న ఆడది కనిపిస్తే చాలు- చొంగలు కార్చుకొనే నా మొగుడి మీదికి మళ్లిందేమిటి చెప్మా దీని దృష్టి? చెప్తాను దీని పని..' అని స్వగతించుకుంటున్న భాగ్యలక్ష్మిని చూస్తూ "ఏదో టెన్షన్‌లో ఉన్నట్టున్నారు, ఏదేనా జరిగిందేమిటి మేడమ్? అసలే ఉద్యోగాలు పోతున్న సీజను! కొంపతీసి అలాంటి అన్‌టువర్డ్ ఇన్సిడెంట్ ఏదేనా జరగలేదు కదా? " అని అడిగేడు బాబూరావు ట్రేలో బిస్కెట్లు, గ్లాస్సులో మ్యాంగో మూడ్ పట్టుకొనివస్తూ.

ఆ మాట వినగానే ఎందుకో పౌరుషం ముంచుకొచ్చేసింది భాగ్యలక్ష్మికి. దాంతో బుస్సున లేచి "అవునండీ- నా వుద్యోగం పోయేటట్టే వుంది- అటు ఆఫీసులోని- ఇటు ఇంట్లోని కూడా. అవునూ మీ సుందరిగారికి నా మొగుడి మీద కళ్లు పడ్డాయేమిటి? ఆవిడ చలవవల్ల ఇంట్లో మొగుడ్ని పోగొట్టుకుంటూ వుంటే- మనశ్శాంతిపోయి తిన్నగా ఆఫీసులో పనిచెయ్యలేకపోవడం వల్ల ఉద్యోగం పోగొట్టుకునే స్థితికి వచ్చేను. బహుశ మీ భార్యని మీరు అదుపు చెయ్యలేని అశక్తులేమో! కాకుంటే- ఆవిడ మరీ బరితెగించిన మనిషిలా ప్రవర్తిస్తుంటే..."

బాబూరావు ఆవిడ్ని చేత్తో వారిస్తూ "ఆగండాగండి! భాగ్యలక్ష్మిగారూ! మీరు అనవసరంగా బాగా తొందర పడుతున్నారనిపిస్తోంది"

"నేను తొందర పడుతున్నానా? ఆమె దూకుడు చూస్తూ కూడా- నేను తొందరపడుతున్నానని మీరంటే- మీరు జరుగుతున్న తతంగాన్ని గమనించడం లేదనయినా అనుకోవాలి లేదంటే- తతంగాన్ని చూసి కూడా చూడనట్టు నటిస్తున్నారనైనా అనుకోవాలి"

"ఇదిగో చూడండి! నేను ఆల్రెడీ మిమ్మల్ని రిక్వెస్ట్‌చేశాను! తొందరపడి ఏ మాటా అనడంగానీ ఏ నిర్ణయాలూ తీసుకోడంగానీ చెయ్యకండి అని. కాస్త నిదానించి వినండి నేను చెప్పేది. నేను పెద్దగా మాట్లాడే అలవాటు వున్నవాడ్ని కాను. మాటకారిని అసలే కాను. అంచేత- నేను చెప్పాలనుకున్నది కొంచెం తాపీగా చెప్తాను. అందుకనే ప్రశాంతంగా కూర్చొని వినండి అని రిక్వెస్ట్ చేస్తున్నాను.. ఒక్క నిముషం.." అని లేచి బాబూరావు బెడ్ రూములోకి వెళ్లేడు.

భాగ్యలక్ష్మి నిజంగానే ఆశ్చర్యపోయింది! తను బాగా కఠినంగా, ఇబ్బంది కలిగించేంత ఘాటుగా మాట్లాడినా, ఇతగాడేమిటి నిమ్మకి నీరెత్తినట్టు కనిపిస్తూ కనీసం చలించనేనా చలించకుండా వున్నాడని? ఒక క్షణంపాటు బాబూరావంటే ఎడ్మిరేషన్ కూడా కలిగింది. ఏది జరిగినా- చలించని మేరుపర్వతంలాంటి వ్యక్తి అని- బహుశా బాబూరావులాంటి మనుషుల గురించే అని వుంటారు. ఆకృతి మాట సరే- మేరుపర్వతం లాగే కనిపిస్తున్నాడు ఎంత నిదానంగా, సున్నితంగా మాట్లాడు

## కొత్తగాలి...

**బృందావనం**
**బాలకృష్ణమయం**
**మైత్రీవనం**
**ప్రేమికులకభయం!**

**– యం. సీత,**
భద్రాచలం

తున్నాడూ! తనింత పరుషంగా మాట్లాడి నందుకు మరొకరూ మరొకరూ అయితే 'యు గెటౌట్ ఫ్రమ్ హియర్' అనో, అలాటిదే మరొకటో అని తనని బయటికి నడవమని అరిచి మరీ చెప్పి వుండరూ? ఒక్కక్షణం ఇవన్నీ మనసులోకి వచ్చి భాగ్యలక్ష్మి ఎందుకనో తను తప్పుగా మాట్లాడేనా అనే ఆలోచనలో పడింది.

ఓ అయిదు నిమిషాల తర్వాత బాబూరావు తిరిగి వచ్చేడు. మనిషి బాగా బాధ పడిన వాడిలా కనిపించేడు.. ముఖ కవళి కల్ని బట్టి ఎంతో ఉద్వేగాన్ని అణచి పెట్టుకుంటున్న మనిషిలా కనిపించేడు.

అలాటి అతని ముఖం చూసి 'కఠినాతి కఠినంగా మాట్లాడి తను చాలా తప్పుచేశానేమో!' అనుకుంది భాగ్యలక్ష్మి. సిగ్గు, పశ్చాత్తాపం లాంటి భావాలు కలిగి తల దించుకుంది. ఆమె కళ్లల్లోంచి చిన్నగా ఒకటి రెండు కన్నీటిబొట్లు తుడుచుకుంది.

కానీ బాబూరావు కనిపెట్టేశాడు. కనిపెట్టేసి "చూశారా! మనం ఎవర్నో హర్ట్ చెయ్యగలిగేం అని అనుకుంటుంటాం గానీ, నిజానికి మనమే హర్ట్ అవుతాం. మీరన్న మాటలకి నేను కోపం తెచ్చుకోలేదు. కానీ బాగా హర్ట్ అయ్యేను- మీరు సుందరి మీద వేసిన నిందలు విని. నేను చాతకానివాడినని అన్నారని నేను బాధపడలేదు. నన్ను అర్థం చేసుకోలేకపోయారే అనే నా బాధల్లా! మీరనుకుంటున్నట్లు సుందరి అదుపూ ఆజ్ఞా లేకుండా విచ్చలవిడిగా తిరిగేరకం కాదు. తన సరిహద్దు రేఖలేమిటో సుందరికి తెలిసినట్టు మరెవరికీ తెలీదు. అది నేను నిశ్చయంగా చెప్పగలను. చిరుగాలి అందర్నీ తాకుతోందని మనం దానిని శంకించగలమా చెప్పండి? అలాగే సుందరీను. ఆవిడొక వసంతహేల. ఎవర్నీ నొప్పించకుండా అందరితోనీ స్నేహంగా ఉండే మనస్థితి సుందరిది. నాలాటి అనారోగ్యకర టెంపర్‌మెంట్ ఉన్నవాడిని కూడా గుడ్ హ్యూమర్‌లో ఉంచగలిగే గొప్ప మనఃస్థితి ఆమెది.

పోతే, నా మనఃస్థితి గురించి ఒక మాట. నాకు మనుషుల్ని విశ్వసించడమే తప్ప, అనుమానించడం తెలీదు. సుందరి నా నమ్మకాన్ని ఏనాడూ భగ్నం చెయ్యదని నాకు తెలుసు. సుందరి, బంగార్రాజుగారితో బాగా చనువుగా ఉంటోందని మీరన్నారు. అవును, చాలా చనువుగా, కలుపుగోలుగా ఉంటోందని నాకూ తెలుసు. అయితే ఒక్క బంగార్రాజుగారితోనే అలా ఉంటోందని మీరు అనుకుంటుంటే అది పొరబాటు. నిజానికి కొత్త ఉద్యోగంలో చేరి రెండ్రోజులే కదా అయింది- ఆఫీసులో బాసుతో సహా అందరూ ఆమె ఉత్సాహ ఉల్లాసాన్ని చూసి ముచ్చటపడిపోతున్నారని బంగార్రాజుగారే మహా సంతోషపడిపోతూ చెప్పేరు. తను రాంగ్ క్యాండిడేట్‌ని స్పాన్సర్ చెయ్యలేదని గ్రహించి చాలా సంతోషపడుతున్నారు బంగార్రాజుగారు. ఆఫీసు బాసు కూడా బంగార్రాజుగారి ఛాయిస్ ఎక్సెప్షనల్లీ గుడ్ అని మెచ్చుకున్నాడట!

ఇంతకీ నే చెప్పేదేమిటంటే, సుందరి అందరితోనూ అలాగే ఉంటుంది. మీరు మరీ రిజర్వ్‌డ్‌గా ఉండే టైపు అని నేను అనుకుంటున్నాను. మీరు గీసుకున్న గళ్లలోనే ఉండిపోతున్నారు మీరు. నేను మనుషుల్ని నమ్ముతాను. సుందరి నా నమ్మకాన్ని ఎన్నటికీ వమ్ముచెయ్యదు. అదే జరిగిన్నాడు నేనుండను"

ఈ మాటలనేసి కిటికీ దగ్గరకి వెళ్లి బయటికి చూస్తూ నిలబడ్డాడు బాబూరావు.

బయట ఆకాశంలో వెలుతురు, చీకట్లని మార్చి మార్చి చూపిస్తున్నాయి మబ్బులు.

భాగ్యలక్ష్మి మెల్లగా లేచి భారంగా అడుగులు వేసుకుంటూ బయలుదేరింది. వెళుతూ వెళుతూ బాబూరావు దగ్గరకి

అడుగుల సవ్వడి కూడా వినిపించనంత నెమ్మదిగా నడిచి వచ్చి, అతిమెల్లగా "సారీ!" అనేసి, బయటికి వెళ్లిపోయింది.




**సుం**దరి ఆఫీసు నుంచి వస్తూనే బాబూరావుని వాటేసుకొని "కన్నా! చాలా సేపు పన్చెయ్యలేక అలా ఉండిపోయాను ఆఫీసులో! ఎందుకో తెల్సా? నిన్ను ఒక్కడ్నీ ఇంట్లో వదిలేసి ఇలా ఇంతమంది కంపెనీతో ఆఫీసులో కూర్చున్నానే అనే గిల్టీ ఫీలింగు వచ్చేసి చాలా సేపు పనిచెయ్యలేకపోయాను తెలుసా? ఛఛ!! ఏమిటీ లైఫ్? అనిపించింది. ఏ సంతోషాలు దొరికినా, అవన్నీ నువ్వు పక్కన వున్నప్పుడే ఎంజాయ్‌బుల్ థింగ్స్‌లా కనిపిస్తాయని తెలిసిపోయింది. దాంతో ఏదో కోల్పోయాననే ఫీలింగు! ఏదో ఒక స్ట్రీక్ ఆఫ్ సేడ్‌నెస్! రోజుల్లా నన్ను హాంట్ చేస్తూనే వుంది. అదిసరేగానీ! చెప్పు నీకెలా గడిచిందో టైము? బోరుకొట్టిందా? లోన్లీగా ఫీలయివుంటావు అవునా? వద్దులెద్దూ! ఈపాడు ఉద్యోగం! నువ్వు దగ్గర్లేవే అనే కాన్‌స్టంట్ ఫీలింగ్‌తో నాకెందుకూ ఈ ఉద్యోగం! రేపట్నుండీ నేనెక్కడికీ వెళ్లను!" అంది రియల్ ఫీలింగ్‌తో.

"ఛాఛా! నేనెందుకు బోర్‌డమ్ ఫీల్ అవుతానూ? నీకు తెలుసుకదా! నేనంతగా ఎవరితోనీ మాట్లాడడానికి ఇష్టపడనని! అంచేత నేనేదో లోన్లీగా ఫీలయిపోతూ ఉండిపోయానని అనుకోకు!"

కానీ అతని గొంతుకలో తనకి బాగా పరిచయం ఉన్న ఏదో గాఢత వినిపించలేదు సుందరికి. దాంతో అతన్ని గట్టిగా పెనవేసుకొని అతని కళ్లల్లోకి చూస్తూ "ఏదో జరిగినట్టుంది! చెప్పు ఏం జరిగింది? "

"అబ్బే! ఏం జరగలేదే!" అన్నాడు బాబూరావు మామూలుగా.

"అదుగో! నీ గొంతే చెప్తోంది, ఏదో జరిగిందని! అమెరికాలో ఛాన్స్‌లేవీ లేవంటున్నాడా మీ ఫ్రెండు? "

"అబ్బే! వాడలాటిదేమీ అనలేదే! నిజానికి నేనే మెయిల్ ఇచ్చేను కాస్త తొందరగా ఏదేనా చూసిపెట్టు. పని లేకుండా కూర్చోడం కష్టంగా ఉందనీ"

"నువ్వేదో దాస్తున్నావ్! సరే! దాచుకో! మనం ఏనాడూ ఏదీ దాచుకోలేదు మనిద్దరి మధ్యనీ! అని గుర్తుపెట్టుకో" అంది. అతని ఒడిలోంచి లేచిపోతూ.

అతనేమీ అనలేదు. కానీ ఒడిలోంచి లేస్తున్న సుందరి మాత్రం అతనేదో నిట్టూర్పు విడిచినట్టు ఫీలయి- తదేకంగా అతన్ని చూస్తూ నిలబడి "కొంపతీసి నేను లేని టైము చూస్కొని ఆ భాగ్యలక్ష్మిగానీ వచ్చి నీ మనస్సుని చిందరవందర చేసేసే మాటలేమేనా అందా? " అంది, అతని కళ్లలోకి చూస్తూ.

బాబూరావు ఒక క్షణం అప్రతిభుడైపోయాడు. పాదరసం లాంటి సుందరి ఊహాశక్తిని గమనించి. అంతలోనే గభీమని తేరుకొని "ఛా! ఆవిడ మనింటికెందుకొస్తుంది డార్లింగ్! అనవసరంగా టూమచ్ ఆలోచించి మనసు పాడుచేసుకోకు" అన్నాడు.

"సరేలే! ఏదో ఉంది కథ! టీ తెస్తానుండు!" అనేసి వంటింట్లోకి వెళ్లిపోయింది సుందరి.

రాత్రి భోజనాల బల్ల దగ్గర మెల్లగా

పిల్లిని బయటపెట్టేడు బాబూరావు.

"సుందరం డార్లింగ్! మనం సాధ్యమయినంత వేగిరం స్టేట్స్‌కి వెళ్లిపోవాలోయ్! ఎందుకో నాకిక్కడ ఉండాలనిపించడం లేదు. అందుకని మధ్యాహ్నం మూడింటికి మా ఫ్రెండుకి మెయిల్ ఇచ్చేను- త్వరగా ఏదేనా పొజిషన్ చూసి పెట్టమని"

"ఇన్నాళ్లూ లేని తొందర ఇంత సడన్‌గా పుట్టుకొచ్చిందేమిటి డియర్? అందుకే అడుగుతున్నాను, ఏదేనా జరిగిందా? అని"

"సర్లే డార్లింగ్! అంతలా అడుగుతున్నావు కనక చెప్తున్నాను.. మనం ఏదో తన మొగుడ్ని తనకు కాకుండా చేసేస్తున్నామని, ఆ భాగ్యలక్ష్మి ఫీలవుతున్నట్టు అనిపించింది నాకు- ఆవిడ ప్రవర్తనని బట్టి. అలాంటి ఫీలింగు రావటమే తప్పు. సరే, ఏది ఏమయితేనేం గాక వాళ్ల ఫేమిలీలో- అన్‌ప్లజెంట్ సిట్యుయేషన్‌కి మనం కారణమని ఆవిడకో ఇంప్రెషన్ ఏర్పడి పోయింది. ఆ రకమైన ఆలోచనలు ఆవిడకి కలగడం నాకిష్టం ఉండదు. మన వల్ల ఎటువంటి హానీ, ఎవరికీ జరగదని నాకైతే నమ్మకం ఉంది. కానీ మన నమ్మకాలతో వాళ్లకేం పని? తప్పుగా ఆలోచించేవాళ్లు అలాగే ఆలోచిస్తూ ఉంటారు. మనంగా మనకి వాళ్ల అనవసరమైన ఆలోచనలకి ఫుల్‌స్టాప్ పెట్టాలి. అందుకని మనం తొందరగా ఇక్కడ నుంచి వెళ్లిపోతే మంచిది"

సుందరి బుద్ధి చాలా చురుకుగా పనిచేసింది. ఏం జరిగి ఉంటుందో ఊహించగలిగింది. దాంతో ఓ రెండు నిముషాలు బాబూరావు వైపు సాలోచనగా చూసి "అలాగే చేద్దాం! డార్లింగ్! మీ ఫ్రెండుకి ఫోన్ చెయ్యడమో, మెయిల్ పెట్టడమో చెయ్. ప్రస్తుతానికి నీకొక్కడికే జాబ్ దొరికినా ఫర్వాలేదు. పే ప్యాకేజీ కాస్త తక్కువైనా ఫర్వాలేదని చెప్పు. మనం ఇక్కడ్నుండి ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా వెళ్లిపోదాం" అనేసి, టేబుల్ దగ్గర్నుండి లేచిపోయి, చేయి కడుక్కొని బెడ్ రూములోకి వెళ్లిపోయింది. పక్క మీద పడుకొని- ఏనాడూ కంటతడి పెట్టని సుందరి, బయటికి వినపడకుండా వలవలా ఏడ్చింది.

పరిస్థితిని భార్య అర్థం చేసుకున్న వైనం చూసి- 'ఆహా! ఎంత అవగాహన ఉన్న వ్యక్తి' అని కాసేపు ధ్యానంలోకి వెళ్లిపోయి నవాడిలా ఉండిపోయాడు బాబూరావు. తరువాత కాలుస్తున్న సిగరెట్‌ని ట్రేలో పడేసి మెల్లగా బెడ్‌రూములోకి వెళ్లేడు.. ఒకవేళ అప్పటికే సుందరి నిద్రపోతున్నట్లయితే- ఆమెకి నిద్రాభంగం చెయ్యకూడదనుకుంటూ! కానీ ఆమెని చూడగానే గ్రహించేశాడు- ఆమె పడుతున్న బాధని. ఆమె పక్కకి చేరి, ఆమెని తనవైపు తిప్పుకొని, చేతుల్లో పొదువుకుంటూ "నో! డార్లింగ్ నో!! మన మంచితనాన్ని ఇతరులు అర్థం చేసుకోలేకపోతే అది మన తప్పు కాదు కదా!" అని ఆమెని ముద్దులాడి- ఊరడించి నిద్రపుచ్చేడు.

★ ★ ★

వారాంతపు శనివారం- లంచ్ టైములో- అందరూ భోజనాలు చేస్తున్న వేళ- చాలా కేజువల్‌గా చెప్తున్నట్టు సుందరి "మేము నెక్స్ట్ వెడ్నస్‌డే స్టేట్స్‌కి వెళ్లిపోతున్నాం. నాకూ, మా ఆయనకీ న్యూ జెర్సీలో మంచి ఆఫర్లు వచ్చేయి" అనేసి- ఏమీ జరగనట్టు ఉప్మా తినడం కొనసాగించింది.

అయితే ఆమె మాటలు వినగానే లంచ్ తీసుకుంటున్న మిగిలిన వాళ్లందరూ స్టన్ అయిపోయి, లంచ్ చేయడం ఆపేశారు. బంగార్రాజయితే బావురుమని ఏడవలేదు గానీ, కన్నీళ్లని మాత్రం ఆపుకోలేకపోయాడు. పొలమారినట్టు నటిస్తూ సింకు దగ్గరకి వెళ్లిపోయి మూతీ, ముఖం కడుక్కున్నాడు.

అతని లంచ్ అంతా అలా బాక్స్‌లోనే

వుండిపోయింది.

సుందరి వెళ్ళిపోతోందన్న మాట విని బాగా అప్‌సెట్ అయేడు బాస్. ఆమెని తన ఛాంబర్‌కి పిలిచి "ఏమిటి? నేను విన్నది నిజమేనా?" అనడిగేడు. అతని గొంతులో ఆందోళన బయటికి తెలిసిపో తోంది. 'అందర్నీ ఆట పట్టించాలని సర దాకి ఆవిడలా చెప్పింది' అన్న విష్‌ఫుల్ థింకింగ్- అతని మనసులో.

"నిజమే సార్! మా మనస్తత్వాల్ని ఈ దేశం ఏనాడూ గౌరవించలేకపోయింది! మంచితనాన్ని కూడా రాంగ్‌గా అన్వయిం చుకుని మనస్సుని పుండులా చెయ్యగల గడం ఈ దేశం మనుషుల ప్రత్యేకతేమో! ఇక్కడ ఊపిరి సలపనట్టుగా ఫీలవు తున్నాం నేనూ, నా భర్త. అంచేత- ప్రపంచం విశాలమయింది కదా! ఇంకెక్క డేనా గ్రాసం వెతుక్కోవాలని నిశ్చయించు కున్నాం సార్!"

"ఐ యామ్ శాడ్ టు హియర్ వాట్ యు సే, హవెవర్ ఐ బ్రాడ్లీ ఎగ్రీ విత్ వాట్ యు సే- కానీ ఇవన్నీ ఉంటాయి- తప్పదు. నేను మీ ఇరువురికీ ముందే ఆఫర్ యిచ్చేను కదా! మా ఆఫీసులో మీ ఇద్దరూ వుండండి! మిమ్మల్ని ఎంతో గౌర వంగా ట్రీట్ చేసి కాపాడుకుంటాం. మీరు ఏ పేకేజి అడిగినా సరే, దాన్ని కన్సిడర్ చేస్తాను"

"మనీ కాదు సార్- మమ్మల్ని బాధి స్తున్న విషయం. మీ దయవల్ల- మాకు మా పేరెంట్స్ యిచ్చిన ఆస్తిపాస్తులు బాగానే వున్నాయి సార్- అంచేత మనీ ఈజ్ నెవర్ అవర్ ప్రోబ్లెమ్, కానీ హ్యూమన్ రిలేషన్స్! వాటిని సార్ మేము గాఢంగా కోరుకుంటున్నది. అభిమానాలు, ఆత్మీయతలు అర్థం చేస్కోలేని సమాజం అయిపోయింది సార్- ఇక్కడి సమాజం. అంచేతనే ఈ నిరాశనీ, నిస్పృహనీ భరిం చలేక అవి ఇంకెక్కడేనా దొరుకుతాయేమో ననే ఆశతో ఇక్కడ్నుండి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాం సార్!" అంది.

ఆమె గొంతులో ధ్వనించిన నోట్ ఆఫ్ శాడ్‌నెస్ బాస్‌ని బాగా కదిలించేసింది. కొద్దిక్షణాలు ఆగవలసి వచ్చింది- అతగాడు తనని తాను కంట్రోల్ చేస్కోడానికి. చివ రికి ఒక నిట్టూర్పు విడుస్తూ "మీరు అంటు న్నదీ నిజమే మేడమ్! ఎందుకు ఇలా జరు గుతోందో చెప్పలేను, కానీ ఈ దేశం ఇప్పుడు బాగా డీ హ్యూమనైజ్ అయిపో యినట్టుగా అనిపిస్తోంది. ఇన్ సెర్చ్ ఆఫ్ మనీ కాకుండా, ఇన్‌సెర్చ్ ఆఫ్ ఎఫెక్షన్స్ అండ్ హ్యూమన్ వాల్యూస్ అని ఆరాట పడే మనుషులు ఎంతో వున్నతులై వుండాలి. అలాటి మనుషులు మన నుంచి దూరంగా వెళ్ళిపోతున్నారంటే మనసుకి చాలా పెద్దగాయం అవుతుంది" అని ఒక క్షణం నిశ్శబ్దంగా వుండిపోయాడు బాసు. తరువాత సర్దుకొని "సరే! మేడమ్! మీరు ఎలా చెయ్యాలనుకుంటే- అలాగే చెయ్యండి! మీ స్థాయికి నేనింకా చేరుకో లేదు. డబ్బుతోనే థింగ్స్‌ని మెజర్ చేసే స్థాయిలోనే వున్నాను- ఇంకా. ఏ కారణం చేతనైనా- మీరు మళ్లీ ఇండియా తిరిగి రావాలని నిశ్చయించుకుంటే మాత్రం నా ఆఫీసు తలుపులు మీ పుట్టింటి తలుపులు అనుకొని స్వేచ్ఛగా, చనువుగా ఇక్కడికి వచ్చేయండి. గుడ్‌లక్..!" అని ముగించి తన ప్రయివేట్ ఛాంబర్‌లోకి వెళ్లిపో యాడు.

ఈ సంభాషణ జరుగుతున్నంతసేపూ- బంగార్రాజు కూడా అక్కడే వున్నాడు. తన కన్నీళ్లని బంగార్రాజు చూడకూడదని- సుందరి తలదించుకొనే కూర్చొని- పెల్లుబు కుతున్న దుఃఖాన్ని అదుపు చేస్కోడానికి తంటాలు పడుతోంది.

బంగార్రాజయితే ఓ గండశిలే అయి పోయి చైతన్యాన్ని కోల్పోయిన వాడిలా కూర్చుండిపోయాడు. ఆఫీసు వర్గంతా

అలా పెండింగులో వుండిపోయింది. సీట్లో కూర్చున్నాడన్నమాటేగానీ, చైతన్యం కోల్పో యిన వ్యక్తిలా అలా శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు. అతని సంతకం కోసం పేపర్లు తెస్తున్నవాళ్లంతా- అతని స్థితిని గమనించి నిశ్శబ్దంగా వెనక్కి వెళ్లిపోతు న్నారు.

ఆఫీసులో అందరికీ కొంచెం అనుమా నపు వాసన- అతనికీ, సుందరికీ- మామూలు కన్నా కాస్త ఎక్కువ పరి చయం అనీ. అందుకనే- అతని పరధ్యా నాన్ని మరోలా అన్వయించుకుంటూ- ఆ స్థితిలో అతన్ని డిస్టర్బ్ చెయ్యడానికి సాహసం చెయ్యలేక వెనక్కి వెళ్లిపోతు న్నారు.

ఇంతలో సుందరే వచ్చింది- ఏదో ఫైలు పట్టుకొని. ఆమె రాకని కూడా గమనించి నట్టులేదు బంగార్రాజు.

సుందరే అతని ఛైయిర్ దగ్గరకి వెళ్లి "ఏమిటి? ఏదో పరధ్యానంలో వున్నట్టు న్నారు? " అంది.

ఆమె గొంతుక విని తుళ్లిపడి ఈ లోకంలోకి వచ్చేడు బంగార్రాజు. ఆమెని తదేకంగా చూస్తూ ఎమోషన్స్ నిండిన గొంతుకతో "చెప్పండి! నేనేకదా మిమ్మల్ని ఇక్కడి నుండి తరిమేస్తున్నది? ఏదో దుర దృష్ట ముహూర్తంలో జరిగింది మన పరి చయం. అప్పట్నుండీ మీకు మనశ్శాంతి లేకుండా అయిపోయింది. చివరికి ఈ దేశాన్ని వదిలిపెట్టి పోవాలని నిశ్చయించు కున్నారు. ఇదంతా నామూలాన్నే జరి గింది" ఈ మాటలు అంటూ కన్నీటిని ఆపుకోలేకపోయాడు బంగార్రాజు.

అతని కన్నీరు చూసి సుందరి బాగా చలించిపోయింది. అతి ప్రయత్నంతో తనని తాను అదుపులోకి తెచ్చుకుంటూ- "చూడండి! ప్రపంచంలో ఎవరికి ఏ చిన్న మనస్తాపం కలిగినా అది మీవల్లే జరిగి వుంటుందని భావించి తల్లడిల్లిపోయే మన స్తత్వం మీది. ఇందుకు వ్యతిరేకంగా

## కామెంట్ ప్లీజ్!

గెలుపోటములను సమభావంతో స్వీక రించే లింకన్ ఒకసారి ఎన్నికల్లో ఓడిపో యారు. దాంతో ఆయన ఓటమి గురించి



స్పందించాల్సిందిగా విలేఖరులు అడిగారు.

దానికి 'నా పరిస్థితి బొటన వేలును గాయం చేసుకున్న కుర్రాడిలాగుంది. ఈ గాయం నవ్వుకునేంత చిన్నదీ కాదు, ఏడ్చే టంత పెద్దదీ కాదు' అన్నారు లింకన్ తన ఓటమి స్థితి గురించి చమత్కరిస్తూ.

ప్రపంచంలో జరుగుతున్న ప్రతి అన్యాయం తమకే జరుగుతోందని భావిం చేవాళ్లు కొంతమంది. ఇలాటివాళ్ల సంఖ్యే ఎక్కువ. కమాన్ బి ఎ స్పోర్ట్- టేక్ థింగ్స్ ఇన్ యువర్ సైడ్. ఈ ఫైలు జరూరుగా వెళ్లాలి. అంచేత అనవసరమైన ఆలోచనలు మానేసి దీనికి క్విక్ డిస్పో జల్ ఇవ్వండి" అనేసి- ఫైలుని అతని టేబులు మీద వుంచేసి తన సీటు దగ్గరికి వెళ్లిపోయింది సుందరి.

★ ★ ★

బాబూరావుతో ఆవేళ జరిగిన సంవాదం తర్వాత భాగ్యలక్ష్మి ఆలోచనల్లో కించిత్ మార్పు వచ్చింది. తను అతిగా రియాక్ట్ అవుతున్నానేమో అనే అనుమానం వచ్చింది ఆవిడకి తొలిసారిగా. 'పోనీ ఏది ఏమయితేనేంగాక! వాళ్లు అమెరికా వెళ్లిపో తున్నారట! అది చాలు! పీడ విరగడై,

హాయిగా ఊపిరి పీల్చుకోడానికి. చివరి నిముషందాకా ఈ మనస్పర్థలు ఇదే టెంపోలో కంటిన్యూ అవుతున్నాయన్న భావన వెళ్లిపోతున్నవాళ్ల మనసులో ఎందుకు వుండిపోవాలి? తనలో మార్పు వచ్చేసినట్టు ఈ నాలుగయిదు రోజులూ నటిస్తే సరిపోదూ? ఈ కొద్దిరోజులూ కాస్త నవ్వుతూ, ప్లజెంట్‌గా కనిపిస్తే బావుంటుంది కదా!' ఇలా సాగుతున్నాయి.. భాగ్యలక్ష్మి ఊహలు.

అక్కడ్నుండి సుందరి కనిపించినప్పుడల్లా పేలాలు వేగుతున్న బాణలి మాదిరి ముఖం పెట్టకుండా చిన్న నవ్వుని అతి చిన్ననవ్వుని ముఖానికి అతికించుకుంటోంది.

అయితే, సుందరి గ్రహించకపోలేదు ఈ చిరునవ్వుల వెనకవున్న మతలబుని.

'నేను దేశం వదిలి వెళ్లిపోతున్నాననే కదా- ఈ చిరునవ్వుల వెనకాతల వున్న భాష్యం! పోనీ ఏదోరకంగా బంగార్రాజుగారింట్లో శాంతి నెలకొంటే అంతే చాలు! అదే సంతోషం! నేను ఏ దేశానికి పోయినా ఫర్వాలేదు' అనుకుంది మనసులో సుందరి.

చివరికి బాబూరావు, సుందరి స్టేట్స్‌కి వెళ్లవలసిన రోజు వచ్చింది.

ముందురోజు ఆఫీసులో జరిగిన వీడ్కోలు సభ అందర్నీ విచారంలో ముంచేసింది.

సుందరిలాటి చురుకైన, నిశితమైన, స్నేహపూరితమైన స్త్రీ మళ్లీ ఈ ఆఫీసులో పనిచెయ్యడానికి రాదు కాక రాదు అని ముక్తకంఠంతో చెప్పేరు కొలీగ్సంతా. వీడ్కోలు ప్రసంగం చేస్తున్నప్పుడు చాలా మంది కన్నీరు ఆపుకోలేకపోయారు.

సుందరి అయితే సరేసరి! "నేను మొట్ట మొదటిసారిగా చేరిన వుద్యోగం ఏమీ కాదు, ఈ ఆఫీసులో వుద్యోగం! ఇంతకు ముందు కూడా చాలా కంపెనీల్లో పనిచేశాను. కానీ ఇలా ఎందుకు జరిగిందో చెప్పలేను- కానీ- ఈ ఆఫీసులో పనిచేసింది పట్టుమని పదిరోజులేనా లేదు! అయినా మీరంతా నా ఆత్మబంధువులు అనే భావం మనసులో డీప్‌గా ఏర్పడిపోయింది. పోనీయండి ఇదీ ఒకందుకు మంచిదే అనిపిస్తోంది! ఈ ఆనందం ఇలా కంటిన్యూ అవుతున్నప్పుడే వెళ్లిపోవడం ఎంతో బావుంటుంది. మీతో కలిసి పనిచేసిన ఈ పదిరోజులూ ఒక తియ్యని కలలాగ గుర్తుండిపోతాయి. నా మీద ఇంత ఆత్మీయత కనపరచిన మీ అందరికీ వేనవేల కృతజ్ఞతలు" అని చెప్పి- కన్నీరు పెడుతూ కూర్చుంది.

సుందరితో కలిసి పనిచేస్తున్న లేడీ కొలీగ్సయితే దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కివెక్కి ఏడ్చేశారు. 'ఫేర్‌వెల్స్ ఆర్ స్వీట్ సారోస్' అని ముక్తసరిగా రెండే రెండు మాటలు చెప్పి సభని ముగించాడు బాస్.

బుధవారంనాడు సుందరి బాబూరావుల ప్రయాణం. ఏ కళనుందో? ఏమిటో? వాళ్లిద్దర్నీ భోజనానికి పిలవమని ప్రపోజల్ పెట్టింది భాగ్యలక్ష్మి.

దాని ఆంతర్యమేమిటో అంతుబట్టకపోయినా సరే "అలాగే కానియ్!" అని అంగీకారం తెలిపేడు బంగార్రాజు.

'ఇది నిశ్చయంగా నష్టనివారణ చర్య' అని ఫీలయ్యేడు బాబూరావు. కానీ 'విస్డమ్ కమింగ్ టూ లేట్' అని కూడా అనుకున్నాడు.

ఏది ఏమైనా సందేహాలతో, అసంతృప్తితో పై దేశాలకి వెళ్లిపోవడం కంటే, 'ఫర్వాలేదు! చివరికి ఏదోరకంగా సర్దుబాటు జరిగింది' అనే ఫీలింగుతో వెళ్ళిపోవడం పాజిటివ్ డెవలప్‌మెంట్ అనుకొని, మనసులోంచి ఏదో బాధపోయినట్టుగా ఫీలయ్యేడు బాబూరావు..

'ఇది ఇంకేదైనా కుట్రపూరిత వ్యూహం కాదు కదా?' అని అనుమానపడింది

సుందరి! 'ఏది ఏమైనా మిగిలివున్న ఈ కొద్దిగంటలసేపూ ఏ కొత్త ఫ్రిక్షన్ డెవలప్ కాకుండా జాగ్రత్తగా మసలుకుంటాను. కొత్తగా మరిన్ని గాయాలు తగలకుండా జాగ్రత్త తీసుకోవాలి' అని మనసులో నిశ్చయించుకుంది సుందరి.

చెప్పొద్దూ! సుందరి వెళ్ళిపోతోందన్న వార్త వసంతకోకిల కూతలాగా చెవికి తాకింది భాగ్యలక్ష్మికి. 'సరే, ఎలాగూ పోతోంది కదా! అలాంటప్పుడు కూడా దాని మనసులో నేను చెడ్డదాన్ని అనే అభిప్రాయమే ఎందుకు కంటిన్యూ అవాలి? ఈ కొద్దిసేపూ ఆప్యాయతను నటించి ఆమె దృష్టిలో తన ఇమేజ్ కొంచెం మెరుగయ్యేటట్టు చేస్కోవచ్చును కదా!' అని అనుకొని, వెళ్ళిపోతున్న రోజున వాళ్లని భోజనానికి పిలవమని భర్తకి పురమాయించింది భాగ్యలక్ష్మి.

బంగార్రాజు స్వయంగా రంగంలోకి దిగిపోయాడు ఈ లాస్ట్ సప్పర్ లాటి లంచ్‌ని తయారుచెయ్యడానికి- తన మైండ్ మారుమూలల్లో దాగివున్న కలినరీ స్కిల్స్ అన్నిటినీ పిలకపట్టి బయటికీడ్చుకొచ్చి సిజిలింగ్ కుకీస్‌ని, చూసీచూడ్డంతోనే నోరు వూరిపోయేటట్టు తయారుచేశాడు.

'తన వన్నెల చిలక ఎన్నటికీ మరిచిపోకుండా వుండాలని ప్రత్యేకంగా తయారుచేసిన వంట ఇదంతా!' అని మనసులో కక్షగా పళ్లు నూరుకుంది భాగ్యలక్ష్మి. మొగుడు చేసిన వంటకాల్ని మాత్రమే ఎక్కడ మెచ్చేసుకుంటారోననే ఈసుతో, తనకి కూడా బాగా చెయ్యడం వచ్చిన మోర్‌కుళాంబ్ ఘుమఘుమలాడేటట్టు చేసి టేబుల్ మీద అమర్చింది. పళ్లకి పని తగలకుండానే నోట్లో కరిగిపోయేలాంటి గుమ్మడి వడియాల్ని, వేయించిన అప్పడాలతో సహా హాట్‌పేక్‌లో పెట్టి టేబుల్ మీద వుంచింది. రుచితో వూరిస్తున్నట్లు కనిపిస్తూ గుత్తివంకాయకూర.

భోజనం బల్లమీద కనిపిస్తున్న ఐటెమ్స్‌ని చూసి 'వావ్' అని కేక పెట్టింది సుందరి కలస్వనంతో. అవన్నీ బంగార్రాజు తయారీలే అని తెలిసినప్పటికీ ఆ మాటని కాస్త బయటికి అంటే ఎక్కడ మీద పడి రక్కేస్తుందో ఆ భాగ్యలక్ష్మి అని భయపడి, కళ్లతోనే తన అభినందనని కన్వే చేసింది బంగార్రాజుకి.

"వండర్‌ఫుల్ లంచ్!" అని మెచ్చుకున్నాడు బాబూరావు. తనదైన సబ్‌డ్యూడ్ టోన్‌లో.

భోజనం సరససల్లాపాలతో సాగుతోంది. నిన్నటిదాకా నిత్యం కత్తిదూసి సుందరి మీదికి ఉరకాలని చూస్తుండే భాగ్యలక్ష్మేనా ఈ భాగ్యలక్ష్మి అని మనసులో తెగ ఆశ్చర్యపడిపోతున్నాడు బంగార్రాజు.

"బంగార్రాజుగారూ! అసలు మీతో పరిచయమవడమే సమోసాల్ని రుచి చూడ్డంతో ఆరంభమయింది. మళ్లీ ఇవాళ ఈ వీడ్కోలు వేళలో మీ వంటకాలు రుచి చూస్తున్నాం. ఏం పాకప్రావీణ్యమండీ మీది! మీరేగాని ఒక రెస్టారెంట్‌ని ప్రారంభిస్తే హాస్పిటాలిటీ బిజినెస్‌లో కింగై కూర్చుంటారు" అంది సుందరి- తన అప్రిసియేషన్‌ని అణుచుకోలేక వినసొంపైన యాక్సెంట్‌తో.

"పోనీ! మీతోపాటుగా ఇతగాడ్నీ అమెరికా తీసుకుపోయి, అక్కడ స్పెషల్ వెరైటీ ఇండియన్ రెస్టారెంట్ ఒకటి ఓపెన్ చేయించండి. ఎటొచ్చీ మీతో కబుర్లలోపడి ఇన్‌సాల్వెన్సీ బోర్డ్ తగిలించే స్థితికి రాకుండా చూస్కోండి!" అంది భాగ్యలక్ష్మి- అక్కసుని నవ్వుతాలకింది మార్చేస్తూ.

"అబ్బ! ఏందెబ్బ కొట్టేరు" అని మేటర్ మరింత ముదరకుండా అక్కడితో తుంచివేసింది సుందరి.

సాయంత్రం నాలుగు అయేసరికి బాక్సులు సర్దుకోడం పూర్తయింది. "నేనొక

సారి అలా వెళ్లి తెలిసినవాళ్లు నలుగురికీ చేతులూపేసి వస్తాను" అని బయలుదేరేడు బాబూరావు.

అతను అలా వెళ్లేడు ఇలా బంగార్రాజూ వొచ్చేడు శ్నాక్స్, ఫ్లాస్కుతో కాఫీ పట్టుకొని "అరే! కాఫీ తాక్కుండానే బయటికెళ్లేరా బాబూరావుగారు? " అని వాపోయాడు బంగార్రాజు.

"కాఫీ ఫ్లాస్కులోనే కదా వుంది, వచ్చి తాగుతారు. ముందు కూర్చోండి! కూర్చొని కాసేపు కబుర్లు చెప్పండి. మళ్లీ మీ మాటలు విననుగా! అంచేత చివరిసారి మీతో మనసారా మాట్లాడేస్తే.." అంది పూర్తిచెయ్యకుండా సుందరి.

'చివరిసారి' అన్న ఆవిడ మాట వినగానే 'ఇదీ!' అని చెప్పడానికి వీల్లేని బాధ, నిరాశ, దుఃఖం ముంచుకొచ్చేశాయి బంగార్రాజుకి. తనని తాను అదుపులో పెట్టుకోగల సామర్థ్యం వుంది కనక, కంట్రోల్ చేసుకొని నవ్వుని పెదిమలకి అంటించి "అలాగే- కబుర్లాడుకుందాం! ముందుగా కాస్త కాఫీ తీస్కోండి! కాఫీని సిప్ చేస్తూ కబుర్లు చెప్పుకుందాం! సరేనా!" అన్నాడు.

కాఫీ కప్పులో పోస్కొని ఓ గుక్క రుచి చూసి "అబ్బ! అమృతం! అవునూ! ఒక మాట అడుగుతాను, నిజం చెప్పాలి" అంది సుందరి.

"అదేంవిటి? అలా అన్నారు? అపశబ్ద భయం నాస్తి అప్పలాచార్య సన్నిధౌ' అని ఒక నానుడి వుందిలెండి! అలాగా! మీ ముందు కూర్చున్నప్పుడు చెప్పాలన్నా అబద్ధాన్ని పలకదే ఈ నోరు! ఏదడగాలన్నా నిస్సంకోచంగా అడగండి" అన్నాడతడు.

"సరే! అడగమన్నారు కనక అడిగేస్తున్నాను, మీరెందుకు ఇలా అమృతంలాంటి కబుర్లు చెపుతూ, అమృతంలాటి రుచుల్ని తినిపిస్తూ వచ్చారు ఇన్నాళ్లూ? అవి దొరకవు కదా ఇకమీదట! అప్పుడు నేనేం కావాలి? "

కాసేపు ఆవిడవేపు ఎంతో దీనంగా చూస్తూ- గద్గద స్వరంతో "ఇది మీరు వెయ్యవలసిన ప్రశ్న కాదనుకుంటాను? నేనడగాలి- ఎందుకు మీ సమక్షం అమృతోపమానంగా వుంటుంది? అని"

సుందరి నిశ్శబ్దంగా వుండిపోయింది. ఓ రెండు నిముషాల తర్వాత బంగార్రాజే మళ్లీ "చెప్పరా? " అన్నాడు. అతని గొంతులో ధ్వనించిన ఆర్తి.. ఎలాంటి బండరాయినేనా పలికేటట్టు చేస్తుంది.

ఓ రెండు నిముషాల నిశ్శబ్దం! చివరికి ఎంతో ప్రయత్నంతో గొంతు విప్పినట్లు అనిపించే ధ్వనితో ప్రారంభించింది సుందరి "ఎలా చెప్పమంటారు బంగార్రాజుగారూ! ఏమని చెప్పమంటారు? "

ఆమె గొంతులో ధ్వనిస్తున్న ఏదో స్వరం- బంగార్రాజు మనస్సుని తుళ్లి పడేటట్టు చేసింది. దానితో అప్రతిభుడై, కూర్చుండిపోయాడు.

"నేను అక్కడికి ఎందుకు వెళ్లిపోతున్నానో తెలుసా? "

జవాబు చెప్పలేకపోయాడు బంగార్రాజు.

"నేనిక్కడుంటే మీ కాపురం- నా కాపురం- రెండూ కూలిపోతాయని భయపడి- ఇక్కడ్నుంచి పారిపోతున్నాను"

ఆమె మాట్లాడిన తీరునిబట్టి ఆమె ఎంతో దుఃఖాన్ని ఆపుకోడానికి ప్రయత్నిస్తోందని అనిపించింది బంగార్రాజుకి.

దాంతో గాభరాపడి "మేడమ్!" అని, కుర్చీలోంచి లేవబోయాడు.

"వద్దు! లేవొద్దు! అలాగే కూర్చోండి! బాబూరావుగార్ని నాకు భర్తగా నిర్ణయించినప్పుడు నేను తటపటాయించేను. అతను మాకు బాగా దగ్గరివాడే. మనిషి ఆకారం పెద్ద ఆకర్షణీయంగా ఉండదు. అయితే బాగా డబ్బున్న కుటుంబం, మనిషి చాలా మంచివాడని బోధపరిచి పెళ్లి జరిపించేరు. ఆ తరవాత బోధపడింది అతని

## మేయడంలో దిట్ట!

అమెరికాలో అప్పట్లో జనరల్ కేస్ అనే అధికారిపైన ఆర్థికశాఖ తీవ్రమైన నేరారోపణలు చేసింది. ఆయన నిస్సిగ్గుగా దొంగ బిల్లులు పెట్టుకుని ఖజానాకు చిల్లులు పెట్టాడని తేలింది.



దాని గురించి చట్టసభలో ప్రస్తావిస్తూ లింకన్ 'ఆయనొక్కడే ఎందరి పనినో చేశాడండీ! ఎన్నోసార్లు చేసిన పనుల్నే మళ్లీమళ్లీ చేశాడు. అది కూడా కొన్ని వందల మైళ్ల దూరంలో, ఒకే సమయంలో చేశాడు. ఆహారం తినడంలోనూ ఆయన సామర్థ్యం భేషుగ్గా ఉంది. అక్టోబర్ 21 నుంచి మే 22 వరకూ ఆయన మిచిగన్‌లో పదిచోట్ల, వాషింగ్టన్‌లో పదిచోట్లా ఒకేసారి, ఒకే సమయంలో భోంచేశాడు. ఆ బిల్లుల వల్ల తేలిందేమిటి? ఎవరెంత తిన్నారో తిరిగివ్వాలనీ, అంతేకాని ఎవరెంత తినాలో చెప్పడం కాదు కదండీ స్పీకర్‌గారూ!' అంటూ ప్రత్యర్థిపై వ్యంగ్య బాణాలు సంధించారు.

లాటి మంచిమనుషులు ప్రపంచంలో ఎంతో వెతికితేనే గానీ దొరకరని! అంత మంచివ్యక్తి. ఎవరినీ నొప్పించని స్వభావం. అతను మాటలాడే తీరు విన్నారు కదా! నామట్టుకు నాకు అతను మాటాడుతుంటే ఎవరో దివ్యపురుషుడు మాటాడుతున్న అనుభూతి కలుగుతూంటుంది. టు బి ఫ్రాంక్ నేను బాబూరావు గారికి ఒక భక్తురాల్లాగ మారిపోయాను. పురుషుడంటే నాకు ప్రపంచంలో కనిపించేది ఒక్క బాబూరావే"

అక్కడితో కాసేపు ఆపుచేసి- నిశ్శబ్దంగా ఉండిపోయింది సుందరి. ఏదో చెప్పాలని ఆరాటపడుతూ, చెప్పడం చేతకాని దానిలా ఆయాసపడుతోంది. ఆమె విషాదాన్ని అర్థం చేసుకున్నవాడిలా మౌనంగా కూర్చొని ప్రతీక్షిస్తున్నాడు బంగార్రాజు- ఆమె చెప్పబోయేదానికోసం.

తాపీగా ప్రారంభించింది సుందరి "కానీ.. కానీ.. బంగార్రాజుగారూ! మిమ్మల్ని ఏ ముహూర్తంలో చూశానో? మీతో ఏ ముహూర్తంలో మాట్లాడేనో గానీ అప్పట్నుండీ నా మనస్సంతా కల్లోల సముద్రం అయిపోయింది. ఇప్పుడు నాకు బాబూరావు సరసన మీరు కూడా కనిపిస్తున్నారు. నేను పొరపాటు తోవలోకి వచ్చేస్తున్నానని నాకు తెలుస్తూనే ఉంది- అనుక్షణం. కానీ పిచ్చెక్కిన గుర్రంలా మనసు మీవైపు దౌడు తీస్తోంది"

చెప్పడం ఆపింది సుందరి. ఆమె ఎంతో అలసిపోతున్నట్టుగా అనిపించింది బంగార్రాజుకి. అయితే- నిశ్చేష్టుడైపోయాడు ఆమె మాటలు విని. ఒక యుగం అంత పొడవుగా అనిపించిన ఓ నిముషం తర్వాత- మెల్లగా, అతిమెల్లగా మాటల కోసం ఏదో కొత్తగా తడుముకుంటున్న వాడిలా ఆరంభించేడు.

"కానీ, మేడమ్! నాకు మాత్రం మిమ్మల్ని చూసి మీతో మాటాడిన క్షణం నుండీ ఏదో గాఢమైన ఆరాధనా భావం ఏర్పడింది. ఎప్పుడు మిమ్మల్ని చూసినా, యెప్పుడు మీతో మాట్లాడినా, ఎప్పుడు మీ సమక్షంలో ఉన్నా ఏదో ఒక దేవత సమక్షంలో ఉన్నాననే అనిపిస్తూంటుంది నాకు"

"నాకు తెలుసు బంగార్రాజుగారూ! నాకు తెలుసు. మీరు ప్రలోభాలకు లోనుకాని వ్యక్తులని! నాకు ఎప్పుడో అర్థమయిపోయింది. మరొకరు మరొకరూ అయితే మన మధ్యని ఉన్న చనువులాటిది కనిపిస్తే దాన్ని ఆసరాగా చూసుకొని చాలా దూరం వెళ్లివుండేవారు. కానీ, మీలో మాత్రం మొదట్నుండి ఇప్పటిదాకా, అమ్మ

చుట్టూ గాఢమైన మమతతో తిరిగే-పిల్లాడి మనస్తత్వమే కనిపిస్తోంది నాకు. ఎన్నోమార్లు నాకు నేను చీవాట్లు వేసుకున్నాను కూడాను. అంత నిష్కల్మషమైన వ్యక్తిని చూస్తూ కూడా, నిన్ను నీవు ఎందుకు అదుపులో ఉంచుకో లేకపోతున్నావని? ఆఖరికి కనిపించిన పరిష్కారం ఇదే! మీ దగ్గర్నుండి దూరంగా పారిపోవడం. ఇంకొన్నాళ్లు ఇక్క డే ఉంటే ఏ క్షణంలో అదుపు కోల్పోయి ప్రవర్తిస్తానో ననే భయం పట్టుకుంది. సరే! వదిలేద్దాం ఆ ప్రస్తావన ఇక్కడితో"

మళ్లీ ఆమే "ఒక రిక్వెస్ట్! మీరు ఏనాడూ అమెరికా రాకండి. అమెరికాలో అంట్లు తోమేనా సరే నేను అక్కడే ఉండిపోతానుగానీ ఇండియా మాత్రం రాను. ఈ జన్మకి బాబూరావు చాలు. మళ్లీ జన్మంటూ ఉంటే.." అని దుఃఖాన్ని ఆపుకుంటూ.. కుర్చీలోంచి గభీమని లేచి గదిలోకి వెళ్లిపోబోయింది. వెళుతూ.. వెళుతూ.. గుమ్మం దగ్గర క్షణకాలం ఆగి "సరే! మీరింక లేచి వెళ్లండి!" అంది.

అలా అనేసి గదిలోకి వెళ్లిపోయింది.

కలలో ఉన్నవాడిలా మెల్లగా లేచి, అతి బరువుగా అడుగులు వేసుకుంటూ బయలుదేరాడు బంగార్రాజు.

గుమ్మం దాటి వెళ్లిపోబోతున్నాడు. లోపలికి వెళ్తున్న సుందరి సుడిగాలిలా వెనక్కి వచ్చి, బంగార్రాజుని గాఢంగా పెనవేసుకొని ఊపిరి సలపనివ్వని తమకంతో ముద్దులాడింది. తరువాత ఏదో షాకు తిన్నదానిలా అతనిని వదిలేసి "వెళ్లండి! ఇంకెప్పుడూ నాకు కనిపించకండి. ఎయిర్ పోర్ట్‌కి కూడా రావద్దు, మమ్మల్ని దిగబెట్టడానికి- వెళ్లండి!" అనేసి కన్నీటి ప్రవాహాన్ని తుడుచుకుంటూ లోపలికెళ్లింది.

కొంతసేపటికిగానీ బంగార్రాజు ఈ లోకంలోకి రాలేకపోయాడు. తరువాత మెల్లగా అడుగులు వేసుకుంటూ బయటికి వెళ్లిపోయాడు. తను ఎయిర్‌పోర్ట్‌కి వెళ్లకపోతే ఎన్ని అనుమానాలొస్తాయో? తెలుసు బంగార్రాజుకి. అందుకనే మనసులో విరుచుకుపడుతున్న తుఫాను కెరటాల్ని మనసులోనే తొక్కిపెట్టి ఏమీ జరగనట్టు ముఖానికి ఆ సమయానికి అవసరమైన మాస్క్ తగిలించుకొని ఎయిర్‌పోర్ట్‌కి వెళ్లేడు. తన సహజ ధోరణిలోనే వుత్సాహంగా మాట్లాడుతూ, సామాన్లు, ఇతర వస్తువుల్ని ట్రాలీలో సర్ది లోపలికి పంపేడు. సుందరి, బాబూరావులు లోపలికి వెళ్లిపోతుంటే చేతులు ఊపేడు బాన్‌వోయేజ్ అంటూ. వాళ్లు పూర్తిగా కనిపించకుండా లోపలికి వెళ్లిపోయారని నమ్మకం కుదిరేక వెనక్కి తిరిగి కళ్లు తుడుచుకున్నాడు.

లోపలికి వెళ్లిపోయింతర్వాత బాబూరావు- 'సుందరం! ఏంట్రా చివరికొచ్చేసరికి బంగార్రాజుతో కనీసం మాట్లాడనేనా మాట్లాడేవు కావు! చిన్న చిరునవ్వయినా నవ్వలేదు..!" అన్నాడు.

"నాకు భయం వేసింది బాబూ! అతనితో మాట్లాడినా, నవ్వినా, దుఃఖాన్ని ఆపుకోలేక ఎక్కడ బావురుమని ఏడ్చేస్తానో నని..! విమానాశ్రయంలో పెద్దసీను క్రియేటయితే ఎంత సిగ్గుగా వుంటుందో ఆలోచించండి, అందుకనే మనస్సుని ఎంతగా వుగ్గబట్టుకున్నానో అతనివైపు చూడకుండా ఉండేందుకు అందామె.."

బాబూరావు కొంచెంసేపు వూరుకొని, నిదానంగా నవ్వుతూ ఆమె వీపు మీద తడుతూ "నాకు తెలుసురా! బంగారం! ఎలాటి తుఫాను వచ్చినా నేను పడిపోకుండా బలమైన లంగర్ లాగ నా పక్కనే నిలబడతావని!" అన్నాడు.

అతని చేతివేళ్లని తన వేళ్లతో పెనవేస్తూ వెచ్చగా నొక్కి కనపడీ కనపడకుండా అతని భుజానికి తలని ఆనేటట్టు చేసింది సుందరి- క్యూతోపాటు ముందుకి నడుస్తూ. ©

# సంక్షోభంలో అమెరికా వార్తాపత్రికలు




ఇంటర్‌నెట్ విప్లవం అమెరికా వార్తా పత్రికలను సంక్షోభంలోకి నెట్టేసింది. ఈ కారణంగా అక్కడ పత్రికలు ప్రింట్ విభాగం నుండి తప్పుకుని ఆన్‌లైన్ బాటపడుతున్నాయి. అమెరికాలో పెద్దాచిన్నా కలిపి ఏకంగా 1380 దినపత్రికలు ఉన్నాయి. ఇందులో ఆరొందలకు పైగా పూర్తిగా ఆన్‌లైన్ పత్రికలుగా మారిపోయాయి. మిగిలిన పత్రికలు ముఖ్యంగా పెద్ద పత్రికలు ప్రింట్ పేపర్లను కొనసాగిస్తూనే ఆన్‌లైన్‌లోనూ అందిస్తున్నాయి. గత పదేళ్లలో అమెరికా దినపత్రికలు ముప్పయి శాతానికి పైగా సర్క్యులేషన్ కోల్పోయాయి. వృద్ధతరం అంతరిస్తున్న కొద్దీ పత్రికల సర్క్యులేషన్ దిగజారిపోతోంది. 2018 నాటికి మరో ఐదొందలు ప్రింట్ రంగం నుండి తప్పుకుని ఆన్‌లైన్ పత్రికలుగా మారిపోతాయని మీడియా నిపుణులు అంచనా వేస్తున్నారు. అమెరికాలో ఏకంగా ఏభై రాష్ట్రాలు ఉండడంతో ఎక్కువ వైశాల్యం దృష్ట్యా జాతీయ పత్రికల పంపిణీ ఎంతో కష్టతరంగా ఉంటోంది.

చిత్రమేమిటంటే అధిక జనాభాతో పాటు అక్షరాస్యత ఎక్కువగా ఉన్న అమెరికాలో వార్తాపత్రికల సర్క్యులేషన్ మొదటి నుండీ అంత ఆశాజనకంగా లేదు. లక్షకు పైబడి సర్క్యులేషన్ గల దినపత్రికల సంఖ్య వందకు మించి లేదు. ఇక పదిలక్షలకు మించి సర్క్యులేషన్ గల పత్రికలు మూడు మాత్రమే ఉన్నాయి. ఐదు లక్షలు పైబడి సర్క్యులేషన్ గల పత్రికలు ఐదారు ఉన్నాయి. ఆడిట్ బ్యూరో ఆఫ్ సర్క్యులేషన్, వికీపీడియాల రిపోర్టు ప్రకారం ఇప్పటికి వాల్ స్ట్రీట్ జర్నల్ (డబ్ల్యు.ఎస్.జె.) ఇరవైమూడు లక్షల సర్క్యులేషన్‌తో అగ్రశ్రేణి పత్రికగా కొనసాగుతోంది. ఇరవై ఒక్క లక్షల సర్క్యులేషన్ గల యు.ఎస్.ఎ. టుడే ద్వితీయ స్థానంలో ఉంది. ఈ రెండు పత్రికల మధ్య ఆధిపత్యపోరు ఉంది. ఒక దశలో యు.ఎస్.ఎ. టుడే, వాల్ స్ట్రీట్ జర్నల్‌ను అధిగమించినా ఆ స్థానాన్ని నిలుపుకోలేకపోయింది. అయితే ప్రథమస్థానం నిలుపుకోవడం కోసం వాల్‌స్ట్రీట్ జర్నల్ అనైతిక పద్ధతులకు పాల్పడుతోందని, ఇందులో భాగంగా తన పత్రికను తానే కొనుగోలు చేస్తోందని బ్రిటన్‌లో సంచలనాలకు పేరుపొందిన 'ది గార్డియన్' పత్రిక ప్రకటించింది.

ఇక న్యూయార్క్ టైమ్స్ మూడో స్థానంలో ఉంది. ఎంతో పేరుపొందిన వాషింగ్‌టన్ పోస్టు, ది చికాగో, ట్రిబ్యూన్ పత్రికలు మొదటి పది అగ్రశ్రేణి పత్రికల్లో స్థానం పొందాయి. లాస్ ఏంజిల్స్ టైమ్స్, శాన్‌జోస్ పత్రికలు వాటికంటే మెరుగ్గా ఉన్నాయి. న్యూయార్క్ డైలీ న్యూస్, న్యూయార్క్ పోస్టు, చికాగో సన్ టైమ్స్ మొదటి పదిస్థానాల్లో మిగిలిన పత్రికలు.

అగ్రశ్రేణి పత్రిక ది వాల్‌స్ట్రీట్ జర్నల్ ఆదివారం సంచికను ప్రచురించదు. శనివారం పత్రికలో ప్రచురించి దానికి 'వీక్ ఎండ్ ఎడిషన్' అని పేరు పెట్టింది. ఆదివారం లాస్ ఏంజిల్ టైమ్స్ రెండు డాలర్లకు, ఇక వాషింగ్‌టన్ పోస్టు రెండున్నర డాలర్లకు, యు.ఎస్.ఎ. టుడే మూడు డాలర్లకు, న్యూయార్క్ టైమ్స్ ఐదు డాలర్లకు అమ్ముతున్నాయి. చాలా పత్రికలు ఆదివారం ఎక్కువ పేజీలను ప్రచురిస్తున్నాయి. ది బఫెల్లో టైమ్స్, సిన్సినాటీ ఎంక్వైర్ లాంటి రెండు లక్షలకు దిగువ సర్క్యులేషన్ గల పత్రికలు కూడా ఆదివారం సంచికలను నూట ఏభై నుండి రెండొందల పేజీలతో ప్రచురిస్తున్నాయి. ఆదివారం పత్రికతో మనవాళ్లు అప్పుడపుడు షాంపూ ప్యాకెట్లు ఇచ్చినట్లుగా అక్కడ ధరల తగ్గింపు

కూపన్లు ఇస్తున్నారు. వాటిని షాపులకు తీసుకెడితే తక్కువ ధరలకు వస్తువులను కొనుగోలు చేయవచ్చు. చివరకు ఈ కూపన్ల విధానం వేలం వెర్రిగా మారింది. వాషింగ్టన్ పోస్టులాంటి అగ్రశ్రేణి పత్రిక ఈ కూపన్ల ద్వారా తన సర్క్యులేషన్ దిగజారకుండా చూసుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. నిజం చెప్పాలంటే వాల్‌స్ట్రీట్ జర్నల్, యు.ఎస్.ఎ. టుడే పత్రికల ప్రింటింగ్ నాణ్యత కంటే మన తెలుగు, ఆంగ్ల దినపత్రికల నాణ్యత బాగుంటుంది. అక్కడ చాలాపత్రికలు రంగుల్లో ప్రచురించడం లేదు. చివరకు ఆదివారం అనుబంధాలను కూడా చాలా స్వల్పంగా రంగుల్లో అందిస్తున్నారు. చిత్రమేమిటంటే యు.ఎస్.ఎ. టుడే లాంటి పత్రిక కూడా పదే పదే 'తగ్గింపు ధరకు పత్రికను అందజేస్తాం, చందాదారులుగా చేరండ'ని కోరవలసి వస్తోంది. మూడు నెలల చందా కడితే ఏభై శాతం తగ్గింపని ఇటీవల నాలుగుసార్లు ప్రకటించింది.

**మీకు తెలుసా?**

నేటి యువతకు రోజూ వందలను మించి పేజీలు గల ప్రింట్ దినపత్రికలు చదివే సమయం లేనందున ఆన్‌లైన్ బాటపట్టారు. సాధారణంగా ఆన్‌లైన్ పత్రిక అనగానే ఉచితం అనుకుంటాం. కానీ ఇపుడు పేరున్న పత్రికలను ఆన్‌లైన్‌లో చదవాలంటే రుసుం చెల్లించాలి. అంటే ఆన్‌లైన్‌లో చందాదారులై ఉండి ప్రత్యేక పాస్‌వర్డ్ ఉంటేనే పత్రిక లింక్ ఓపెన్ అవుతుంది. ఆన్‌లైన్ ఎడిషన్లు ప్రారంభించిన తరువాత న్యూయార్క్ టైమ్స్, వాషింగ్టన్ పోస్ట్ పత్రికల పరిస్థితి మెరుగైంది. కాగా కొన్నిలక్షల టన్నుల న్యూస్ ప్రింట్‌ను ప్రతిరోజూ వృథా చేసే బదులు ఆన్‌లైన్ పత్రికల సంఖ్య పెరగటమే మంచిదని పర్యావరణ ప్రేమికులు అంటున్నారు. ఎంత రీసైక్లింగ్ విధానం ఉన్నా పేపర్ల ముద్రణ కోసం రోజూ నరుకుతున్న చెట్ల సంఖ్య ఇప్పటికీ లక్షల్లో ఉందని వారు గుర్తు చేస్తున్నారు.

**నమ్మలేని నిజాలు:**

1. ప్రపంచవ్యాప్తంగా ప్రతిరోజూ ఏభై ఎనిమిది కోట్ల దినపత్రిలు ముద్రితమవుతున్నాయి. అంతకు మూడురెట్లమంది చదువుతున్నారు.

2. నూట ఏభై కోట్లమంది ఆన్‌లైన్‌లో దినపత్రికలు చదువుతున్నారు.

3. ప్రపంచంలో ఎక్కువ దినపత్రికలు ముద్రిస్తున్న దేశం జపాన్. అక్కడ యమురీసింబున్ కోటి, అషాహిసింబున్ ఎనభై లక్షల సర్క్యులేషన్ కలిగి ఉన్నాయి. తొంభై శాతం ప్రజలు దినపత్రిక కొని చదివే అలవాటు జపాన్‌లో ఉంది. ప్రపంచంలో ఈ స్థాయి సర్క్యులేషన్ గల పత్రికలు ఎక్కడా లేవు. బ్రిటన్‌లో 'ది సన్' నలభై లక్షలు, చైనాలో 'ది పీపుల్స్ డైలీ' ముప్పయి ఆరు లక్షలు, అమెరికాలో 'వాల్‌స్ట్రీట్ జర్నల్' ఇరవై మూడు లక్షల సర్క్యులేషన్ కలిగి ఉన్నాయి.

**– పుట్టా సోమన్న చౌదరి**

## ఆంగ్లభాషలో మొదటి పది దినపత్రికలు

### ప్రపంచంలో

| స్థానం | పత్రిక పేరు | దేశం |
|---|---|---|
| 1. | ది సన్ | బ్రిటన్ |
| 2. | వాల్‌స్ట్రీట్ జర్నల్ | అమెరికా |
| 3. | ది డెయిలీ మెయిల్ | బ్రిటన్ |
| 4. | యు.ఎస్.ఎ. టుడే | అమెరికా |
| 5. | ది మిర్రర్ | బ్రిటన్ |
| 6. | టైమ్స్ ఆఫ్ ఇండియా | ఇండియా |
| 7. | న్యూయార్క్ టైమ్స్ | అమెరికా |
| 8. | ది డైలీ టెలిగ్రాఫ్ | బ్రిటన్ |
| 9. | ది డైలీ ఎక్స్‌ప్రెస్ | బ్రిటన్ |
| 10. | ది లాస్‌ఏంజిల్స్ టైమ్స్ | అమెరికా |

### అమెరికాలో

| స్థానం | పత్రిక పేరు |
|---|---|
| 1. | వాల్‌స్ట్రీట్ జర్నల్ |
| 2. | యు.ఎస్.ఎ. టుడే |
| 3. | న్యూయార్క్ టైమ్స్ |
| 4. | లాస్ ఏంజిల్స్ టైమ్స్ |
| 5. | శాన్ జోస్ |
| 6. | ది వాషింగ్టన్ పోస్ట్ |
| 7. | న్యూయార్క్ డైలీ న్యూస్ |
| 8. | న్యూయార్క్ పోస్ట్ |
| 9. | చికాగో ట్రిబ్యూన్ |
| 10. | చికాగో సన్‌టైమ్స్ |

పెద్దకథ

# ప్రియురాలు పిలిచె రావోయీ..

ఊరి పొలిమేరలో మంచినీళ్ళ బావిలో నుంచి నీళ్ళుతోడి, వచ్చే పోయే బాటసారుల దోసిళ్ళు నింపుతూ వారి దాహార్తిని తీర్చేపనిలో నిమగ్నమై వుంది లుఫ్తీ.

తన బావి పరిసరాలు పచ్చదనంతో కళకళలాడుతూ వుంటాయనీ, నీళ్ళు కూడా తియ్యగా రుచిగా వుండటంతో.. అందరూ కడుపునిండా తాగి సేదతీరి వెడతారనీ, నలుగురితో సగర్వంగా, సంతోషంగా చెప్పుకుంటూ సంబరపడిపోతూ వుంటుందామె. ఆ బావి ఆమెకు తండ్రి నుంచి వారసత్వంగా వచ్చింది. తండ్రికి తాత నుంచి వచ్చింది. చిఫ్తోంకోసా మీదుగా క్యాస్ట్రోబ్జా వేపు వెళ్ళే పెద్దరోడ్డుకి ఆనుకుని వున్న జాగాలో.. మూడు వందల అడుగుల లోతున్న ఆ బావిని ఆమె పూర్వీకులు ధర్మకార్యంగా భావించి తవ్వించారు.

అడిగిన వారికి లేవనకుండా మంచినీళ్ళు అందించారు.

ధర్మాత్ములైన తన తాతముత్తాతలు చేపట్టిన ఆ సేవాకార్యాన్ని కొనసాగిస్తూ.. ఎంతో ఆనందాన్ని, ఆత్మతృప్తినీ పొందుతోందామె.

ఇంటిపనులు త్వరగా తెముల్చుకుని వచ్చి, సంజె చీకట్లు ముసురుకునే వరకూ ఆ కార్యక్రమంలోనే నిమగ్నమై వుంటుంది.

నూతి చుట్టూ పళ్ళెం కట్టించి, తాడు లాగటానికి వీలుగా నూతి గోడలమీద గిలకను ఏర్పాటుచేశారు.

ఆ దారిన పోయే వాళ్ళంతా అక్కడ కాసేపు ఆగి.. లుఫ్తీ చేతి మంచినీళ్ళు తాగి, ఆమెతో కాసేపు కబుర్లు చెప్పి వెడుతూ వుంటారు.

ఇవాళ నీళ్ళు తోడుతోందన్నమాటేగానీ.. ఆమె మనసు మనసులోలేదు. ఆలోచనలన్నీ మురాద్, ఆశీల చుట్టు తిరుగుతున్నాయి.

"ఇప్పుడేమౌతుందో? అసలతను ఆ ఆకతాయి పని చెయ్యకుండా వుంటే బాగుండేది" అనుకుంటోంది.

బాల్చీని నీళ్ళల్లో వేస్తూనే తలతిప్పి ఊరి వేపుకు చూసిన ఆమెకు.. తన బావి వేపుగా వస్తున్న ఇబ్రాయమ్ చోసూలో కనిపించాడు.

గబగబ నీళ్ళు తోడి.. ఆయన వచ్చేసరికి చిన్న డ్రమ్ము సగం వరకూ నింపేసింది. ఇబ్రాయమ్ రాగానే ఓ పాత్రలో నీళ్ళు తీసి ఆయన దోసిట్లో పోస్తూ, "ఏమిటి కబుర్లు? " అంటూ యథాలాపంగా అడిగినట్లు అడిగింది.

"వాళ్ళు మురాద్‌ను పట్టుకున్నారు. ఇదే ముఖ్యమైన కబురు" దాహం తీరాక తాపీగా జవాబు చెప్పాడాయన.

"అయ్యో! పట్టుబడ్డాడా? ఎప్పుడూ? అసలెక్కడ పట్టుకున్నారు? " ఆదుర్దాగా అడుగుతూనే బావిలోకి బక్కెట్‌ను

మెల్లగా దించటం మొదలుపెట్టింది.

"అక్కడ! హర్‌మన్ కోచౌసోలో.." దక్షిణం వేపుకు తన చెయ్యి చూపిస్తూ అన్నాడు. "ఇద్దరు సైనికులు వచ్చారు. అతణ్ణి సరిహద్దు అధికారి దగ్గరకు తీసుకు వెడుతున్నారు. నేను తొందరగా వెళ్ళాలి.. వస్తా!" అంటూ వెళ్ళిపోయాడాయన.

"పాపం! అతనికి కష్టకాలం వచ్చింది" మురాద్ గురించి జాలి పడుతూనే నూతి లోనుంచి బక్కెట్టును లాగి గట్టుమీద పెట్టి తాడును గిలక మీద పడేసింది.

మురాద్ సన్నగా, పొడ్డుగ్గా, బలిష్ఠంగా ఉంటాడు. పదిమందిలో ఉన్నా.. ప్రత్యే

**కొత్తగాలి...**

**అహంకారం**
**ఉప్పొంగే సంద్రం**
**అనురాగం**
**మందార మకరందం!**

– సి. కామేశ్వరరావు,
కాశీబుగ్గ

కంగా కనిపించే అందమైన కుర్రాడు. అతన్ని తన దగ్గర పనికి పెట్టుకున్నాడు జాలిల్.

ఇక ఆశీ- 'ఆ వయసులో ఉండవలసిన దానికన్నా పుష్టిగా, ఎవరినైనా ఇట్టే ఆకట్టు కునే రూపురేఖలతో నవనవలాడుతూ ఉంటుంది. ఆమెకు అంత అందమెం దుకూ?' జాలిల్‌గారమ్మాయి ఆశీని గురించి ఆ ప్రాంతంలోని యువకులు అనుకునే మాటలివి.

ఆ పిల్లను గురించి అలా అనుకునే వాళ్లే.. ఇప్పుడిప్పుడే యవ్వనంలోకి అడుగు పెడుతున్న ఆ అమ్మాయి దృష్టిలో పడా లనీ, ఆమెను ఆకర్షించాలనీ.. వాళ్ల ఇంటి చుట్టూ తిరగటం మొదలుపెట్టారు.

వాళ్లంతా తన తండ్రితో సమానమైన హోదా, ధనం ఉన్నవాళ్లే అయినా, వాళ్లలో ఏ ఒక్కర్నీ పట్టించుకోని ఆశీ, మురాద్ మీద మనసుపారేసుకుంది.

అతనితో అస్తమానం సరదాగా కబుర్లు చెబుతూ.. బురఖా లేకుండా నిస్సంకో చంగా అతని చుట్టూ తిరుగుతున్న కూతుర్ని చూసి జాలిల్‌గారు కంగారు పడిపోయాడు.

ఆ అమ్మాయిని ఆప్యాయంగా పిలిచి దగ్గర కూర్చోపెట్టుకుని, పరాయి మగాడి ముందు బురఖా లేకుండా అలా తిరగకూ డదనీ, అందుకు తమ మతం సమ్మతించ దనీ బుజ్జగించి చెప్పాడు జాలిల్.

"ఆశీ అభంశుభం తెలీని చిన్నపిల్ల! అది నీ యజమాని కూతురనే ఎరుకతో, ఒళ్ళు దగ్గరపెట్టుకుని మసలుకోకపోయావో.. ఖబడ్దార్!" అని హెచ్చరిస్తూనే, "ఇంట్లోను, ప్రాంగణంలోనూ.. నీ పనులు పూర్తి చేసు కున్నాక, అశ్వశాల మీదున్న గదిలోనే పడి ఉండు!" అంటూ మురాద్‌నూ కట్టడి చేశా డాయన.

కొన్నాళ్లు గమనించి చూసి.. తన ఆజ్ఞ అమలవుతున్నట్లే అనిపించడంతో జాలిల్ ఊపిరి పీల్చుకున్నాడు.

★ ★ ★

నిన్న ఉదయంవేళ మురాద్ ఆశీలిద్దరూ నవ్వుకుంటూ, తుళ్లుకుంటూ, పెరటి గోడ దగ్గర కబుర్లు చెప్పుకుంటున్న దృశ్యం, ఏదో పనిమీద అటుగా వెళ్లిన జాలిల్‌గారి కంటపడింది!

ఆ సమయంలో ఆశీ చున్నీ మురాద్ చేతిలో ఉంది! దాంతో అతడు ఆడుతూ ఏవో జోక్స్ వేస్తుంటే.. ఆమె దాన్ని అందుకోటానికి ప్రయత్నిస్తూ కిలకిలా నవ్వుతోంది.

కోపంతో గుండెలు మండిన జాలిల్‌గారు, చేతికందిన దుడ్డుకర్రతో తన నౌకర్ని చితకబాదబోతే.. ఒకటి రెండు

దెబ్బలు పడగానే అతడు తప్పించుకుని గోడ దూకి పారిపోయాడు!

మురాద్‌లాంటి ఆత్మాభిమానం గల వ్యక్తి అంత అవమానం భరించి ఊరుకో గలడా?

కాలుకాలిన పిల్లిలా ఆ చుట్టుపక్కల చేలల్లో పగలల్లా తిరిగాడు.

సాయంత్రం చీకట్లు ముసురుకునే వేళ.. వీధి వేపు ఉన్న కిటికిలో నుంచి, అతని యజమాని ఇంట్లోకి మంటలు వ్యాపించసాగాయి!

ఆ ఇంటికి ఎవరో అగ్గిపెట్టారని గ్రహిం చిన ఇరుగు పొరుగు జనమందరూ తలా బిందెడూ నీళ్లు తెచ్చి గబగబా మంటలను ఆర్పేశారు గనుక సరిపోయిందిగానీ, లేక పోతే ఇల్లు బుగ్గయిపోయేదే!

అంతటి అఘాయిత్యానికి పూనుకున్న ఆకతాయిలెవరా? అని వెతకబోయిన వాళ్లకి చేలకి అడ్డంపడి పారిపోతున్న మురాద్ కనిపించాడు!

అతడు అంత తొందరగా పట్టుబడ్డా డంటే నమ్మలేకపోతోంది లుప్తీ.

చూడ్డానికి సన్నగా ఉన్నా, అతను మంచి వస్తాదు. పట్టుకోబోతున్న వాళ్లను పడగొట్టి పారిపోగల చేవగలవాడు!

'దేలిఓమీన్ వేపు వెళ్లిపోయి, అదృశ్యమై పోయే అవకాశాన్ని అతనెందుకు జారవిడు చుకున్నట్టూ? ఎవరికంటా పడకుండా దాక్కునే ప్రయత్నం అసలతను చెయ్యలే దనిపిస్తోంది. ఎందుకనీ? ' అని తనను తాను ప్రశ్నించుకున్న లుప్తీకి 'ఆఁ! అదీ! ఆశీ నీలికళ్ళ సౌందర్యంలోని ఇంద్రజాలా నికి కట్టుబడ్డ అతడు.. పారిపోవటానికి ఇష్టంలేకనే ఆ పని చెయ్యలేదు' అనే సమా ధానం ఎప్పటికోగాని దొరికింది కాదు!

'ఇప్పుడు ఆ కెప్టెన్ ఎంత కఠినంగా వ్యవహరిస్తాడో!'.. అనుకుంటూనే మళ్లీ తన పనిలో పడిపోయింది ఆమె.

మధ్యమధ్యలో వచ్చే వాళ్ల బిందెలూ, కడవలూ నింపుతూ, నీళ్లు తాగటం కోసం మాత్రమే వచ్చినవాళ్ల దోసిళ్లు నింపుతూనే ద్రమ్ము కూడా నింపుకుని.. కాసేపు విశ్రాంతి తీసుకుందామని నూతి పళ్లెం మీద చతికిలపడిన లుప్తీకి, సమీపంలోని మద్యశాలలో నుంచి వస్తున్న ఇద్దరు సైని కులు కనిపించారు.

వాళ్లు తెల్లటి చొక్కాలు తొడుక్కున్నారు. చీలమండలకు తెల్లటి బెల్టుల్లాంటివి బిగించి కట్టుకున్నారు. వాళ్ల తుపాకులకు మొనలుదేలిన చాకులు బిగించి ఉన్నాయి. వారిద్దరి మధ్యనా ఉన్న మురాద్.. అలసి పోయినట్లుగా, ఓపిక లేనట్లుగా, అడుగులో అడుగువేస్తూ వస్తున్నాడు.

పట్టుబడిపోయాననే భయం.. ఆందో ళనా, అతని ముఖంలో మచ్చుకైనా కానరా వటం లేదు. పైగా ఏదో సాధించాలనే

**బల్గేరియా మూలం : యోర్డాన్ యోవ్‌కోఫ్**

---

**అనువాదం : సీతంరాజు పద్మావతి**

తపనతో ఉన్నట్లున్నాడు.

అతని ధ్యాస పరిసరాల మీద కాకుండా ఎక్కడో ఉన్నట్లుంది. ఓ పక్కన ఎండ మండిపోతుంటే.. అంత దళసరి ఉన్నిటో పీని భుజం మీద పెట్టుకుని మోస్తున్నాడెం దుకో?

'అతనికి నేనేం సహాయం చెయ్యగ లనూ? ' అని ఆలోచించిన లుప్తీ 'పోనీలే.. ముందు కాసిని మంచినీళ్లు తాగి సేదదీర తాడు' అనుకుంది.

వాళ్లు ముగ్గురూ బావి దగ్గరకు వచ్చారు. ముందుగా సైనికులిద్దరూ నీళ్లు తాగారు. తరవాత మురాద్‌ను చేతులు కడుక్కోమని.. ఆప్యాయంగా దోసిట్లో నీళ్ల

పోసింది. దాహం తీర్చుకున్నాక.. అతను బావి అంచుకు కట్టిన పిట్టగోడ దగ్గరే నిల బడిపోవటాన్ని గమనించి 'కాసేపు అక్కడ కూర్చోవాలనుకుంటున్నాడేమో! తిరిగి తిరిగి కాళ్లు నొప్పులు పుడుతున్నట్లున్నయ్!' అనుకుంది.

నీళ్లలో వేసిన పెద్దబాల్చీని జాగ్రత్తగా అంత లోతు నుంచి పైకి లాగి.. దానికి చోటు కల్పించటం కోసం నూతి పళ్లెం మీదకు ఒంగి.. ఒక చేత్తో డ్రమ్ముని పక్కకు జరిపే పనిలో నిమగ్నమవ టంతో.. పరిసరాలలో ఏం జరుగుతోందో చూడలేకపోయింది. అంతలోనే.. సైనికులి ద్దరూ కంగారుగా అరవటం మొదలెట్టారు.

ఉలిక్కిపడి నిలబడిన లుఫ్తీకి మురాద్ కనపడలేదు.

అతన్ని పేరు పెట్టి బిగ్గరగా పిలుస్తూ.. అరచి అరచి హైరాన పడిపోతున్నారు ఆ సైనికులు!

వాళ్లలో ఒకతను తన తుపాకిని పక్కన పెట్టి, బావిలోకి తొంగి చూడ్డం మొదలు పెట్టాడు.

రెండో సైనికుడు పరుగెత్తుకు వెళ్లి.. చుట్టుపక్కలున్న చెట్లచాటునా, పొదల మాటునా, ఇక్కడా అక్కడా వెతికి వచ్చి "ఎక్కడా లేడు. ఇంతలోనే ఎక్కడికి పోతాడూ? వాడు కచ్చితంగా ఈ బావి లోకి దూకి ఉంటాడు" అన్నాడు.

ఆ మాటలు విన్న లుఫ్తీ మళ్లీ ఉలిక్కిప డింది.

కాళ్లూ చేతులూ ఆడక.. చప్పున చప్టా మీద చతికిల పడింది.

మురాద్ యథాలాపంగా పిట్టగోడ మీద కూర్చుని, పొరపాటున జారి బావిలో పడి పోయాడా? లేక కావాలనే దూకేశాడా?

లుఫ్తీలాగానే ఆ కాపలా సైనికులిద్దరూ కూడా సరిగ్గా గమనించక పోవడటంతో, అసలు ఆ ఘటన ఎలా జరిగిందో? అక్కడే వున్నా, ఆ ముగ్గురిలో ఏ ఒక్కరూ కూడా చెప్పలేని పరిస్థితి నెలకొంది.

భయపడుతూనే.. తమ కెప్టెన్‌కు ఈ సమాచారాన్ని చేరవెయ్యటానికి బయల్దే రాడు ఒక సైనికుడు.

మరొకతను బావి దగ్గరే కాపలా వున్నాడు.

అంతలోనే ఆ వార్త.. గాలిలో ఎండు తాటాకు మంట వ్యాపించినట్లుగా ఊరూ వాడా వ్యాపించసాగింది.

అసలు ఆ కబురు.. మొట్టమొదట ఎవరు ఎవరికి జేరవేశారో? ఆ అల్లామి యాకే తెలియాలి!

నలువేపుల నుంచీ జనం ఉరుకులు పరుగులతో రాసాగారు.

స్త్రీలూ, పురుషులూ, బాలలూ, వృద్ధులూ, బల్గేరియన్లూ, టర్కీవారూ, తాతారీలూ, వీరూ వారనే తేడా లేకుండా ఊరు ఊరంతా తరలిరావటం మొదలైంది.

వాతావరణం బాగుండటంతో దోవలో ఎవరికీ ఏ ఇబ్బందీ కలగలేదు. ఆ సందడీ, ఆ గందరగోళం.. ఆ గడబిడా.. అదంతా చూస్తుంటే.. ఏదో తుపాను తాకి డికి ఇళ్ళు కూలిపోతున్నట్లూ.. వాటి పైక ప్పులు ఎగిరిపోతున్నట్లూ అనిపిస్తోంది లుఫ్తీకి!

రంగురంగుల, రకరకాల పక్షులు రెక్కలు టపటపలాడిస్తూ, బారులు బారు లుగా నింగిలో ఎగురుతూ.. రకరకాల ధ్వనులతో అరుస్తున్నట్లుగా.. ఆమె బావి పరిసరాలన్నీ సందడి సందడిగా మారిపో తున్నాయి.

బావి చుట్టూ గుంపులు గుంపులుగా పోగైన జనం, వాళ్ళల్లో వాళ్ళు ప్రశ్నలు వేసుకుంటూ, జవాబులు చెప్పుకుంటూ.. ఒకర్నొకరు కేకేసి పిలుచుకుని పలకరించు కుంటూ.. గందరగోళం సృష్టిస్తున్నారు.

బావి పిట్టగోడ ఇప్పుడసలు కనిపించటం లేదు. దాని చుట్టూ మూగి, ఒంగి ఒంగి చూస్తున్న మనుషుల తలలు మాత్రమే

## బృందావన వితంతువులకు ఊరట!



**బృం**దావనంలోని వితంతువుల దుస్థితిని కరుణార్ద్రభరితంగా చిత్రించిన, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత **ఇందిరా గోస్వామి** అస్సామీ నవల **కన్నయ్యవాడలో క్రీనీడలు** జనవరి 2015 చతురలో ప్రచురితమైన సంగతి పాఠకులకు విదితమే. అక్కడ తీవ్ర నిర్లక్ష్యానికి, అణచివేతకు గురవుతున్న వితంతువుల దయనీయ స్థితిని రచయిత్రి స్వయంగా పరిశీలించి, ఈ నవలలో అక్షరీకరించారు. మార్చి 8న **అంతర్జాతీయ మహిళా దినోత్సవం** సందర్భంగా బృందావనంలోని వితంతువులకు అరుదైన అవకాశం కల్పించారు. తాజ్‌మహల్, ఆగ్రా కోటల సందర్శనార్థం ఆ అభాగినులకు ఆర్కియాలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, సులభ్ ఇంటర్నేషనల్ సంస్థలు ఓ విహారయాత్రను ఏర్పాటు చేశాయి. బాధితులు తరతరాలుగా తీవ్ర వివక్షకు గురవుతున్నారనీ, శుభ కార్యాల్లో నేటికీ వారిని అనుమతించడం లేదనీ, వారిని జన జీవన స్రవంతిలోకి తెచ్చేందుకు ఇలాంటివి దోహదం చేస్తాయని నిర్వాహకులు తెలిపారు.

కనిపిస్తున్నాయి.

మురాద్ తన బావిలో పడ్డాడని తెలిసినప్పటి నుంచీ విచారంలో మునిగిపోయిన లుఫ్తీకి.. ఎప్పటికప్పుడు అప్పుడే అక్కడికి వచ్చిన వాళ్ళు అడిగే ప్రశ్నలకు సమాధానాలు చెప్పలేక బేజారుగా వుంది.

వచ్చిన వాళ్ళంతా బావిలోకి తొంగి చూడాలని తాపత్రయపడుతూ ఒకర్నొకరు తోసుకుంటున్నారు కానీ.. వాళ్ళ మొహం! వాళ్ళకక్కడ ఏం కనపడుతుందీ?

బావి తవ్వటం పూర్తయ్యాక, మట్టి నిలవటం కోసం కట్టిన రాతిగోడ మొట్టమొదట కనిపించింది. ఇంకా కిందకి.. బాగా కిందకి చూస్తే.. వలయాకారంలో ఆ నూతిని ఆవరించుకుని వున్న నీళ్ళు, మెరుస్తున్న నాణెంలా... ఓ నీటి అచ్చులా కనపడతాయి, అంతే!

ఇంతకీ కష్టపడి బావిలోకి తొంగి చూసిన వాళ్ళెవరికీ అందులో మురాద్ ఛాయ కూడా కనిపించలేదు.

దాంతో వాళ్ళంతా చాలా సేపు గొడవ గొడవగా మాట్లాడుకున్నారు. తర్కవితర్కాలు చేసుకున్నారు. చివరికి అందరూ నోళ్ళు మూసుకున్నారు! పాపం! వాళ్ళు మటుకూ అంతకన్నా ఏం చెయ్యగలరూ?

ఏదన్నా క్రియ జరగాలంటే ముందుగా కెప్టెన్ రావాలి. ఆయన వచ్చి కారాహసన్‌ను పిలిపించాలి.

ఏ రకం బావి అయినా, అది ఎంత లోతున్నా, అందులో దిగి పూడిక తీసి శుభ్రం చెయ్యగల మనిషి అతడు! అదే అతడి వృత్తి! ఆ వృత్తిలో నైపుణ్యం పొందిన అతడు, ఆ పని మీద ఎవరు పిలిచినా, ఎక్కడికి పిలిచినా వెడుతూవుంటాడు.

ఇప్పుడు అతడ్ని పిలిపించక తప్పదు మరి! అతనొస్తే, ఏదో ఒక ఉపాయంతో మురాద్‌ను పైకి లాగుతాడు. అక్కడందరూ ఆ మాటే అనుకుంటున్నారు.

★ ★ ★

అంతమందితో వాగి వాగి అలసిపోయిన లుఫ్తీ, 'ఇప్పుడిక ఏం కాబోతోందీ?'

అనే ఆలోచనలో పడింది.

'ఒకవేళ మురాద్ బావిలో మునిగి చని పోయి వుంటే.. ఇక ఈ నీళ్ళు తాగరె వరూ! నిజంగా అతను చనిపోయి వుంటాడా? తన బావి కూడా పాడుపడి పోతుందా?' అనే దిగులుతో అక్కడకు కాస్త దూరంలో వున్న రెండు బావులవేపు దృష్టి సారించిందామె.

వాటి నీళ్ళు కటిక ఉప్పునీళ్ళు కావటం తోనో.. మరెందుకనో ఆ రెండు బావులూ పాడుపడిపోయాయి.

మానవమాత్రులెవరూ వాటి సమీపానికి కూడా వెళ్ళరు. వాటి గోడల నెర్రల్లో రక రకాల పక్షులు గూళ్ళు పెట్టుకుని వుంటు న్నయ్. ఆ బావుల చుట్టూ గుర్రాలూ, బర్రెలూ పడి దొర్లుతూ వుంటాయి. అక్క డ భూమి కూడా ఎండి పగుళ్ళుబారిపో యింది.

'పిట్టగోడ మీద నుంచి అంత లోతున్న బావిలో పడినవాడు అందులో మునిగి చావకుండా వుంటాడా?' అని ఆలోచి స్తున్న ఆమెకు.. తన సమీపంలో నిలబడి మాట్లాడుకుంటున్న కొందరి సంభాషణ వినిపించసాగింది.

"అతను బతికే వుంటాడని నేనంటు న్నాను!" అన్నాడు బాసిల్.

బాసిల్ అంటే అతనే.. నక్షత్రాల వంక చూస్తూ.. మాట్లాడుతున్నట్లుంటాడే.. ఆ బాసిల్!

అతడి మాటలు వినగానే? "చెప్పు బాసిల్! చెప్పూ! అదెలా సంభవం?" ఉత్సుకతతో అడిగాడు వృద్ధుడైన విచో.

"నేను చెబుతున్నాను కదా! అతను బతికే వుంటాడు" నక్షత్రాల వంక చూస్తూ.. ఇంతకుముందు చెప్పిన మాట లనే బాసిల్ మళ్ళీ చెప్పాడు.

అతడు పొట్టిగా, లావుగా వుంటాడు. తెల్లటి జుట్టూ.. ఎర్రటి ముఖం. ఒక కంట్లో పువ్వువేసి.. చూపు బాగా మంద గించటంతో కాస్త బాగున్న కంటితోనే చూడాలనే ప్రయత్నంతో, పువ్వు వేసిన కంటిని ఓ చేత్తో మూసి, తల పైకెత్తి అల వాటు ప్రకారం తలని ఓ పక్కకి వంచి చూస్తాడు.

దాంతో అతను ఆకాశంలోని నక్షత్రాల వంక చూస్తున్నట్లుగా అనిపిస్తోంది. అందుకనే అతనికి 'తారా తాక్'.. అంటే నక్షత్రాలను తీక్షణంగా, తదేకంగా చూసే వాడు' అనే పేరుపడిపోయింది.

'తారాతాక్!' అనే పిలుస్తున్నారందరూ!

"చూడు విచోదాదా! కాసఫ్ ఉస్మాన్‌గార బ్బాయి బావిలో పడ్డప్పుడు ఏమయిందే? పడగానే వాడు చచ్చిపోయాడా ఏం? అలాంటిదేం జరగలేదు గదా! నలుగురూ కలిసి బయటకు తియ్యగానే.. తన తండ్రి చావబాదుతాడనే భయంతో కాలికి బుద్ధి చెప్పలేదూ?" గతంలో జరిగిన సంఘట నను గుర్తు చేస్తూ అన్నాడు తారాతాక్.

"అదెలా సాధ్యం? చెప్పు తారాతాక్! తొందరగా చెప్పు! మనిషి కూడా రాయి లాంటి వాడే కదా! నీళ్ళల్లో పడిన రాయి మునిగిపోదూ? అలాగే బావిలో దూకిన మనిషి ఆ నీళ్ళల్లో మునిగి చావడూ?

"ఊహూ! ఇంతకు ముందు నేనెవరి గురించి చెప్పానో.. ఆ పిల్లాడు ఇప్పుడు కూడా మన కళ్ళ ముందే శుభ్రంగా తిని తిరగటంలేదూ?"

"అవుననుకో! అయితే.. నూతిలో దూకి నవాళ్ళందరూ బతికి బట్టకడతారం టావా?"

"నూటికి నూరు శాతం కాకపోయినా.. ఎక్కువమంది చచ్చిపోరని గ్యారంటీగా చెప్పగలను. అలా బతికిన వాళ్ళని చాలా మందిని చూశాను నేను"

"అదే.. ఎట్టా బతగ్గలరనే అడుగు తున్నాం"

"నూతిలోని గాలి బరువుగా ఉండటంతో మనిషిని నిలబెట్టి ఉంచుతుంది. కాసఫ్

ఉస్మాన్‌గారబ్బాయి బావిలో దూకినప్పుడు అతని ఒంటికి, ఇంట్లో తయారుచేసిన ఊలు ప్యాంటు వుంది. అతడు నూతిలో పడుతున్నప్పుడు ఆ ప్యాంటు గాలితో నిండిపోయి.. ఏదో అదృశ్య హస్తం చెయ్యి పట్టుకు దింపుతున్నట్లుగా అతడు మెల్లమెల్లగా కిందకు జారాడు.

మురాద్ సంగతీ అంతే! అతడు కూడా బావిలో పడ్డప్పుడు ఉన్ని టోపీని ఓ చేతికి అతికించి ఇంట్లోనే అల్లిన ఉన్ని బనీను తొడుక్కుని ఉన్నాడని ఎవరో చెప్పారు. అందుకనే అతను చనిపోలేదని ధీమాగా చెబుతున్నాను"

"పోనీలే..! అతడు బతికి వుంటే అదే పదివేలు! నా బావి పాడుపడకుండా పది మందికీ ఉపయోగపడుతుంది" దీర్ఘంగా నిట్టూర్పు విడుస్తూ ఓసారి ఉప్పునీళ్ల బావుల వంక చూసింది లుఫ్తీ.

అక్కడ పావురాలూ, అబాబిల్ పక్షులూ కాసేపు వాలుతూ, కాసేపు ఎగురుతూ కనిపించాయి.

"అక్కడ కరాచీలో.." అంటూ మరో కథనాన్ని వినిపించటానికి ఉద్యుక్తుడయ్యాడు తారాతాక్.

"ఊc! కరాచీలో ఏం జరిగిందో? చెప్పు! చెప్పు!!" అంటూ.. అక్కడ ఉన్నవాళ్ళకి తోడు మరికొంతమంది అతడి చుట్టూ మూగారు.

"అక్కడ ఓ పిచ్చాడున్నాడు. వాడి పేరు పేపో. పిచ్చిముదిరినప్పుడల్లా బావి దగ్గరకు వెళ్ళి అందులో దూకేస్తాడు వాడు"

"అయ్యో!" అంటూ ముక్తకంఠంతో సానుభూతి తెలియజేస్తూ అరిచారు అందరూ.

"దూకగానే అందులోంచి ఓ డబ్బాలాంటిదేదో తీసి.. దాన్ని నీళ్ళతో నింపి, గోధుమల్లాంటివి ఏవో తూస్తున్నట్లుగా యాక్షన్ చేస్తాడు. కాసేపాగి ఆ నీళ్ళను నూతిలో వంపేస్తాడు. మళ్ళీ నింపీ.. మళ్ళీ వంపీ, చేసిన పనినే మళ్ళీమళ్ళీ చేస్తూ, ఆ నీళ్ళతో ఆడుకుంటూ వుంటాడు"

తారాతాక్ అభినయస్తూ చెప్పటం చూసీ.. వినీ.. అక్కడ వున్న వాళ్ళంతా పడిపడీ నవ్వారు.

"ఆ తరవాత? చెప్పు బాసిల్ చెప్పు! త్వరగా చెప్పు!!" విచోదాదాతోపాటు ఇంకెవరో కూడా అడిగారు.

"ఏముందీ? నూతిలో దిగటం చేతనైన వాళ్ళను పిలిపించి.. ఆ పిచ్చి పేపోను పైకి లాగిస్తారు. వాడికేంకాదు. బాగానే వుంటాడు. ఇప్పటికీ దుక్కలాగే వున్నాడు"

"మురాద్‌కు కూడా ఏమీ కాకుండా ఉంటే..?" అనుకుంటూనే.. కెప్టెన్

> **కొత్తగాలి...**
>
> **'స్వచ్ఛ భారత్'కి**
> **స్విచ్ అవసరమా?**
> **ఆన్ ఆఫ్ కాకుండా**
> **శ్రమించండి నిరంతరం**
>
> – నల్లపాటి సురేంద్ర,
> పెదగంట్యాడ, విశాఖ జిల్లా

హాకిమ్ రావటం గమనించి లేచి నిలబడింది లుఫ్తీ. ఆమెను చూసి.. మిగతా వాళ్ళు కూడా లేచి నిలబడ్డారు.

అటు సరిహద్దు వేపు నుంచి కెప్టెన్ వస్తుండగానే.. ఇటు గ్రామం వేపు నించి ఓ వృద్ధమహిళ ఏడుస్తూ.. దీర్ఘాలు తీస్తూ రావటం కనిపించింది.

ఇద్దరు స్త్రీలు ఆమెకు ఇరువేపులా కాపలావాళ్ళలాగా నడుస్తున్నారు. ఆమె మురాద్ తల్లి. కెప్టెన్ కన్నా ముందే అక్కడికి చేరుకున్న ఆ వృద్ధురాలు, "అయ్యో నా కొడుకా మురాద్! నేనూ నీతో వచ్చేస్తాన్రా మురాద్!" అని లయబద్ధంగా రాగాలు తీస్తూ... బావి దగ్గరకు పరుగెత్తుతోంది.



ఆ దీర్ఘాలు ఆమె ఏడుస్తున్నట్లుగా కాక, పాట పాడుతున్నట్లుగా వినవస్తున్నయ్! ఆమె పక్కనున్న స్త్రీలు గట్టిగా పట్టుకుని ఆమెను ఆపటానికి ప్రయత్నిస్తున్నారు.

"వదలండి! నన్ను వదలండి!! ఓరి! నా కొడుకా! మురాద్!! అయ్యో.. నాయనా.. మురాద్!" అంటూ దీర్ఘాలు తీస్తూ.. ఇంకా ఇంకా శ్రుతిని పెంచుతూ, తను కూడా బావిలో దూకి ఛనిపోవాలనుకుంటున్నట్లుగా.. బావి వరకూ వెళ్లినట్లుగా వెళ్లి, మళ్ళీ వెనక్కి వచ్చేస్తోంది.

ఆ రాగాలను వినీ, ఆ చేష్టలను చూసీ.. కొందరు బిగ్గరగా నవ్వసాగారు.

"తప్పు! అలా నవ్వకూడదు! ఆ ముసలావిడ కష్టంలో ఉంది పాపం!" అని మందలిస్తున్నారు వృద్ధులు.

అప్పుడే అక్కడికి చేరుకున్న కెప్టెన్, "సైలెన్స్!" అంటూ ఆజ్ఞాపించటంతో అందరి నోళ్ళూ మూతపడ్డాయి.

కబురు అందగానే వచ్చి వాలాడు కారా. హసన్. వెంటనే అతన్ని బావిలోకి దిగి, మురాద్‌ను పైకి లాగమని ఆజ్ఞాపించాడు కెప్టెన్ హకీమ్.

బాగా లావుగా పొడుగ్గా ఉన్న ఒక మోకును కారా నడుం మీదుగా కాళ్ల వరకూ బిగించి కట్టారు. అతని పైజామా కింద భాగాన్ని మోకాళ్ల వరకు మడిచి పెట్టారు. పదిమంది బలిష్ఠమైన మను



షులు తాడు పై భాగాన్ని పట్టుకుని, నెమ్మది నెమ్మదిగా కారాను బావిలోకి దింపారు.

బావిలోతుకు మించి పొడవున్న ఆ తాడు.. నీళ్లలోకి వెళ్లగలిగినంత వరకూ వెళ్లింది.

కారాహసన్ ఇప్పుడు నీళ్లలో ఉన్నాడు.

అందరూ ఉత్కంఠతో ఎదురుచూడసాగారు. ఆ ఉత్కంఠతోనే చాలా సమయం గడిచిపోయింది. మాములుగా ఆ పనికి పట్టవలసిన సమయం కన్నా ఎక్కువ సమయమే పడుతోందంటున్నారు అనుభవజ్ఞులు.

చాలాసేపు అందరూ నిరీక్షణతో గడిపాక.. లావు మోకుకు సమాంతరంగా వేళ్లాడదీసిన సన్నని తాడు సంకేత సూచకంగా కదలసాగింది. అంటే.. నీళ్లలో ఉన్న వ్యక్తి తనను పైకి లాగమంటున్నాడని అర్థం.

జమాజట్టీల్లాంటి మనుషులు కొందరు పెద్దమోకును బావి గిలక మీదుగా పైకి లాగటం మొదలు పెట్టి.. కొంతసేపటికి కారాను పైకి చేర్చారు.

అతని శరీరం ఆకుపచ్చరంగులో ఉంది. ఎందుకనీ? అతని ముఖమంతా.. ఎవరో గిచ్చినట్లూ, రక్కినట్లు గాయాలతో నిండిపోయి, వాటి నుంచి రక్తం స్రవిస్తోంది.

"మురాద్ ఏడీ? అతన్ని పైకిలాగలేదెం దుకనీ? " అడిగాడు కెప్టెన్.

"ముందు నన్ను నూతిమీద నుంచి దించి నేలమీద పడుకోపెట్టండి" అతికష్టం మీద మాటలు కూడగట్టుకుంటూ అన్నాడ తను.

బావిపైకి చేర్చిన వాళ్లే, అతన్ని నేల మీద పడుకోబెట్టారు.

వెంటనే జనం అతడి చుట్టూ మూగటం మొదలుపెట్టారు.

కెప్టెన్ వాళ్లందర్నీ దూరంగా జరిపి, కారాకు ప్రథమ చికిత్స చెయ్యమని ఆజ్ఞా పించాడు.

తెలిసిన వాళ్లు కొందరు ముందుకు వచ్చి ఆ పని చెయ్యసాగారు.

అతి కష్టంమీద గాలి పీల్చి వదులు తున్నాడు. తెరిచి ఉన్న కళ్లు భయంక రంగా ఉన్నాయి.

"అసలేం జరిగిందీ? ఎందుకలా ఉన్నావ్? ఇంతకీ వాడు బావిలో ఉన్నట్టా? లేనట్టా? "

"నిక్షేపంలాగ ఉన్నాడు"

"మరి? "

"మీదకు రావటం వాడికి ఇష్టం లేదు. నేను తనను పైకి లాగటానికి ప్రయత్ని స్తున్న కొద్దీ, వాడు నన్ను నీళ్లల్లో ముంచే ద్దామని చూశాడు. తన బలమంతా ఉప యోగించి నన్ను తోసేస్తూ, నా ముఖం మీద గిల్లుతూ, రక్కుతూ.. నా కళ్ళు కూడా పెరికెయ్యాలని చూశాడు. నేను ఎదురు తిరిగితే, నన్ను నీళ్లల్లో ముంచె య్యబోయాడు" రుద్ధకంఠంతో అన్నాడు కారా. 'కన్నీళ్లు కార్చటమే తరువాయి' అన్న ట్లుంది అతని పరిస్థితి.

"ఊరుకో కారా! ఊరుకో!! పోనీలే, నువ్వు క్షేమంగా బయటపడ్డావ్..! అంతా అల్లాదయ అనుకో!" అంటూ అతన్ని ఓదా ర్చసాగారు కొందరు.

మరికొందరు అతడి దగ్గరకు వచ్చి ఒళ్లు నిమురుతూ సానుభూతి తెలియజెయ్యసా గారు.

"నూతిలో పడ్డవాడు బతికున్నందుకు సంతోషిస్తూ.. పైకి లాగడానికి వచ్చిన వాడికి చెయ్యందించి సహకరించాల్సింది పోయి, ఎదురుదాడి చేస్తాడా? ఉపకారం చెయ్య వచ్చిన వాడి మీద దౌర్జన్యానికి దిగుతాడా? ఏం మనిషండీ వాడూ? అసలు వాడు మనిషేనా? " అని కోపగిం చుకుంటూనే.. మురాద్ అలా ప్రవర్తించ టానికి గల కారణాలను గురించి చర్చించు కోవటం మొదలుపెట్టారు జనం.

ఎన్ని నోళ్ళో, అన్ని మాటలు!

చివరికి "వాడు మూర్ఖంగా రానంటే మాత్రం ఇక్కడ ఇంత మందిమి ఉండి వాణ్ణి అలా వదిలేసి వూరుకుంటామా? ఏ దో ఒక ఉపాయంతో వాణ్ణి పైకిలాగాలి" అని అందరూ కలిసి తీర్మానం పాస్ చేశారు.

ఇక అతన్ని పైకి రప్పించటానికి ఎవరికి వాళ్లు తమ వంతు కృషి చెయ్యటం మొద లుపెట్టారు.

కంఠస్వరం పెద్దదిగా ఉన్నవాళ్లు పిట్ట గోడ మీదగా నూతిలోకి వంగి, అతడ్ని పైకి రారమ్మని బతిమాలారు.

శిక్ష గురించి భయపడవద్దనీ, బుద్ధిగా పైకి వచ్చి, కెప్టెన్ ముందు లొంగిపోతే శిక్ష తగ్గుతుందనీ నచ్చజెప్పటానికి ప్రయ

**కొత్తగాలి...**

**వసంతం**
**తొడుగుతోంది**
**కొత్త సొగసుల్ని**
**చెట్లకు**

– వియం కృష్ణ,
ఇ.సి.ఐ.ఎల్, హైదరాబాద్

త్నించారు.

"పాపం కుర్రాడు! తెలిసో? తెలీకో? నూతిలో పడ్డాడు. ఇక్కడ మీరున్నారని పైకి రావటానికి భయపడుతున్నట్లు న్నాడు. ఎలాగో ఒకలాగ మనమే పైకి రప్పించాలి గానీ.. అట్టా నీళ్లలో ఎట్టా వదిలేస్తాం?

ఈసారి కారా చేతికి ఓ బెత్తం ఇచ్చి, అతణ్ణే బతిమాలి మళ్లీ నూతిలో దింపండి. మురాద్ రానని మొరాయిస్తే.. బెత్తంతో చితకబాదుతూ పైకి తీసుకురమ్మ నండి" అని కెప్టెన్‌కు సలహా ఇచ్చారు కొందరు ఊరిపెద్దలు.

అది విని కారాకు నచ్చజెప్పే ప్రయ త్నంలో పడ్డాడాయన.

"అసలీ గొడవతో నాకేం సంబంధం? వేరే ఎవరికైనా ఇష్టమైతే వెళ్లమనండి" అని భీష్మించుకు కూర్చున్నాడతడు.

కెప్టెన్ మళ్లీ నచ్చజెప్పబోతే.. "వాడు నీళ్లలో ఉన్నా, నేల మీద ఉన్నా నాకు వచ్చేదీ పోయేదీ ఏమీలేదు. వాడికి నూతిలో ఉండటం ఇష్టమైతే పోనీ అక్కడే ఉండనివ్వండి! తగుదునయ్యా అను కుంటూ మళ్లీ అంతలోతు నూతిలోకి దిగి, అక్కడ వాడితో బాహాబాహీకి దిగే స్థితిలో ఇప్పుడు నేను లేను" అని కరాఖండీగా చెప్పేశాడు కారా.

బతిమాలినా.. బెదిరించినా.. మళ్లీ నూతిలో దిగటానికి కారా సమ్మతించకపో వడంతో.. కాసేపు ఆలోచించి ఓ అద్దం తెప్పించాడు కెప్టెన్.

దానిద్వారా సూర్య కిరణాలను లోపలకు పంపించి, కనీసం ఒక్క క్షణమన్నా మురాద్ ముఖం చూడాలనుకున్నాడు. అతడు ఏ స్థితిలో ఉన్నాడో తెలుసుకోవా లిగా..! అది అతని డ్యూటీ.

అయితే అద్దం ద్వారా సూర్యకిరణాలను కొంత లోతు వరకే ప్రసరింపజేసి చూడగ లిగాడు. ఆ కింద అంతా చీకటే చీకటి!

ఏం చెయ్యాలో తోచక దిక్కులు చూస్తూ నిలబడిపోయాడాయన!

పెద్దలందరూ ఆలోచిస్తూ తలలు పట్టుకు కూర్చుంటే.. పిల్లలందరూ అల్లరి చేస్తూ.. అటూ ఇటూ పరుగులు పెడుతూ, నూతి చుట్టూ గెంతుతూ ఆడు కుంటున్నారు.

అంతలో.. ఎవరు సలహా ఇచ్చారో? ఏమో..? అంతకు ముందు దూరంగా తరిమేసిన మురాద్ తల్లిని, మళ్లీ బావి దగ్గరకు పిలిపించి కొడుకును పిలవమ న్నాడు.

ఆ ముసలావిడకు ఈ గొడవంతా అర్థ మైందో? లేదో? కానీ.. ముక్కుతూ మూలుగుతూ నూతి పళ్లెం మీద నుంచుని, కళ్లనిండా నీళ్ళు నింపుకుని.. "మురాద్! మురాద్!!" అంటూ అరుస్తూ.. కేకలు వేస్తూ పిలిచింది.

బదులు రాకపోవడంతో.. తనే నూతి లోకి దూకటానికి ఈసారి గట్టి ప్రయ త్నమే చెయ్యబోయింది.

ఆవిడ పక్కపక్కన ఉండే ఇద్దరు స్త్రీలతో పాటు మరికొందరు పురుషులు కూడా ఆవిణ్ణి మరింత గట్టిగా పట్టుకుని అవత లకు లాక్కెళ్లారు.

ఏం చెయ్యాలో తోచక అందరూ ఆందో ళన చెందుతూ ఉండగా, విరిసిన కొమ్మలా.. వెన్నెల రెమ్మలా.. అల్లనమె

## కొత్తగాలి...

**చుక్కలు పెట్టారు**
**ముగ్గులు మరిచారు**
**ఆకాశ వీధిలో..**

– శంకర,
ఆచంట, ప.గో. జిల్లా

ల్లన హంస నడకలతో గ్రామం వైపు నుంచి వస్తున్న ఓ యువతి కనిపించింది.

ఆ ఆకారాన్ని బట్టీ.. ఆ నడక తీరును బట్టీ 'ఆమె ఇప్పుడిప్పుడే యవ్వనంలోకి అడుగుపెట్టిన ఆడపిల్ల..' అని అంచనా వే సుకున్నారే గానీ, వాస్తవానికి ఆమె రూపం ఎవరికీ కనపడటం లేదు. కారణం? ఆమె ఆపాదమస్తకం బురఖాతో కప్పి ఉంది!

ఆమె రాక జనంలో కలకలం రేపింది.

"ఆశీ! ఆశీ! అవును! ఆ అమ్మాయి ఆశీయే!!" అని గుసగుసలు వినవచ్చాయి.

ఆమె బావికి కాస్త దూరం వరకూ వచ్చి నిలిచిపోయింది.

> **కొత్తగాలి...**
>
> **కులమేల? మతమేల?**
> **తరచి చూడ కళ్ళు తెరచి చూడ!**
> **కులగోత్రాలు మలమూత్రాలు**
> **విసర్జించుట విజ్ఞత కాదా!**
>
> – కూకట్లపల్లి పోలయ్య,
> హైదరాబాద్

"ఎవరా అమ్మాయ్? ఏం కావాలిట? " జనాంతికంగా అడిగాడు కెప్టెన్.

తారాతాక్ ఆమె దగ్గరకు వెళ్లి.. చొరవ తీసుకుని మంతనాలు జరిపాడు.

తిరిగి వచ్చి "ఆమె మురాద్‌ను పైకి రప్పిస్తుందిట!" అన్నాడు.

"అదెలా! మనం ఇంతమందిమి చెయ్య లేని పని ఆ పిల్ల ఎలా చేస్తుందిటా? ఆమె ప్లాన్ ఏమిటీ? " అడిగాడు కెప్టెన్.

ఆయనకు బాగా దగ్గరగా వెళ్లి ఆశీని గురించి తను విన్నవన్నీ ఆయన చెవిలో గుసగుసలాడుతూ చెప్పాడు తారాతాక్.

నిండా నీళ్లలో మునిగి ఉన్నవాణ్ణి ఎలాగోలా పైకి రప్పించటం కెప్టెన్ తక్షణ కర్తవ్యం గదా!

ముందు వాడు ఆ నూతిని వదిలి నేల మీదకు వస్తే.. తరువాత సంగతి తరవాత చూసుకోవచ్చనుకుంటూ.. స్వయంగా రంగంలోకి దిగి, నూతి దగ్గరకు వెళ్ళే దోవ లోనూ.. నూతి పళ్లెంమీద ఉన్నవాళ్లంద రినీ చెల్లాచెదరు చేసి, తను కూడాఉండి ఆశీని బావి పిట్టగోడ వరకూ తీసికెళ్లాడు.

ఎవ్వరూ బిగ్గరగా మాట్లాడకూడదనీ.. అందరూ నిశ్శబ్దంగా ఉండాలనీ జనాన్ని గద్దించి ఆజ్ఞాపించాడు. చీమ చిటుక్కు మన్నా వినిపించేట్లుగా ఉండాలన్నాడు!

నూతి పళ్లెం మీద నిలబడి నలుది క్కులా పరిశీలించి చూసింది ఆ పిల్ల.

ఇంకా దాపరికం ఎందుకనుకుందో? ఏమో..? బురఖా తీసేసి చప్టామీద ఓ పక్కగా పడేసింది.

ఆమెను ఎన్నడూ చూడని జనమంతా కళ్లు విప్పార్చుకుని చూడసాగారు. ఆమె నిజంగా చూడచక్కని చుక్క! చూపులు మరల్చుకోనివ్వని అందం! తెల్లని పాలరాతి బొమ్మలా.. చెక్కిన శిల్పంలా వుంది!

పొందికగా దువ్వి.. అందంగా అలం కరించిన జుట్టు, నల్లగా నిగనిగలాడటం లేదు, ఎర్రగా రాగి రంగులో ఉంది. ఆ నీలికళ్ల సౌందర్యం చూపరులను మంత్ర ముగ్ధుల్ని చేస్తోంది.

"అవును..! ఆ పిల్లే ఆశీ! జాలిల్‌గారి గారాలపట్టి!" అని అందరూ గుసగుసలా డుకోసాగారు.

ఆ గుసగుసలు విని తల పైకెత్తి చూసిన లుఫ్తీ, 'అవును! అందానికి అందంలా ఉన్న ఆ యువతి ఆశీయే! బంధనాలన్నింటినీ తెంచుకుని, కట్టుబా ట్లను కాలదన్ని.. తన ప్రియుని కోసం ప్రజల్లోకి వచ్చేసింది' అనుకుంది.

నూతి గిలక పక్కనున్న ఓ వాసాన్ని పట్టుకుని, మునివేళ్లమీద నిలబడి తన శరీ రాన్ని సాగదీస్తూ.. సాధ్యమైనంత కిందకు వంగి బావిలోకి చూసింది ఆశీ.

# ఓహో గులాబి బాలా!

గులాబీ పువ్వుకి సంబంధించిన కొన్ని అపురూప సంగతులు చూడండి...

★ అమెరికాలో అధికంగా అమ్ముడయ్యే పువ్వు, అక్కడివారు అధికంగా ఇష్టపడే పువ్వు గులాబీనే. వీటిలో వంద రకాలు ఉన్నాయి.

★ గులాబీ పుట్టిల్లు అమెరికా. 1492లో కొలంబస్‌కి దగ్గర్లో భూమి ఉంది అని తెలియజేస్తూ సముద్రపు నీటిలో కనిపించింది గులాబీ కాడేనట.

★ ప్రపంచంలోని అతిపెద్ద గులాబీ మొక్క ఆరిజోనాలోని టోంబ్‌స్టోన్ అనే ఊళ్లో ఉంది. 8వేల చదరపు అడుగుల మేర విస్తరించిన దా ని నీడలో 300 మంది కూర్చోవచ్చు. దాని కాండం చుట్టుకొలత 8 అడుగులట.

★ న్యూయార్క్ (తూర్పు) నించి కేలిఫోర్నియా (పశ్చిమం)కి వలస వెళ్ళిన వారు దారి చూపడానికి పసుపు పచ్చ గులాబీ మొక్కలని నాటుకుంటూ వెళ్ళారు.

★ గులాబీ రేకులు వాడి, పడిపోయాక మిగిలే తొడిమెలో విటమిన్ సి, ఆరెంజ్ పండులో కంటే ఇరవై రెట్లు అధికంగా ఉంటుంది.

★ కొలరెడోలో 3 కోట్ల 50 సంవత్సరాల క్రితమే గులాబీ మొక్కలు ఉండేవి.

★ అమెరికాలో వెయ్యి డాలర్లు చెల్లించి ఓ కొత్త గులాబీ జాతిని సృష్టిస్తే మీ పేరు పెడతారు. అలా ఎలిజబెత్ టేలర్, బెట్టీ ఫోర్డ్, డాలీపార్టన్, బింగ్ క్రాస్ బీ పేర్ల మీద గులాబీ మొక్కలున్నాయి.

★ ఈజిప్ట్‌లో ఇది పవిత్రమైన పుష్పం. దేవుళ్ళకి సమాధిరాళ్ల మీద ఉంచడానికి మాత్రమే అక్కడ వీటిని ఉపయోగిస్తారు.

★ ప్రపంచంలోని ప్రతిదేశంలో గులాబీ మొక్కలున్నాయి. రోజ్ అంటే గులాబి అని ఆ దేశాల్లోని అందరికీ తెలుసు.

★ గులాబీలని అధికంగా ఎగుమతి చేసే దేశం నెదర్లాండ్స్.0

★ నల్ల గులాబీలు అంటూ ఉండవు. ముదురు ఎరుపే నల్లగా కనిపిస్తుంది. గులాబీ అన్ని రంగుల్లో పూస్తుంది.





అలా చూస్తూనే తన శరీరంలోని బలాన్నంతా గొంతులోకి తెచ్చుకుని, "మురాద్! పైకి రా! నేను ఆశీని పిలుస్తున్నాను! ఆశీ! ఆశీ!!" అని అరుస్తూ పిలిచి, మామూలుగా నిలబడింది.

ఆ పిలుపు నూతిలో ప్రతిధ్వనించింది.

ఏ సంకేతమూ లేకుండానే కొన్ని నిమిషాలు దొర్లిపోయాయి.

ఆశీ మళ్లీ నూతులోకి వంగి, "మురాద్! నా పిలుపు వినిపించటంలేదూ! నేను ఆశీని..! నిజంగానే ఆశీని పిలుస్తున్నాను. ఇలా గంటలు గంటలు నీళ్లల్లో నానటం ఒంటికి మంచిది కాదు. నేను ఆశీనే! నిజంగా ఆశీనే!! బెట్టు చాలు గానీ.. ఇక పైకి రావోయ్! ఆశీనే రమ్మంటున్నాను. నా కోసం వచ్చెయ్యి! త్వరగా.. త్వరత్వరగా పైకి వచ్చేసెయ్!" అని ఎలుగెత్తి పిలిచి.. మళ్లీ మామూలుగా నిలుచుంది.

## కొత్తగాలి...

**తీరాన్ని కూడా ఆక్రమిస్తూ**
**మేడలు కట్టుకుంటుంటే**
**కడలి కడుపు మండి**
**తుడిచిపెట్టుక పోదా!**

– వెల్మల రాంరెడ్డి,
పూడూరు, కరీంనగర్ జిల్లా

కాసేపాగి నూతిలోకి పరిశీలనగా చూసింది. ఈసారి సంకేతపు తాడు కదిలింది. వెంటనే నూతి పళ్లెంమీద నుంచి కిందకు దిగింది ఆశీ. బురఖా వేసుకుని వడివడిగా నడుస్తూ వెళ్లిపోయింది.

తన అంచనా ప్రకారం వెళ్లవలసినంత దూరం వెళ్లి.. అక్కడ ఆగి.. నూతివేపుకు తిరిగి నిలిచింది.

గుంపులోని కుర్రాళ్లు కొందరు హుషారుగా ఈలలు వెయ్యసాగారు.

మరికొందరు సంతోషంతో చప్పట్లు కొట్టసాగారు.

బలిష్ఠులైన పదిమంది గబగబా బావి దగ్గరకు పరుగులు తీసి.. మురాద్‌ను పైకి లాగే పని మొదలుపెట్టారు.

జనమంతా ఏవేవో మాటలూ.. ఎక్కడెక్కడి కబుర్లూ.. మళ్లీ అక్కడే చెప్పుకోవటం మొదలుపెట్టటంతో మళ్లీ అక్కడి వాతావరణమంతా గందరగోళంగా, సందడి సందడిగా తయారైంది.

ఓపిక లేని ముసలీ ముతకా మాత్రం ఏదో తిరనాళ్లకు వచ్చినట్లు వచ్చి.. జరుగుతున్నదంతా చూస్తూ.. ఓ పక్కగా కూర్చుని ఉన్నారు.

మురాద్ తల్లి మరో పక్కగా కూర్చుని.. సన్నగా.. చాలా తక్కువ శ్రుతిలో ఆరున్నొక్కరాగాలాపన కొనసాగిస్తోంది.

పిల్లలందరూ పోగై దాగుడుమూతలూ.. చెడుగుడు మొదలైన ఆటలు ఎంతో సంబరంగా ఆడుకుంటూ సందడి చేస్తున్నారు.

ఆశీతో సహా అందరూ చూస్తూ ఉండగా...

ముందుగా మురాద్ తలవెంట్రుకలు కనిపించాయి. మెల్లగా నుదురూ, కళ్లూ, ముక్కూ నోరూ, మెడా, అలా.. అలా.. మనిషి మొత్తం కనిపించాడు.

అతను మెల్లమెల్లగా గాలి పీల్చుకుని వదులుతున్నాడు.

అది చూసి అందరూ ఊపిరి పీల్చుకున్నారు.

కొందరు అతన్ని నేలమీద పడుకోబెట్టి ప్రథమ చికిత్స చెయ్యటానికి ఉద్యుక్తులవుతున్నారు.

తన ప్రియుడి చిలిపిచేష్టలను తలచుకుని ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ ఇంటికి పరుగులు తీసింది అతని ప్రియురాలు ఆశీ! ©

# కాలాతీతం



జాన్ స్టీన్‌బెక్

# ది గ్రేప్స్ ఆఫ్ రాత్

ఓక్లహామాలో తేలికపాటి వర్షం కురిసింది. మొక్కజొన్న పంటకు అది సరిపోతుంది. కానీ అప్పటికే గాలిలో కలసిన దుమ్ము, ధూళి మేఘాలుగా ప్రయాణించి పొలాల మీద పరుచుకుంది. జూన్‌కల్లా పొలాలు ఎండిపోయాయి. నేల బీటలు వారింది. ఎర్రటి మబ్బులతో ఎడారిలా ఉంది వ్యవసాయ క్షేత్రం. కౌలు రైతులు బిక్కచచ్చిపోయారు. భవిష్యత్తు అగమ్యగోచరంగా వుంది.

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

పంట లెండిన ఇలాంటి కరువు పరిస్థితులే ఈ నవలకు నేప థ్యం. రైతుల జీవన పోరాటం, వాతావరణ పరిస్థితులు, సామాజిక-ఆర్థిక కారణాలు, రాజకీయ, తాత్విక అంశాలు.. ఒకదాని తర్వాత ఒకటి అధ్యాయాలుగా సాగుతుంది కథనం.

హత్యానేరానికిగాను, పదిహేడేళ్లు శిక్ష పడిన టాంజోడ్ నాలుగేళ్ల తర్వాత పెరోల్ మీద ఇంటికి బయల్దేరతాడు. లిఫ్టు యిచ్చిన ట్రక్ డ్రైవర్ ప్రయాణంలో టాంను గుచ్చిగుచ్చి ప్రశ్నిస్తాడు. రోడ్డు పక్కన దిగి, పొలాల్లో నడుస్తున్న టాంకు, వెల్లకిలా పడిన తాబేలు కనిపిస్తుంది. దాని పెంకులో ఓట్స్, బార్లీ గింజలున్నాయి. అది తిరిగి కాళ్ల మీద నడిచినప్పుడు ఆ గింజలు పొలంలో కలిసిపోయాయి. టాం దాన్ని వెంట తీసికెళతాడు. పెంకులో మరిన్ని గింజలున్నాయి. పొలంలో వెదజల్లితే ఆ గింజలు మొలిచి ఏపుగా ఎదుగుతాయి. పోరాటమే పునఃసృష్టికి మూలం. బీటలు వారిన నేలలో వర్షం పడితే పచ్చటి పంటలు పండవా!

గ్రామంలో తనను బాప్టైజ్ చేసిన జింకే

# జాన్ స్టీన్‌బెక్ (1902 - 1968)

కాలిఫోర్నియాలోని సాలినాస్‌లో జన్మించాడు స్టీన్‌బెక్. తండ్రి కౌంటీ ట్రెజరర్, తల్లి స్కూల్ టీచర్. ఆయనకు బాల్యంలోనే సాహిత్యం పట్ల ఆసక్తి పెరగటానికి కారణం తల్లి. దొస్తోయేవ్‌స్కీ 'నేరము శిక్ష', మిల్టన్ 'పారడైజ్ లాస్ట్', ఫ్లోబేర్ 'మదాంబావరీ', థామస్ హార్డీ నవలలు యితర ప్రాచీన కావ్యాలు ఔపోసన పట్టాడు.

సామాజిక కార్యకలాపాలలో పాలు పంచుకోవడం ఆ కుటుంబం ప్రత్యేకత. వ్యక్తులను, సమస్యలను లోతుగా అర్థం చేసుకోవడానికి బీజం అప్పుడే పడింది స్టీన్ బెక్‌కు. పొలాల్లో తిరగడం, రైతులతో, కూలీలతో మాట్లాడడం అతడికిష్టం. వీళ్లు పండించకపోతే తిండి లేదు, ఎవరూ వీళ్ల సమస్యల్ని అర్థంచేసుకోవటానికి ప్రయత్నించరు.

తల్లిమాట కాదనలేక స్టీన్‌బెక్ స్టాన్‌ఫర్డ్ యూనివర్సిటీ ఇంగ్లీష్ లిటరేచర్ కోర్సులో చేరాడుగాని అకడమిక్ చదువుల మీద అతడికేమాత్రం ఆసక్తి లేదు. రచయిత కావటం తప్ప మరే పని చెయ్యదలచుకోలేదు.

మొత్తంమీద డిగ్రీ తీసుకోకుండానే యూనివర్సిటీ చదువు ముగించాడు. అప్పటికతడికి ఇరవైమూడేళ్లు. చిన్నచిన్న ఉద్యోగాలు చేసుకుంటూ ఒక చారిత్రక నవల 'కప్ ఆఫ్ గోల్డ్' 1929లో ప్రచురించాడు. మరుసటి సంవత్సరం పెళ్లి చేసుకుని, భార్య సహకారంతో ముమ్మరంగా రచనలు కొనసాగించాడు. భర్తకు సలహాలివ్వటమే కాక అతడు రాసినవన్నీ చదివి, విమర్శించి, ఎడిట్ చేసి, టైప్ చేసి 'సహరచయిత' అనిపించుకుంది భార్య. ఆమె సహకారంతో కథాసంకలనం 'పాశ్చర్స్ ఆఫ్ హెవెన్', 'టు ఎగాడ్ అన్నోన్' ప్రచురించాడు స్టీన్‌బెక్.

అమెరికా ఆర్థిక సంక్షోభ పరిస్థితులు ఇతివృత్తంగా రాసిన టోర్టిల్లా ఫ్లాట్ (Tortilla Flat) బాగా అమ్ముడుపోయింది. విమర్శకుల ప్రశంసలు అందుకున్నాడు.

ఆ తర్వాత, కాలిఫోర్నియాలోని లాస్ గేటోస్‌లో స్థిరపడ్డారు. అప్పుడే వామపక్షాల పట్ల ఆకర్షితుడై జాన్‌రీడ్‌క్లబ్ సమావేశాలకు కూడా హాజరయ్యాడు. (జాన్‌రీడ్: ప్రముఖ అమెరికన్ పత్రికా విలేఖరి రష్యా విప్లవం గురించి "ప్రపంచాన్ని కుదిపేసిన ఆ పది రోజులు" రచయిత) అక్కడి ఆపిల్ తోటలలో పనిచేసే రైతుకూలీ

సీని కలుస్తాడు టాం. ఇద్దరూ కలిసి ఒకప్పుడు సాగు చేసిన పొలంగుండా నడుస్తారు. ఇతర రైతులలాగానే వర్షాలు పడక పంటలు పండక పోవడంతో కౌలు కట్టలేదు జోడ్. ఆ కారణంగా వాళ్లనుండి పొలం లాక్కున్నారు. వర్షాభావం వున్నప్పుడు పత్తిపంట వెయ్యాలని యజమానుల ఆదేశం. కాని పంటమార్పిడి చెయ్యటం ఎలాగో తెలియని రైతులు, చూస్తూ చూస్తూ పొలాలను బీళ్లుగా మార్చారు. అయితే పంటమార్పిడి అనేది యజమానులకు కూడా ఇష్టంలేదు. ఫైనాన్సు చేసి వాళ్లను తమ కబంధహస్తాల్లో బంధించిన తూర్పు రాష్ట్రాల బడా పెట్టుబడిదారుల, కార్పొరేషన్ల వ్యాపార నీతి అది.

సాగు చెయ్యటానికి రైతుల అవసరం కూడా లేదు. ఒక ట్రాక్టరును పెట్టి, డ్రైవరుకు జీతమిస్తే పని జరిగిపోతుంది. అలా వీలైనంత తొందరగా నేలసారాన్ని పీల్చేసి, డబ్బులు చేసుకుని ఎండిపోయిన తరువాత బ్యాంకర్ల ఆదేశాల ప్రకారం అమ్మేయవచ్చు. రైతులకు కనిపించని శత్రువులు ఈ బ్యాంకులు. అవెక్కడుంటాయో, వాటినెవరు నిర్వహిస్తారో.. ఇలాంటి నిర్ణయమెందుకు తీసుకుంటారో వాళ్ల ఊహక్కూడా అందదు.

జిమ్‌తో కలిసి తన కుటుంబ సభ్యుల కోసం గాలిస్తాడు టాం (అతడు జైలుకెళ్లిన తర్వాత కూలి దొరక్క భూమి పోగొట్టుకుని, నిరాశ్రయులయ్యారు వాళ్లు). వాళ్లనూ వీళ్లనూ వాకబుచేసి, పశ్చిమ కాలిఫోర్నియా వైపు వెళ్లిపోవటానికి డబ్బులు

లకు దురాశాపరులైన భూస్వాములకూ జరిగిన సంఘర్షణ గురించి 1936లో "ఇన్ డ్యూబియస్ బేటిల్" ప్రచురించాడు. 1937 నాటి 'ఆఫ్ మైస్ అండ్ మెన్'తో అగ్రశేణి అమెరికన్ రచయితల సరసన చేరిపోయాడు. కూటికోసం, గూటికోసం కలలు కన్న ఇద్దరు నిర్భాగ్యుల కథ యిది. నాటకంగా, న్యూయార్క్ డ్రామా క్రిటిక్స్ అవార్డును కూడా గెల్చుకుంది.

'ఆఫ్ మైస్ అండ్ మెన్' నాటకీకరణ దశలోనే స్టీన్‌బెక్‌కు మరో ఆలోచన తట్టింది. అంతకు కొన్నాళ్ల క్రితం ఒక పత్రిక తరఫున కూలికోసం వలస పోతున్న వాళ్లనూ, పీడిత అల్ప సంఖ్యాకులనూ, ఈ సమస్యకు మూలాలు వెదికే క్రమంలో కొందరు ప్రభుత్వ ప్రతినిధులనూ ఇంటర్వ్యూ చేశాడు. వలస వచ్చిన వాళ్ల కోసం ఏర్పాటు చేసిన శరణార్థుల క్యాంపులను కూడా పరిశీలించాడు. ఇలా వచ్చిన వాళ్లందరూ రైతుకూలీలు లేదా సన్నకారు రైతులు. ఆర్థిక సంక్షోభం వల్ల గిట్టుబాటు ధర రాక ఇలా పొట్ట చేతపట్టుకొని ముష్టి వాళ్లలా తిరుగుతున్నారు. సంపన్న దేశం అమెరికాలో యింత పేదరికముందా? ఇక్కడ కూడా ఆకలి చావులుంటాయా? సమాజాధిపతులు పేదల పట్ల చేస్తున్న అతిపెద్ద నేరమిది. మొదట ఈ పరిస్థితుల గురించి శాన్‌ఫ్రాన్సిస్కో న్యూస్ పత్రికలో వ్యాసాలు ప్రచురించాడు. కానీ ఇంకా లోపలి అగ్నిపర్వతం బద్దలు కాలేదు.

ఈ 'ఆకలి మంటల్లో అమెరికా' చిత్రాన్ని నవలీకరించాల్సిందే. అమెరికన్ సివిల్ వార్ గీతం ఆధారంగా 'గ్రేప్స్ ఆఫ్ రాత్' అని పేరు నిర్ణయించాడు. అవును ఇక పేదల కోపం కట్టలు తెంచుకునే సమయం ఎంతో దూరంలో లేదు. ఓక్లహామా నుండి కాలిఫోర్నియా దాకా సాగిన పేదల, రైతుల వలసయాత్ర యిందులో కథాంశం.

ఈ నవల అచ్చయిన వెంటనే పులిట్జర్ ప్రైజ్‌ను గెల్చుకుంది. 1962లో స్టీన్‌బెక్‌కు నోబెల్ బహుమతి రావటానికి కూడా ఇదే ప్రధానకారణం.

సాహిత్యంలో స్టీన్‌బెన్ పేరు చిరస్థాయిగా నిలిచిపోతుంది. గత రెండుమూడు దశబ్దాలుగా ఆయన్ను అనుకరించే వాళ్ల సంఖ్య కూడా గణనీయంగా పెరిగింది. పేదలు, పీడితులు, దగాపడిన తమ్ముళ్ల గురించి రాయాలనుకున్న వాళ్లందరికీ ఆయనే ఆదర్శం. 'అండర్ డాగ్'ను హీరోగా చేసిన రచయిత అంటూ ప్రశంసించింది సాహితీరంగం.

ఈయన 'ఈస్ట్ ఆఫ్ ఈడెన్' నవల రాసినప్పటి "రైటర్స్ జర్నల్" ఔత్సాహికులకు రచనా ప్రక్రియలోని మెళకువలను బోధిస్తుంది.

పోగుచేసుకున్నారని తెలుసుకుంటాడు.

గోడల మీద అంటించిన ప్రకటనల్లో, కరపత్రాల్లో అక్కడ ఉపాధి అవకాశాలు బాగున్నాయని రాసుంది. కుటుంబసభ్యులు జిమ్‌ను కూడా వెంట రమ్మంటారు. ఇక్కడ రోజు గడిచేందుకు దుర్భరంగా ఉంది. మొత్తం పదమూడు మంది కలిసి ఒక డొక్కు హడ్సన్ ట్రక్కులో ఎలాగైనా వెళ్లాలనుకుంటారు. ఆ ట్రక్కు కొనటానికి వాళ్లు పొదుపు చేసిన డబ్బు సరిపోలేదు. పార, పలుగు అమ్మి ఎలాగైనా ట్రక్కును సమకూర్చుకుంటారు. చివరి నిమిషంలో ముసలాయన రానని భీష్మించుక్కూర్చుంటాడు.




తిండి దొరక్కపోయినా ఇది నా ఊరే. తాత తండ్రులనుంచి ఇక్కడే ఉన్నాను. ఇప్పుడు కదలను అంటాడు, చివరికి ఆయనను స్పృహ కోల్పోయేలా చేసి ట్రక్కులోకి ఈడ్చి పశ్చిమ దిశగా కదులుతుంది జోడ్ కుటుంబం.

రూట్ నెంబర్ 66 వెంట ప్రయాణిస్తుంది ట్రక్కు. ఒకచోట రాష్ట్ర సరిహద్దు ముగిసి మరో రాష్ట్రంలోకి ప్రవేశిస్తారు. అంటే టాం, పెరోల్ నిబంధనలను ఉల్లంఘిస్తాడు. కాని కుటుంబానికి తన అవసరముంది, తనకేమైనా ఫరవాలేదు. వాళ్ల

వెంటే వుండటానికి నిశ్చయించుకుంటాడు. అయితే వాళ్లు సరిహద్దు చేరకముందే, గుండెపోటుతో ముసలాయన మరణి స్తాడు. శవపేటికకు డబ్బుల్లేక, రోడ్డు పక్కన గొయ్యి తవ్వుతారు పూడ్చి పెట్టడా నికి. జింకేసి అంత్యక్రియలు నిర్వహి స్తాడు. సాటి మనుషుల కష్టాలకు స్పందించగల మరో జంట విల్సన్ దంప తులు. డొక్కు సెడాన్‌లో ప్రయాణిస్తు న్నారు. వీళ్లకు తోడవుతారు. పెట్రోలు బంకుల దగ్గరా, హాంబర్గర్ స్టాండ్‌ల దగ్గ రా కిక్కిరిసిన హడ్సన్ ట్రక్కును వింతగా చూస్తారందరూ. అక్కడక్కడా వీళ్ల ప రిస్థితికి జాలిపడిన వ్యాపారస్థులు ఆహా రాన్ని తక్కువ ధరకు అమ్ముతారు. ప్రయాణం కొనసాగుతుంది. ఎందుకో గా ని వీళ్లను చూస్తే అందరికీ అనుమానమే.

టెక్సాస్‌లో విల్సన్‌ల కారు ట్రబులి స్తుంది. టాం, అతడి తండ్రి వాళ్లకోసం కాలం వృథా చేసుకోక వెళ్లిపోదామంటారు. కుటుంబం విడిపోతుందేమోనని తల్లి భయం. (వెస్ట్‌కోస్ట్ చేరగానే రోసాశార్న్, కా న్నీ నగరంలో స్థిరపడతామని అప్పటికే ప్రకటించారు.) 'ఎవర్నీ ఎక్కడికీ పోని వ్వను' అని మొండికేస్తుంది తల్లి.

(నవలలో తండ్రిని 'పా' అనీ తల్లిని 'మా' అనీ పిలుస్తారు.)

చివరికి రాజీకొచ్చి కాస్త ముందుకెళ్లి విల్సన్‌ల కారు రిపేరు పూర్తయిందాకా ఒక క్యాంపు దగ్గర ఆపుతుంది కారును. ఈ నవలలో తల్లి చూపిన ధైర్యం, సహనం, కష్ట సహిష్ణత పాఠకులను అబ్బు ర పరుస్తుంది. వాళ్లింకా టెక్సాస్‌లో ఉండ గానే పశ్చిమంవైపునుంచి వచ్చిన మరో రైతుకూలీ ప్రకటనల్లో ఉన్నదంతా బూటక మని చెబుతాడు. యజమానులకు కావల సింది కేవలం ఎనిమిదొందల మంది కూలీలు మాత్రమే! కానీ ఐదువేల మంది ఉన్నారిక్కడ. అందువల్ల వీరంతా అత్యంత నిర్భాగ్యులు, ఎంత ఇచ్చినా సరే, ఎలాంటి పరిస్థితుల్లోనైనా సరే చెయ్యడా నికి సిద్ధంగా ఉన్నారని తెలుసుకున్నారు యజమానులు. న్యూ మెక్సికో, అరిజోనా దాటి కాలిఫోర్నియా ఎడారి సరిహద్దు వైపు కదులుతారు జోడ్‌లు. అక్కడ వాళ్లకు మొదటిసారిగా ఒక కొత్త మాట వినిపిస్తుంది అదే 'ఓకీ!' అంటే ఓక్లహోమా వలసకూలీ. 'నీచుడా, కుక్కా' అన్న తిట్టు పదం లాంటిదది. ఎడారిలోకి ప్రవేశించడా నికి ముందు 'నో' మిగతా వాళ్లను వదిలి వెళ్లిపోతాడు. రాత్రికి విశ్రమిస్తామంటే- అరెస్టు చేస్తామని బెదిరిస్తారు షెరిఫ్ మనుషులు. వలసపోతున్న కూలీలంటే వాళ్లకు క్షుద్రకీటకాలతో సమానం. తమను అడ్డుకున్నందుకు షెరిఫ్ మనుషులను వంటపాత్రతో బెదిరిస్తుంది మా.

ఎడారి దాటి సారవంతమైన లోయలోకి ప్రవేశిస్తుంది కుటుంబం. ఈ ఆనందసమ యంలో క్రితం రాత్రి ప్రయాణంలో ముస లావిడ మరణించిందని చెబుతుంది మా. అప్పుడే చెబితే మరింత ఆలస్యమ వుతుందని చెప్పలేదు. ట్రక్కులో మరో మూల కానలీ, రోసాశార్న్ శృంగారంలో మునిగిపోతారు. మొత్తం మీద ఎట్టకేలకు అందరూ సస్యశ్యామలదేశం కాలిఫోర్నియా చేరారు. ఇక్కడ సంపదా వుంది, పేదరిక మూ ఉంది. దేశభక్తి, టెర్రరిజం కూడా ఉన్నాయి. ఇక్కడ, ఓకీలు అంటే శత్రు వులు, దొంగలు, స్థానిక కాలిఫోర్నియావా సుల గుండెల్లో రైళ్లు పరిగెత్తిస్తున్నారు.

హూవర్‌విల్ కాంపు వద్ద జోడ్‌లు గుడారం వేసుకుంటారు. తల్లి ఎక్కడుంటే అక్కడే ఇల్లు, వంట సామాన్లు సిద్ధం చేసు కుంటుంది. కానీ ఎవరికీ పని దొరకదు. అంటే డబ్బుల్లేవు. అంకుల్ జాన్ తాగి వస్తాడు. భార్య రోసాశార్న్‌కు గర్భం చేసి వదిలేస్తాడు కాన్నీ. ఒక పోలీసు వచ్చి అందర్నీ బెదిరిస్తాడు. ఆడమనిషిపై తు

పాకీ పేలుస్తాడు. టాం ఆయుధం లాక్కుంటాడు. వాణ్ణి స్పృహ కోల్పోయిందాకా చావగొడతాడు. పెరోల్ ఉల్లంఘించినందుకూ, పోలీసు మీద దాడికి టాంకు అరెస్టు తప్పదు.

కాని తప్పంతా తనమీద వేసుకుని అధికారులవెంట వెళ్ళిపోతాడు జింకేసీ. అమెరికన్ లీజినేర్లు కాంపులను దహనం చెయ్యటానికి వస్తున్నారని తెలిసి అందరూ చెల్లాచెదురైపోతారు. అధికారులు ఆదేశించినట్టుగా దక్షిణంవైపు పోవటానికి నిరాకరిస్తాడు టాం. ధిక్కరించి మరీ ఉత్తర దిశగా కదులుతాడు. 'ఘర్షణ వద్దు. సహనం కోల్పోవద్దు. మనం కష్టజీవులం. రెక్కల కష్టాన్ని నమ్ముకున్న వాళ్లం. ఎవరూ మనల్ని ఏమీ చెయ్యలేరు' అని ధైర్యం చెబుతుంది మా.

ప్రభుత్వం నిర్వహిస్తున్న శరణార్థుల శిబిరం- వీడ్‌పాచ్- వద్ద పరిస్థితులు కాస్త ఆశాజనకంగా కనిపిస్తాయి. ఇక్కడ పోలీసుల బెడదలేదు. కనీసం మనుషులుగా చూస్తున్నారు. అందరూ కలిసి సహకార పద్ధతిలో సమస్యల్ని పరిష్కరించుకోవాలనుకుంటారు. మొదటిసారి, చిన్నపిల్లలు సరదాగా ఆడుకోవటం కనిపిస్తుంది. ఒక టాంకు యజమాని చిన్న ఉద్యోగమిస్తాడు. కాని శనివారం నాటి డాన్సు ప్రోగ్రాంలో తుంటరులు వచ్చి సమస్యలు సృష్టించే అవకాశముందని హెచ్చరిస్తాడు.

శనివారం వస్తుంది. డాన్సు ప్రారంభమవుతుంది. రౌడీలు వచ్చి దుర్భాషలాడతారు. కాంపు వెలుపల తుపాకులతో పోలీసులు నిరీక్షిస్తున్నారు. లోపల గొడవ ప్రారంభమైతే చాలు- తాము లోపలికెళ్లటానికి సాకు దొరుకుతుంది. దొమ్మీ ప్రారంభమవుతుంది. టాం, ఇతరులు రౌడీలను మోసుకెళ్లి కాంపు గేటు బయట వదిలి వస్తారు. పెద్ద ప్రమాదం తప్పింది. డాన్సు కొనసాగుతుంది.

ఆ నెలలో జోడ్‌లకు అయిదురోజుల పని దొరుకుతుంది, కాని అది కూడా కేవలం టాం ఒక్కడికే. 'పని దొరక్క 'పా' దిగులుగా ఉన్నాడు. ఆత్మస్థైర్యం కోల్పోయాడు. మరెక్కడికైనా పోదామంటుంది మా. ఆమె ఆశలన్నీ టాం మీదే. వాడొక్కడే తన మాటకు విలువిచ్చేది. కుటుంబం ఒక పీచ్(పళ్ల) తోటకు చేరుకుంటుంది. అందరూ పనిచేయవచ్చు. మూడు గాలన్ల పళ్లు కోస్తే- ఒక నికెల్ (ఐదు సెంట్లు) కూలీ. ఆరోజు కుటుంబమంతా ఒళ్లు హూనం చేసుకుని ఒక డాలర్ సంపాదించింది. అయితే ఆ వెంటనే తామెంత దారుణంగా నష్టపోయారో తెలుసుకొంటారు. ఆ తోటలోని

### కొత్తగాలి...

**వందమంది అన్నదమ్ములకు**
**ఒక్కటే మొలతాడు**
**ఇది పొదుపు కథ**
**ముప్పై మంది పిల్లలకు**
**ఒక్కటే సిరంజి, ఇది పొడుచు కథ**

– తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, హైదరాబాద్

కిరాణా కొట్టులో ధరలు ఆకాశాన్నంటుతున్నాయి- బయటి మార్కెట్ రేట్లతో పోల్చితే చాలా ఎక్కువ. అంత సంపాదించినా కడుపునిండా తిండి కూడా తినలేరు.

కాంపును సాయుధ పోలీసులు గస్తీ కాస్తున్నారు. కమ్యూనిస్టు ఆందోళనకారుల నుండి వలస కూలీల రక్షణకోసమే తామక్కడ ఉన్నామని చెబుతారు వాళ్లు. పొలాల్లో ఒకచోట జింకేసీ కనిపిస్తాడు. యజమానులు కూలీ డబ్బులకు కోతపెట్టే ప్రయత్నాలు చేస్తున్నారు. వాళ్ల నుండి రక్షించుకోవాలంటే తాము సమ్మె చేయక తప్పదంటాడు. ఇప్పుడతను కార్మికనాయ

కుడు. టాం, అతడూ మాట్లాడుకుంటున్నప్పుడు, చీకట్లో, టార్చ్‌లైట్ వెలుగులో ఇద్దరు మనుషులు కనిపిస్తారు. ఒకడు గొడ్డలిని తిరగేసి కొట్టిన దెబ్బకు జింకేసీ తల చిట్లుతుంది. ఆ ఆయుధం లాక్కుని తిరిగి వాణ్ణి కొడతాడు టాం. ఆ గందరగోళంలోనే చిన్నపాటి గాయాలతో, పారిపోయి కాంపులోని తనఇంటికి చేరుకుని, జరిగిందంతా చెబుతాడు. పారిపోవాలని అతడి ఉద్దేశం కాని, రోసాశార్న్‌కు నెలలు నిండాయి గనక, ప్రసవానికి ఉండమని టాంను కోరుతుంది మా. అంగీకరిస్తాడతను.

మరుసటిరోజు కూలీ రెండున్నర సెంట్లకు తగ్గుతుంది. ఒక యువకుడు విన్‌ఫీల్డ్ ఆకలితో శోషవచ్చి పడిపోతాడు. టాం కోసం వేట ప్రారంభమవుతుంది. ఇక ఇక్కడ ఉండటం అసాధ్యమనుకున్న జోడ్ కుటుంబం టాంను రెండు మాట్రెస్‌ల మధ్య దాచి తిరిగి ప్రయాణం కొనసాగిస్తారు. ఉత్తరంగా కదిలి పత్తి కాంపు వద్ద ఒక బాక్స్‌కార్‌లో కొత్త జీవితం ప్రారంభిస్తారు. ఇంకా గాయాలు సలుపుతున్నా టాం రహస్యంగానే ఎక్కడో దాగి ఉండక తప్పదు. చిన్నపిల్లలు ప్రగల్భాలతో ఆటలాడుకుంటున్నప్పుడు, రూతీ, తన అన్నయ్య ఒక పోలీసును చంపాడని గొప్పగా చెబుతుంది.

ఇక అక్కడ ఉండడం క్షేమం కాదని చెప్పాలనుకుంటుందిమా. జింకేసీ ప్రారంభించిన ఉద్యమాన్ని కొనసాగించటమే తన జీవిత లక్ష్యమంటాడు టాం.

(జింకేసీది గొప్ప మనసు. అతడు సాధారణ వ్యక్తి కాదు!)

గత్యంతరం లేక అయిష్టంగానే టాంకు కొద్దిగా డబ్బిచ్చి వీడ్కోలు చెబుతుంది మా. పరిస్థితులు కుదుటపడిన తర్వాత వస్తానంటాడు టాం.

క్యాంపులో, ఇంటిలో పెత్తనం తన చేతి నుండి జారిపోయిందని గ్రహిస్తాడు పా. పత్తిసేకరణ కొనసాగుతుంది. కాని కుండపోత వర్షాలు కురవటంతో అదీ ఆగిపోతుంది. వలస కూలీలందరూ రోగాల బారి నపడతారు. గౌరవంగా కూలీ చేసి సంపాదించటానికి బదులు, దొంగతనాలకూ, ముష్టెత్తుకోవటానికి అలవాటు పడతారు. స్థానిక కాలిఫోర్నియన్లు, వీళ్లపట్ల వైరం పెంచుకుని, ఈ ఓకీలను తరిమెయ్యమని అధికారుల మీద ఒత్తిడి పెంచుతారు.

ఈ వలస కూలీలను, ఈ ఆకలి కేకల పేదలను ఐక్యం చేసింది వ్యవస్థపట్ల వాళ్లకున్న కోపమే - కష్టాలు, కడగండ్ల వేడిలో ఆ పచ్చి ద్రాక్షలు పక్వానికొచ్చాయి.

వరదలకు అడ్డుకట్టలు కడతారు. బాక్స్‌కారులోనే రోసాశార్న్ ప్రసవిస్తుంది. అయితే అది మృతశిశువు. నీటి మట్టం పెరగటంతో బాక్స్ కార్ నుండి రోసాశార్న్‌ను సురక్షిత ప్రదేశానికి తరలిస్తారు మా, పా. ఆకలి తాళలేక మరణిస్తున్న ఒక వృద్ధ కూలీ కనిపిస్తాడు. రోసాశార్న్ అతడికి సేవ చేస్తుంది.

అందమైన అమెరికా ఎక్స్‌రే చిత్రం ఈ నవల. ఆర్థికమాంద్యం (గ్రేట్ డిప్రెషన్) నాటి పేదల జీవితాలకు, సాహిత్యంలో సుస్థిరస్థానం కల్పించటానికి స్టీన్‌బెక్ చేసిన గొప్ప ప్రయత్నమిది.

ఇది అత్యద్భుత వాస్తవిక చిత్రణ అన్నారు విమర్శకులు. పరిస్థితిని వక్రీకరించాడన్నారు మరికొందరు. ఇది అమెరికన్ క్లాసిక్ అని యిప్పుడంతా అంగీకరిస్తారు.

బానిసత్వం నుండి విముక్తిని ఆశించి, పందొమ్మిదో శతాబ్దంలో హారియెట్ బీచర్ స్టోవ్ రాసిన అంకుల్ టామ్స్ కేబిన్ లాగ పేదలకు, నిరుద్యోగులకు, వలస కూలీలకు మెరుగైన పరిస్థితులు కల్పించాలని సభ్య సమాజానికి జాన్‌స్టీన్ బెక్ ఇచ్చిన నిజనిర్ధారణ నివేదిక ది గ్రేప్స్ ఆఫ్ రాత్.

– ఎం. వసంత



# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
ప్రవచన వాచస్పతి,
అభినవ వ్యాస **టి.కె.వి. రాఘవన్**
సమాధానాలు

**ప్ర.** శివపురాణంలో విష్ణువు శివభక్తుడుగా ఉంటాడు. విష్ణు పురాణంలో శివుడు హరిభక్తుడుగా ఉంటాడు. అదెలాగు?

– **జి. సత్యవతి,**
బొబ్బిలి, విజయనగరం జిల్లా

**జ.** పురాణాలలో శ్రీవిష్ణుపురాణాన్ని 'పురాణ రత్నం' అని కీర్తించారు సాక్షాత్తు ఆదిశంకరులు. ఇతర పురాణాలన్నింటికీ మూలమది. సృష్టికి మూలతత్త్వాన్ని నారాయణ శబ్దంతో చెప్పి, అది ప్రకృతిని సృష్టించే క్రమంలో చతుర్ముఖ బ్రహ్మగా, స్థితికారకునిగా ఉండే క్రమంలో విష్ణువుగా, కల్పాంతంలో సృష్టిని ఉపసంహరించే క్రమంలో సదాశివునిగా ఆవిష్కృతమవుతుంది. ఇతర పురాణాల్లోనూ సృష్టిక్రమం ఇలాగే ఉంది. తరువాతి కాలాలలో ఆయా సాధకుల భావనా విధానాలని అనుసరించి ఉపపురాణాలు, గాథలు, భావజాలాలు జొరబడ్డాయి. శ్రీమద్రామాయణం యుద్ధకాండలో శ్రీరాముని శివుడు స్తుతించడం, భాగవతంలో శ్రీకృష్ణుడు సంతానార్థియై పరమశివుని ప్రార్థించడం.. ఇలా ఎన్నెన్నో గాథలూ తోడయ్యాయి. కొందరు తిక్కనగారి నుంచి చెప్పే హరిహరాద్వైతం ఆళ్వారుల సంప్రదాయ కాలం నాటికే వేళ్లూనింది. ఏతావాతా భగవత తత్త్వం 'ఏకమేవ' కానీ 'విప్రాః బహుధా వదంతి' అని చెప్పడమే శివకేశవాభేద ప్రతిపాదన.

**ప్ర.** శ్రీకృష్ణుడు అస్ఖలిత బ్రహ్మచారి కదా! ఆయనకు ఒక్కో భార్యయందు పదిమంది చొప్పున కుమారులు ఎలా పుట్టారు?

– **బిక్కునూరి రాజేశ్వర్,** నిర్మల్

**జ.** మగ నెమలి నాట్యం చేస్తోంటే దాని కంటి వెంట నీరు జారుతుంది. ఆ నీటి చుక్కలని ఆడ నెమలి తాగుతుంది. తదుపరి గర్భం ధరిస్తుంది. ఇది ఆధునిక శాస్త్రపరిశోధనల ప్రకారం కూడా రుజువయింది. అంటే స్త్రీ, పురుష సంగమం లేకుండా గర్భం ధరించడం జరుగుతోంది. శ్రీకృష్ణుడు తాను 'అజన్మ బ్రహ్మచారిని' అని సూచించడానికే నెమలి పింఛం అలంకారంగా ధరించాడు. కృత, త్రేత, ద్వాపర యుగాలలో సంతాన ప్రక్రియ యోగ శాస్త్రవిధాన పరం గా కూడా జరిగేది. ఇది సర్వసాధారణం. అంటే, యోగబలం వలన పురుషునిలోని శక్తి స్త్రీయం దు ప్రవేశించి గర్భం ధరిస్తుంది. వసుదేవుడు కారాగారంలో ఉండగా రోహిణి గర్భం పండటం, వ్యాస భగవానుని తేజం అంబికా గర్భంగా నిలవడం.. ఇలాంటివెన్నో..! శ్రీమద్భాగవతం దశమస్కంధం చివర్లో శ్రీశుక మహర్షి, పరీక్షిత్తు సంవాదంలో వివరంగా చూడవచ్చు.

**ప్ర.** పురాణాలు అంటే ఏవి? ఇతిహాసాలు ఏవి? వివరంగా చెప్పగలరు?

– **కె. అంకమ్మ,** పూనూరు, ప్రకాశం జిల్లా

**జ.** ఒక చిన్న శ్లోకంతో పురాణాలన్నీ గుర్తుపెట్టుకోవచ్చు.

భద్వయం మద్వయంచైవ
బ్రత్రయం వచతుష్టయం
అనాపలింగ కూస్కాని
పురాణాని పృథక్ పృథక్

'భ'తో రెండు పురాణాలు.. భాగవతం, భవిష్య. 'మ'తో రెండు.. మత్స్య, మార్కండేయాలు. 'బ్ర'తో మూడు.. బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మ వైవర్తములు. 'వ'తో నాలుగు.. విష్ణు, వామన, వాయు, వరాహ పురాణాలు. తరువాతివి అగ్ని,

# చతుర ప్ర.జ. 3

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

**జిజ్ఞాసువులైన** పాఠకుల ఆదరాభిమానాలు అత్యంతంగా చూరగొన్న 'చతుర ప్ర.జ' శీర్షికను నిర్వహించడానికి ప్రవచన వాచస్పతి, అభినవ వ్యాస **టి.కె.వి. రాఘవన్** అంగీకరించారు. ఆచార వ్యవహారాలు.. సంస్కృతీ సంప్రదాయాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి మాకు పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాంద పురాణాలు మొత్తం 18. శ్రీరామాయణం, మహాభారతం రెండూ ఇతిహాసాలు.

**ప్ర.** శ్రీకృష్ణునికి ముందు జన్మించిన ఏడుగురిని కంసుడు చంపాడు కదా! మరి సాత్యకి కృష్ణుని తమ్ముడనడం ఎలా పొసగుతుంది?

**– డి. అనూష, కీళపూడి,** చిత్తూరు జిల్లా

**జ.** సాత్యకి.. దేవకీ వసుదేవుల పిల్లవాడు కాడు. వసుదేవునికి సోదరుని వరుస అయిన సత్యకుడు అనే మహారాజు కుమారుడు. కృష్ణ బలరాముల్లాగే, సాత్యకీ కృష్ణుల మధ్య ప్రగాఢమైన అనుబంధం. ప్రతి సన్నివేశంలోను కృష్ణుని అంగరక్షకునిగా సాత్యకి కనిపిస్తాడు. భారతంలో అద్భుతమైన పాత్ర. సాత్యకి దాదాపుగా బలరామ కృష్ణులంత బలం కలిగినవాడు. అయినా వినయశీలి.

**ప్ర.** పడమటి నుంచి వచ్చే సూర్యకిరణాలు ఇంట్లో పడకూడదని చెబుతున్నారు. నిజమేనా?

**– వానపల్లి వెంకట సత్యగంగరాజు,** విశాఖపట్నం

**జ.** ఈమధ్య కాలంలో వాస్తు వింత పోకడలు పోతోంది. తూర్పు దిక్కు సింహద్వారం మంచిదన్నారు అనుకుందాం! మరి సాయంకాలం పడమటి నుంచి వచ్చే కిరణాలు ఇంట్లోకి రాకుండా చేయడానికి ఆ వాస్తు శాస్త్రవేత్తలు మార్గం సూచిస్తారా? పల్లెల్లో సంప్రదాయ కుటుంబాల పెద్దలు వంటింటిని ఇప్పటికీ 'పడమటిల్లు' అంటారు. సాయంకాలపు సూర్య కిరణాలు మరి ఆ గదిలోనే పడతాయి కదా!

**ప్ర.** మరణానంతరం జీవాత్మ గమ్యస్థానాన్ని ఎలా తెలుసుకుంటుంది? ఎలా చేరుకుంటుంది?

**– డా. సి. జనార్దన సింగ్,** నల్లకుంట, హైదరాబాద్

**జ.** బ్రహ్మసూత్రాలు, బృహదారణ్యక ఉపనిషత్తు, భగవద్గీత, గరుడ, పద్మ పురాణాలు ఈ ప్రశ్నకి విపులంగా సమాధానం ఇచ్చాయి. సూక్ష్మంగా చెప్పడానికి ఆధునిక పరిభాషలో వివరిస్తాను. పూవు వికసించింది.. పుప్పొడి గాలికెగిరింది. వాటి ద్రవ్యరాశిని అనుసరించి కొంతదూరం ప్రయాణిస్తాయి. ఒక్కొక్క చోటుకు చేరతాయి. అనుకూలత ఉంటే పునరుత్పత్తి కావచ్చు రూపాంతరం చెందవచ్చు పరిమళం కూడా అంతే! నీరు, ధూళి, బురద, పొగ.. ఇలాంటి ద్రవ్యాల మీదుగా కదులుతుంది. తాను కలిసే ఇతర ద్రవ్యాల సాంద్రత ఎక్కువ, తక్కువల ఆధారంగా ముందుకి కదులుతుంది. ఏదో ఒక చోటుకి చేరుతుంది. జీవుడు, జీవాత్మ స్థితీ అంతే! గతజన్మ వాసనలు, అంటే సత్వరజతమో గుణాల వలన ఏర్పడిన లక్షణాలని బట్టి ఆయా స్థానాలు పొందుతుంది. ఈ అంశాన్ని పరిశోధనశాలలో పరీక్షల ద్వారా చెప్పడం అసంభవం!

**ప్ర.** జనక మహారాజు నిర్ణయం మేరకు 'శివ ధనుస్సు' పరీక్ష పెట్టారు. సీతాదేవి స్వయంగా వరుని ఎన్నుకోలేదు కదా! అటాంటప్పుడు 'సీతా స్వయంవరం' అని ఎలా అంటారు?

**– కె.వి. భారతి,** పాకాల, చిత్తూరు జిల్లా

**జ.** సీతా స్వయంవరం, రాజులు రావడాలు, రావణాసురుడు రావడం.. వగైరా వృత్తాంతాలు వాల్మీకి రామాయణంలో లేనే లేవు. జనకుడు చేస్తున్న ఒకానొక యాగం పూర్తవుతున్న సందర్భంలో విశ్వామిత్రునితో రామలక్ష్మణులు

మిథిలా నగరానికి వెళ్లారు. విశ్వామిత్రుని మాట మేరకు శివధనువును యాగశాలకే రప్పించారు. సీతను 'వీర్యశుల్క'గా జనకుడు ప్రకటించాడు. తరువాతి కథ తెలిసిందే! భారతభాగవతాదు ల్లాగే రామాయణ గాథలకీ రంగు, రుచి మారి పోయాయి. అదీ సంగతి!

ప్ర. మనిషికి ఆత్మ సంతృప్తినిచ్చే సులభమైన భక్తికార్యాలు తెలియజేయగలరు?

**– యు. విజయశేఖరరెడ్డి,** కూకట్‌పల్లి,

**జ.** నయాపైసా ఖర్చు చేయనవసరం లేకుండా చేయదగిన పనులు పన్నెండు చెప్పారు పెద్దలు. జాతి, వర్ణ భేదాలతో వ్యక్తుల్ని దూషించ కూడదు. వయసులో భేదాలు చూస్తూ అతి ఆదరణ, అనాదరణకి పాల్పడరాదు. ఎవ రినీ తక్కువ చేయకూడదు. శరీర నిరూపణ దోషమంటారు. అంటే స్త్రీపురుష, పశుపక్షి.. ఇలా! ప్రతీదీ భగవత్ స్వరూపంగా గౌరవిం చాలి. ఆశ్రమాలని బట్టి, ఉండే ప్రదేశాలని బట్టి, వృత్తులని అనుసరించి, ప్రవర్తనల్ని బట్టి, ఆయా సందర్భాల్లో లోటుపాటులని బట్టి ఆయా వ్యక్తుల పట్ల ఆదరణ, అనాదరణ చూపరాదు. ఈ పనులు చేయడం కష్టమా? ఇది ఆత్మ సంతృప్తి ఇచ్చే భక్తికార్యం కాదా?

ప్ర. కల్పాంతం అంటే ఏమిటి?

**– టి. హేమలత,**
మచిలీపట్నం, కృష్ణా జిల్లా

**జ.** మానవులకి ఒక సంవత్సరం దేవతలకి ఒ కరోజు. దేవతల వేయి సంవత్సరాలు ఒక మహా యుగం. వేయి దివ్య మహాయుగాలు బ్రహ్మకి ఒక పగలు. 71 మహాయుగాలు ఒక మన్వం తరం. అంటే కోటీ ఇరవై లక్షల దివ్య సంవత్స రాలు బ్రహ్మకి ఒక పగలు అన్నమాట! మనభా షలో 33,85,71,429 సంవత్సరాలు ఒక మన్వం తరం. ఇలాగ బ్రహ్మగారికి నూరు సంవత్సరాలు అయితే ఒక కల్పం. భారతీయుల కాల పరిగ ణన ఎంతో లోతుకదా! శాస్త్రవేత్తలు బిలియన్, ట్రిలియన్ అంటారే ఇదేమరి!

ప్ర. దక్షయజ్ఞ సమయంలో పతికి జరిగిన అవమానానికి పార్వతి దగ్ధమైపోయింది. కానీ ఆమె శరీరాన్ని విష్ణువు ఖండించడంతో పద్దెని మిది శక్తిపీఠాలు ఏర్పడ్డాయంటారు. బూడిదైపో యాక శరీరం ఎక్కడిది? ఖండించడం ఎలా సాధ్యం?

**– తటవర్తి రామకృష్ణ,**
తాళ్లగడ్డ, హైదరాబాద్

**జ.** నిజమే! దక్షయజ్ఞ సమయంలో సతీదేవి భస్మమయిన మాట అన్ని పురాణాల్లోనూ ఉంది. స్కాంద పురాణంలో, శివ పురాణంలో ఉన్న ఒకటి రెండు ఖండికల ఆధారంగా కొన్ని ప్రక్షిప్త శ్లోకాలు, కాళికా పురాణం వంటి ఉప పురాణాల గాథలను అనుసరించి ఈ గాథ ప్రా చుర్యంలోకి వచ్చింది. అమ్మవారి చితాభస్మాన్ని తిరిగి సతీరూపంగా తీర్చాడని, మరల ప్రాణం పోసుకొని అమ్మవారు శివుని సాంత్వన పరచి ప్రాణం త్యజించిందని గాథ! ఆ తరువాత శివుని అనుమతి మేరకు విష్ణువు ఆ శరీరాన్ని పద్దెని మిది భాగాలుగా ఖండించాడని ప్రతీతి. అంటే, ఐదు తన్మాత్రలు, ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు, బుద్ధి, మనసు, అంతఃకరణా లకు ప్రతీకగా ఆరాధనీయమైన రీతిలో నిలపడా నికే ఇలా చేశాడు. పౌరాణికంగా కంటే తాంత్రి కంగానే ఈగాథకి ప్రాధాన్యం కనిపిస్తోంది. ©

## రూ.116/- బహుమతి పొందిన
# ఉత్తమ ప్రశ్న

ప్ర. ఎకరాల కొద్దీ విస్తీర్ణంలో కొన్ని దశాబ్దాల క్రితం నిర్మించిన బహుళ అంత స్తుల సముదాయానికి కూడా వాస్తు చూసు కోవాలా?

**– వెల్ముల రాంరెడ్డి,** పూడూరు, కరీంనగర్

**జ.** బహుళ అంతస్తుల నిర్మాణంలో రహస్యం మరచిపోతున్నాం. పర్యావరణ రక్షణ, చెరువులు, కొండలు, వనరుల రక్షణ దీనిలో పరమార్థం. నగర నిర్మాణానికీ వాస్తు ఉంది. నీటివాలు, గాలివాటు, తాగు నీరు, మురికినీరు మొదలైన వాటిని పరిగణ నలోకి తీసుకొని ఎలా ఎలా భవంతులు నిర్మించాలీ అన్నది వాస్తుశాస్త్రం చెప్పింది. నగరం నాలుగువైపులా విస్తరిస్తూంటుంది. అలాంటి క్రమంలో కొండలు, చెరువులు అ డ్డుగా వచ్చినప్పుడు అవరోధం ఏర్పడుతుంది. అత్యవసర పరిస్థితిలో జనబాహుళ్యాన్ని దృష్టిలో ఉంచుకొని బహుళ అంతస్తులు నిర్మించారు. ఇప్పటిలా కొండలు కొల్లగొ ట్టడం, చెరువులు ఆక్రమించడం ఆనాడు జర గలేదు. అపుడు కూడా వాస్తు అతిక్రమించ లేదు. అందువలన ఈ కాలంలో అవసర మైతే మార్పులు చేసుకోవచ్చు

నవలావలోకనం 18

కపిల కాశీపతి

# ఇంతకీ నేనెవరు?

నిర్వహణ : వి. రాజారామమోహనరావు

**చాలామంది దృష్టికి రాక, తగినంత ప్రాచుర్యం లేక, మరుగున ఉండిపోయిన నవల కపిల కాశీపతిగారి 'ఇంతకీ నేనెవరు?'. ఈ నవల 1968లో వచ్చింది. ఇతివృత్తం రీత్యా, పాత్రల పరంగా, విషయగతంగా మంచి పరిపక్వత ఉన్న నవల ఇది. 'ఇంతకీ నేనెవరు?' అన్నది ఓ చిత్రమైన ప్రశ్న. ఈ ప్రశ్న వేసుకున్నది ఈ కథలోని నాయిక సీతామహాలక్ష్మి. చిన్నతనం నుంచే ఆమెని ఈ ప్రశ్న తెలియని కలతకి గురి చేసింది. తరువాత ఎన్నెన్నో స్థానాలకు, స్థాయిలకు ఆమెను తీసుకెళ్లింది.**

సీతామహాలక్ష్మిది చిత్రమైన జీవితం. విచిత్రమైన మనస్తత్వం. బాహ్యంగా చూస్తే ఆమెకి ఏ బాధలూ లేవు. కానీ ఆమె అంతరంగ పరంగా ఓ దీర్ఘమైన కలత ఉంది.. అది ఆమె జన్మ రహస్యానికి సంబంధించింది. అందుకే ఆమెలో 'నేనెవరు?' అన్న ప్రశ్న తలెత్తింది.

వెంకయ్య దంపతుల కూతురిగానే ఊళ్లో వాళ్లందరూ సీతామహాలక్ష్మిని పరిగణించేవారు. ఒకత్తే కూతురు. ఎంతో గారాబంగా పెంపకం. సీతామహాలక్ష్మికి అయిదారేళ్ల వయసులో తల్లి మరణించింది. సరిగా అదే సమయంలో వెంకయ్య దంపతులు తనని కన్న తల్లిదండ్రులు కాదని, దిక్కులేని తనని తెచ్చి పెంచుకున్నారన్న గాలి వార్త సీత చెవిన పడింది. తన ఆలనాపాలనా చూసే మంగ నుంచి అసలు రహస్యం తెలుసుకోవాలని ప్రయత్నించింది. సీత వెంకయ్యగారికి దొరికిన పిల్ల అని చూచాయగా మంగ చెప్పింది. అసలు తల్లిదండ్రులెవరో తెలియదంది. సీతకి సందేహం అలాగే ఉండిపోయింది. ఈ దురదృష్టంతోపాటు జీవితంలో అదృష్టాల ఎరుక కూడా సీతకి ఉంది. తండ్రి వెంకయ్య ధనవంతుడు. ఇంట్లో ప్రేమ, తగిన స్వాతంత్ర్యం సీతకి ఉన్నాయి. ఓ పక్క కలత.. మరోపక్క ధీమా.. సీత మనస్తత్త్వంలో చిత్రమైన కలగలపు.




ఇటువంటి సీత ఎదుగుదలని, అప్పటి రాజకీయ, సాంఘిక పరిణామాల్ని జమిలిగా కలిపి కపిల కాశీపతిగారు ఈ నవలని రచించారు. నవలలో ఎక్కడా ఇది ఫలానా సంవత్సరమని చెప్పరు. కానీ ఆ కాలాన్ని తెలిపే సాంఘిక, రాజకీయ సంఘటనల్ని కథలో కలిపి పొందుపరిచారు. సీత బాల్యం మనదేశ స్వాతంత్ర్యానికి ముందు కాలం. ఆమె పసితనం రెండో ప్రపంచ యుద్ధానికి ముందు గడిచింది. తన చిత్రమైన పరిస్థితి, మనఃస్థితే కాక, ఆ కాలపు సంఘటనలు ఆమె జీవితాన్ని ఎలా ప్రభావితం చేశాయో చూపించారు కాశీపతిగారు.

వెంకయ్యగారి స్వగ్రామం నందికోట జమిందారీ సంస్థానం. వెంకయ్యగారి తండ్రి గుమాస్తా. ఆయన అనంతరం ఆ ఉద్యోగం వెంకయ్యగారికే వచ్చింది. ఆలస్యంగా పెళ్లి చేసుకున్న వెంకయ్యగారికి సంతానం కలగలేదు. ఆర్థిక పరిస్థితీ అంతంత మాత్రమే. ఆయన జీవితంలో ఓ నాటకీయ సంఘటన జరిగింది. ఓ గాలివాన రాత్రి దైవవశాత్తు అమ్మవారి గుడివద్ద ఆయనకి ఓ ఆడపిల్ల, ఓ నిధి దొరికాయి. ఆ పిల్లే సీత! కృష్ణానది దాటి వచ్చి 'చిన్నపల్లె' అన్న ఊళ్లో స్థిరపడ్డారు. వ్యాపారం ఆరంభించి స్థితిమంతులయ్యారు. పొగాకు సాగు చేశారు. వ్యాపారం,

వ్యవసాయం కలిసొచ్చి పెద్ద ఇల్లు కట్టుకున్నారు. సీతతో పాటు వెంకయ్యగారి వ్యాపారాలు పెరుగుతూ వచ్చాయి. పొగాకు ఆకర్షణతో కొంత మంది తెల్లదొరలు కూడా వచ్చి చిన్నపల్లెలో స్థిర పడ్డారు. క్రమేపీ క్రైస్తవ ఫాదరీలు కూడా వచ్చారు. మతం పుచ్చుకున్న వారి సంఖ్య పెరిగింది. ఊరు పెరిగింది. ఓ చర్చి, ఒక స్కూలు, ఒక ఆసుపత్రి, ఓ అనాథ శరణాలయం వెలిశాయి. తెల్లవారి కుటుంబాలూ పెరిగాయి.

చలాకీగా, ఆకర్షణగా ఉండే సీత అంటే దొరసానులు ఇష్టపడేవారు. తమ ఇళ్లకి తీసికెళ్లేవారు. గుర్రపు బగ్గీలో తీసుకొచ్చి ఇంటిదగ్గర దింపేవారు. సీతకి ఈడొచ్చింది. గుర్రపు స్వారీ, ఈత నేర్చుకుంది. దాంతో ఊళ్లో మొగరాయుడన్న పేరొచ్చింది.

వెంకయ్యగారి ఆస్తి చూసి వాళ్లింట్లోకి ఆయన అక్కగారు కుటుంబ సమేతంగా వచ్చి చేరింది. ఆమెకి ఒక్కడే కొడుకు. వాణ్ణి సీతకిచ్చి పెళ్లిచేస్తే ఇంక ఢోకా ఉండదని ఆవిడ ఉద్దేశం. తనతో చిన్నతనం నుంచి ఆటపాటలతో పెరిగిన రాముడంటే సీతకు ఇష్టం. వాడికీ సీతంటే ఇష్టమే. ఇద్దరికీ ఈడూజోడూ. విషయం గ్రహించి వెంకయ్యగారు ఊరి పురోహితుడితో రాముడి తల్లిదండ్రులకు రాయబారం పంపారు. వాళ్లకు ఆ సంబంధం ఇష్టమే అయినా, ఇంట్లో ముసలావిడ ఒప్పుకోలేదు. 'నా మనవడు రాముడికి ఆ కిరస్తానీ మొగరాయుణ్ణి చేసుకోను' అని ఖరాఖండీగా అనటమే కాక, కులం, గోత్రం ప్రసక్తి కూడా తీసుకొచ్చింది. ఆ మాటల్లో తన జన్మరహస్యం తాలూకు పరోక్ష ధ్వని ఉందనిపించింది సీతకి. ఆమె మనసు మరొక్కసారి కలుక్కుమంది.

సీత మేనత్త అనుకున్నట్లుగానే తన కొడుక్కి సీతకీ పెళ్లి జరిగింది. దురదృష్టం ఏమిటంటే పెళ్లయితే జరిగింది కానీ, ఇంకే కార్యక్రమాలూ జరగలేదు. కృష్ణా పుష్కరస్నానం చేస్తూ ఆ కుర్రాడు కొట్టుకుపోయాడు. సీత బాలవితంతువు అయింది. సీతకు సత్యం పిన్ని సాయంగా నిలిచింది. సత్యం పిన్నిగా వ్యవహరిస్తున్న ఈ సత్యవతమ్మ బాల వితంతువు. అయినవాళ్లెవరూ లేరు. ముప్పై ఏళ్లుంటాయి. మంచి నెమ్మదస్తురాలు. లోకజ్ఞానం బాగా ఉన్న వ్యక్తి.

చిన్నపల్లెకే అతుక్కుపోయిన సీత జీవితం సత్యం పిన్ని రాకతో ఆ ఊరు దాటిన అనుభవాలు చవిచూసింది. తండ్రి అనుమతితో విజయవాడ కనకదుర్గ గుడికి వెళ్లారు. మంగళగిరి తిరణాళ్లకి వెళ్లారు. గుంటూరు కంపెనీ నాటకాలకీ వెళ్లారు. సీతలో స్త్రీగా వికాసం ఆరంభమైంది.

వెంకయ్యగారికి గుంటూరు రాకపోకలు పెరిగాయి. వ్యాపారం పనులు విస్తరించాయి. ఇంట్లో దిగులుగా ఉండే సీతను కూడా గుంటూరు తీసికెళ్లారు. అక్కడి పరిచయాలతో సీత వేషభాషల్లో మార్పు వచ్చింది. ఇంతలో సీత అత్తమామలు ఆ ఇంట్లో అందినవన్నీ పట్టుకుని తమ ఊరు వెళ్లిపోయారు. అదే సమయంలో వెంకయ్యగారు మొత్తం మకాం గుంటూరుకి మార్చారు. సీత అక్కడే ఆడపిల్లల స్కూల్లో చేరింది. ఆమెకి చిత్రలేఖనం నేర్పటానికి ఓ మేస్టార్ని కుదిర్చాడు తండ్రి. గురువుగారి శిక్షణలో సీత జీవితం అనుకోని దారులకి మళ్లింది.

ఇంతవరకు సీత కథలా, ఓ కుటుంబ గాథలా నడిచిన ఈ నవల ఇక్కడ ఒక మంచి మలుపు తిరిగింది. జాతీయజెండా నిర్మాత పింగళి వెంకయ్యగారు ఈ నవలలో ఓ పాత్ర అయ్యారు. స్వాతంత్ర్యోద్యమం.. గాంధీగారు ఆంధ్రదేశం రావటం, ముట్నూరి కృష్ణారావుగారు, భోగరాజు సీతారామయ్యగారి కార్యకలాపాలు ఈ నవలలో సంఘటనలయ్యాయి. నవలలో ఈ స్థాయి పరివర్తనని కపిల కాశీపతిగారు ఎంతో నేర్పుగా చేశారు. సీత జీవితం కూడా పలు మార్పులకి లోనయింది. చిత్రలేఖనంలో తన సహాధ్యాయి రత్నం అనే యువకుడితో అమరావతిలో ఆమెకి తొలి శారీరక అనుభవం సిద్ధించింది.

సత్యం పిన్ని, సీత మేస్టారి మనసులు కలిశాయి. వారిద్దరికీ వెంకయ్యగారు పెళ్లిచేసి వేరు కాపురం పెట్టించారు. ఆ తర్వాత సరైన కారణం ఏమిటో చెప్పకుండానే మంగ తన ఊరు వెళ్లిపోయింది. రత్నం తన తొందర తీర్చుకుని తన దారిన తను వెళ్లిపోయాడు. తండ్రికి ఎప్పటి నుంచో అంటే తల్లి బతికున్న రోజుల్నుంచి జయప్రద అన్న ఆవిడతో సంబంధం ఉందని సీతకి తెలిసింది. స్వరాజ్య ఉద్యమంలో వెంకయ్యగార్ని అరెస్టు చేసి జైల్లో ఉంచారు. దాంతో తండ్రి వ్యాపార బాధ్యతలన్నీ సీత మీద పడ్డాయి.

ఇన్ని ఘర్షణల్లో రాటుతేలి సీత మంచి వ్యవహర్త అయింది. డబ్బుకి లోటు లేదు. ధైర్యం ఉంది. ఏ వ్యాపారం చేసినా కలిసొస్తోంది. సమాజంలో పలుకుబడి ఉంది. అన్నీ బాగానే ఉన్నా, ఆమె మనసులో అదే కలత 'ఇంతకీ నేనెవరు?' తండ్రిని అడిగేస్తే? ఆయన. 'నీ అనుమానం నిజం కాదమ్మా!' అంటే నమ్మగ

## రచనారంగంలో రాణకెక్కిన కాశీపతి



బహుముఖ ప్రజ్ఞాశాలి, రచయిత, పాత్రికేయుడు అయిన కపిల కాశీపతి పశ్చిమగోదావరి జిల్లా తణుకులో జన్మించారు.

రచనా రంగంలో ఆసక్తి ఉన్న కాశీపతి న్యాయవాద వృత్తి వదిలి పాత్రికేయరంగంపై మక్కువ చూపారు. మొక్కపాటి నరసింహశాస్త్రి 'శక్తి', గూడవల్లి రామబ్రహ్మం 'ప్రజామిత్ర', ఆంగ్ల పత్రిక 'మెయిలు', 'ఆంధ్ర జనత'లలో విలేకరిగా, సంపాదకుడుగా పనిచేశారు. ఆలిండియా రేడియోలో తెలుగు వార్తా ప్రసారకుడిగా వ్యవహరించారు. ఉమ్మడి మద్రాసు, హైదరాబాద్ రాష్ట్రాల్లో ప్రభుత్వ ప్రచార శాఖాధికారిగా పనిచేశారు.

తనకు మిత్రులైన కాసు బ్రహ్మానందరెడ్డి జీవిత చరిత్రను ఆంగ్లంలో సంక్షిప్తంగా, తెలుగులో బృహత్ గ్రంథంగాను రచించారు.

రవీంద్రనాథ టాగూరు గురించి 'రవియాత్ర' మొదటిభాగం మాత్రమే ముద్రితమైంది. కాకతీయాంధ్రులు, స్వయంవరం నవలలు రచించారు. ఏది రాసినా సాంఘిక, రాజకీయ, ధార్మిక విషయాలను సందర్భానుసారం ప్రవేశపెట్టి సమగ్రమైన సమాచారం అందించడం కాశీపతి రచనలల్లో ముఖ్యలక్షణం. అనేకానేక సాహిత్య, నటీనట సంఘాలతో సంబంధం ఉన్న కాశీపతి 1973లో మహర్నవమినాడు పరమపదించారు.

---

లదా? ఎటుతిరిగీ కలతే.

జైలు నుంచి విడుదలైన వెంకయ్యగారు సన్యసించారు. సీత కళ్లెదురుగానే ఆమె తండ్రి సచ్చిదానంద భారతీస్వామిగా మారిపోయారు. సీతకి తెలిసిన రత్నం శాంతినికేతన్‌కు వెళ్లిపోయాడు. ఆమె ఇష్టపడిన రాముడు సేవాగ్రామ్ వెళ్లాడు. సీతలో ఒక రకం ఉదాసీనత ఏర్పడింది. ఆ తర్వాత ఎదురైన సంఘటనలకి లొంగిపోయే కీలుబొమ్మగా మారింది ఒంటరితనంలో.

సీత తరువాత మద్రాసుకు మకాం మార్చింది. మనసుకు నచ్చినట్టు మగవారితో గడిపింది. గర్భవతి అయింది. తల్లి కావాలని రహస్యంగా కలకత్తా వెళ్లి ఓ నర్సింగ్ హోమ్‌లో చేరింది. వికృతంగా జన్మించిన ఆ శిశువు మరణించింది. తన అవస్థలన్నీ మరిచిపోవటానికి సీత చిత్రకళలో మునిగిపోయింది. మ్యూజియమ్‌లు తిరిగింది. కోణార్క్, పూరీ వెళ్లింది. విదేశీయులతో పరిచయమైంది. సన్నిహితంగా మెలిగింది. ఎన్ని అనుభవాలు ఎదురైనా సీతని ఆ ప్రశ్న వదలలేదు. అదే 'ఇంతకీ నేనెవరు?'

చివరికి సీత ఓ అనాథ శిశువుకి తల్లి అయింది. ఆ పిల్లపేరు 'శ్యామ'. శ్యామ 'అమ్మా!' అంటుంది.. నేను కరిగిపోతాను. నా మనసులో మబ్బులు చెల్లాచెదురైపోతాయి. శ్యామ నా సూర్యుడు, శ్యామ నా చంద్రుడు, నా మనసులో దీపం. శ్యామే నేను.. నేనే శ్యామ. శ్యామ నా ప్రశ్నకి జవాబు అన్న సీత పలుకులతో ఈ నవల ముగుస్తుంది.

స్త్రీ అస్తిత్వ పరమార్థం మాతృత్వమే అన్న తాత్విక నేపథ్యం కోసం 'ఇంతకీ నేనెవరు?' నవల రాశారు కపిల కాశీపతిగారు. స్త్రీ అనే కాదు నిజానికి సృష్టి తాత్వికతా అదే. ఇంతటి గాఢమైన విషయాన్ని నవలగా తీర్చిదిద్దటం కోసం ఆయన ఎంచుకున్న శిల్పం కూడా గాఢమైందే. ఈ నవలలో కథ ఇదే.. సంఘటనలు ఇవే.. నేపథ్యం ఇదే.. అని తేలిగ్గా చెప్పలేం. ప్రవాహంలోని మలుపుల్లా ఇందులోని వస్తువు రకరకాల మలుపులు తిరిగింది. చిన్నపల్లెలో ఆరంభమైన కథ, దేశం అంతా తిరిగి ఖండాంతరాల దాకా విస్తరించింది. ఆ కాలంనాటి సాంఘిక జీవితం, రాజకీయ పరిణామాలు, మనుషుల తీరు, వ్యవస్థ స్వరూపం.. ఈ నవల అంతా పరుచుకుని ఉంది. మనుషుల అత్యంత సహజమైన ప్రవర్తన, అందులోని నైతికానైతిక బలాలు, బలహీనతలు, విశృంఖల విహారం లాంటి పరస్పర భిన్నతలు ఈ నవలలో చాలా ఉన్నాయి. ఎన్ని ఎలా ఉన్నా ఇది ఓ చిక్కనైన జీవిత చిత్రణ.

'అది అంతా సువాసనమయం. మల్లెపువ్వు, మంచి గంధం మేళవించిన చల్లని సువాసన ఆ సుగంధమే, ఆ చల్లదనమే అమ్మ.

ఇటువంటి విలువైన వ్యక్తీకరణలు ఈ నవలలో ఎన్నో ఉన్నాయి. అన్ని రకాలుగా ఇది ఎన్నదగిన నవల. తప్పక చదవదగ్గది 'ఇంతకీ నేనెవరు?' నవల. ©

# మనసున ఉన్నదీ...

★ ఉగాది శోభతో ముఖచిత్రంగా వెలువడిన మార్చి సంచిక కమనీయ కావ్యంలా మనసుకు హత్తుకుంది. వ్యవస్థలో నేడు డబ్బుతోనే మానవసంబంధాలు అన్నీ ముడిపడి ఉన్నాయన్న నగ్న సత్యాన్ని పురుషోత్తం సోదాహరణంగా చెప్పినతీరు, చివరిగా గుట్టు విప్పి అందర్నీ దిమ్మతిరిగేలా బోల్తా కొట్టించిన వైనం 'నిజరూపాలు' నవలలో వాణిశ్రీ చక్కగా పొందుపరిచారు. వియత్నాం కథ 'పసివాడి పెద్దమనసు'లో 'కీమ్' పాత్ర చిత్రణలో దయ, కరుణ, ఆదరణ, లాంటి సానుకూల మనస్తత్వాన్ని ఎంతో ఉన్నతంగా తీర్చిదిద్దారు. చతుర కతలు మూడూ ఆణిముత్యాలే. 'తనదాకా వస్తే!' మరీను. రచయితలకు అభినందనలు.

**– యు. చిట్టిబాబు,**
న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

★ వాణిశ్రీగారు 'నిజరూపాలు' నవలలో పల్లె వాతావరణాన్ని చక్కగా ఇమిడ్చారు. డబ్బు, ఆస్తి విషయాలకొచ్చేసరికి చాలా కుటుంబాల్లో కనిపిస్తున్న మోసాలు మనల్ని హెచ్చరించేట్టు చిత్రీకరించారు. పేరుకు తగ్గ మంచి నవల ఇది.

**– జి.జి.కె. రావు,** అరసవల్లి

★ భూమి సూర్యుని చుట్టూనే కాదు, డబ్బు చుట్టూ కూడా తిరుగుతుందన్న తిలక్ మాటలకు అక్షరరూపాన్నిచ్చిన 'నిజరూపాలు' ఆద్యంతం ఉత్కంఠభరితంగా చదివించింది. నవలావలోకనం 'వెలుగులో వెలది' సమీక్ష, చతుర కతలు బాగున్నాయి. 'అందరూ అందరే' శ్రీనాధుని చమత్'కారం' పండితుల నషాలానికంటింది. ఆర్కేలక్ష్మణ్ చతురోక్తులు నవ్వించాయి.

**– భాగ్యలక్ష్మీ రాజేశ్వర్,** పొన్కల్

★ విభిన్నమైన ముఖచిత్రంతో చతుర ఎంతగానో ఆకట్టుకుంది. మానవ సంబంధాలకు పెద్దపీట వేస్తూ కొనసాగిన వాణిశ్రీ నవల 'నిజరూపాలు' చక్కగా ఉంది. చతురకత 'కోల్డ్‌వార్' చాలా బాగుంది. ఆర్కేలక్ష్మణ్ చతురోక్తుల ద్వారా వారిని మా జ్ఞాపకాలలో మెదిలేలా చేశారు. 'భామనే.. సత్యభామనే..!'లో పోలినవెగా తను చేయాల్సిన పనులు ఎప్పటికపుడు కాగితం మీద రాసుకోవడం ఆదర్శంగా ఉంది. 'ఆన్‌లైన్ రీటైల్ స్టోర్' చతుర 'సమ్'గతులు వివరాలు చక్కగా ఉన్నాయి. చమత్'కారం' బాగుంది.

**– నేమాన సుభాష్‌చంద్రబోస్,**
పోతినమల్లయ్యపాలెం, విశాఖపట్నం

★ 'నిజరూపాలు' నవలలో పురుషోత్తం ముందుచూపుకు హార్దికాభినందనలు. వియత్నాం కథ 'పసివాడి పెద్దమనసు' బాగుంది. 'వెలుగులో వెలది' నవల సమీక్ష, చతురకతలు బాగున్నాయి.

**– పట్టిసపు శేషగిరిరావు,** విశాఖపట్నం

★ మార్చి చతుర సంచిక నూతన తెలుగు సంవత్సరానికి ఆహ్వానం పలుకుతూ ఉగాది శుభాకాంక్షలు తెలియజేసి, కనులవిందు చేశాయి. వియత్నాం కథ 'పసివాడి పెద్దమనసు' ఆలోచనాత్మకంగా ఉంది. చైనా కథ 'శ్రమ మాధుర్యం' రెక్కల కష్టంలో ఎంతటి ఆనందం ఉంటుందో ప్రత్యక్షంగా తెలియజేసింది. చతురంగం ద్వారా ఆలోచనలు పదునెక్కి తెలుగు భాషాభివృద్ధి, వికాసాలకు ఎంతో స్ఫూర్తి, సామర్థ్యం లభిస్తున్నాయి.

**– టి.వి.డి.ఎన్. సీతారామారావు,** కొత్తగూడెం

★ 'ధనమూలం మిదం జగత్' అని వట్టిగా అన్నారా? కాలం మారుతోంది. మనుషులు మారుతున్నారు. భావాలు, అభిప్రాయాలతో పాటు వ్యక్తుల విలువలూ మారిపోతున్నాయి. నవలలో పురుషోత్తం తన పిల్లలకు బంధువుల మిత్రుల మనస్తత్వాలు తెలియజేయాలనే తాను దుబాయి వ్యాపారంలో దివాళా తీసినట్టు నాటకం ఆడాడు. నేటి సమాజంలో డబ్బు ముందు అన్ని విలువలూ పడిపోయాయనేదే నిజం.

**– ధప్పూరి శ్రీధరాచార్యులు,** సీతారాంబాగ్

14

# భామనే.. సత్యభామనే..!

**నిన్న అమెరికన్ మోడల్.. నేడు బాలీవుడ్‌లో అవకాశాల్ని అందిపుచ్చుకుంటూ దూసుకెళ్తున్న కథానాయిక! రణ్‌బీర్ కపూర్ పక్కన 'రాక్‌స్టార్' సినిమాతో తెరంగేట్రం చేసిన ఆ భామ 'మద్రాస్ కేఫ్', 'మై తేరా హీరో' సినిమాలలోనూ మెరిసింది. ప్రయాణాలు చేయడం, సెల్ఫీస్ తీయడం అంటే మహా సరదా ఆమెకు. అమెరికా నెక్ట్స్ టాప్ మోడల్‌గా రెండుసార్లు ఎంపికైన ఆమె మరెవరో కాదు.. నర్గీస్ ఫక్రీ.. మరి ఆమె సొగసు రహస్యాలేంటో తెలుసుకుందాం..**

## సొగసు చూడతరమా...



ఆరోగ్యకరమైన ఆహారం, సానుకూల ఆలోచనలు నా చర్మసౌందర్య రహస్యం! చక్కని నిద్ర, మంచి ఆహారం, సరిపడ నీరు.. ఈ మూడూ ప్రతి మనిషికీ చాలా అవసరం.

ఆహారం విషయంలో చాలా జాగ్రత్తగా ఉంటాను. తాజా కూరగాయలు, అరటిపండ్లు, గుడ్లు ఎక్కువగా తీసుకుంటాను. పంచదార ఉండే పదార్థాలు, బయటి పదార్థాలు, శీతల పానీయాలను దూరంగా ఉంచుతాను. నీరు ఎక్కువగా తాగుతాను. రెండు గంటలకోసారి తేలికపాటి ఆహారం తీసుకుంటాను. ఉదయం అల్పాహారంలో ఉడకబెట్టిన మూడు కోడి గుడ్లు తప్పనిసరి. సాయంత్రం సమయంలో డ్రైఫ్రూట్స్ తింటాను.

ఆహారం తీసుకునేపుడు మంచినీరుకు బదులు నిమ్మరసం తాగుతాను. సోడా, జూస్‌లను పూర్తిగా పక్కన పెడతా. ఎందుకంటే అవసరానికి మించిన షుగర్ చర్మానికి హాని చేస్తుంది. ప్రోటీన్లు, ఎక్కువగా పాలు, పెరుగు, మొలకలు నా రోజువారీ ఆహారంలో ఉండేలా చూసుకుంటాను. శరీరం డీహైడ్రేట్ అవకుండా మధ్యమధ్యలో కొబ్బరినీళ్ల వంటి ద్రవపదార్థాలు సేవిస్తుంటాను.

ఫిట్‌నెస్ అనేది 70-80 శాతం ఆహారం, మిగిలినది వ్యాయామం మీద ఆధారపడి ఉంటుంది. జిమ్‌కి వెళ్లడమంటే బోర్. ప్రతిరోజూ వ్యాయామం, డ్యాన్స్ చేస్తాను. అవి రోజంతా ఉత్సాహంగా, ఆరోగ్యంగా ఉండేందుకు ఉపకరిస్తాయి. యోగా, ఈత వంటి వ్యాయామాలను ఇష్టపడతాను. వారానికి మూడు రోజులు యోగా, రెండు రోజులు ఈత ఉంటుంది. యోగా కండరాలను దృఢపరుస్తుంది. ప్రతిరోజూ ఉదయం పదినిమిషాలు ధ్యానం చేస్తాను. అది మనసును ప్రశాంతపరచడమే కాదు, రోజును ప్రారంభించేందుకు కావలసిన శక్తినిస్తుంది. ఉదయం స్ట్రెచెస్, గుండెకు సంబంధించిన వ్యాయామం చేస్తుంటాను. వ్యాయామం ఇష్టంగా చేయడం వల్ల మానసిక ఉల్లాసం పెరుగుతుంది. ఖాళీ సమయాల్లో టెన్నిస్, సాకర్, వాలీబాల్ వంటి ఆటలు ఆడతాను. ఇవి శరీరం దృఢపడేందుకు బాగా దోహదం చేస్తాయి. ఎక్కడికైనా వెళ్లాలనుకుంటే, కొద్ది కొద్ది దూరాలైతే నడకకే ప్రాధాన్యమిస్తా. అమెరికాలో ఉన్నపుడు ఇంట్లోకి కావలసిన సామాన్లను సైకిల్ మీద వెళ్లి తీసుకొచ్చేదాన్ని. ముంబయి వాతావరణం, ట్రాఫిక్, కాలుష్యం వల్ల అలా చేయలేకపోతున్నాను. ఏ మాత్రం సమయం దొరికినా డ్యాన్స్ చేయడానికి ఇష్టపడతాను. నాజూగ్గా ఉండేందుకు ఇది చాలా ఉపయోగపడుతుందని నా అభిప్రాయం. ఎలివేటర్‌ను ఉపయోగించకుండా మెట్లు ఎక్కేందుకే ప్రయత్నం చేస్తా.



గోరువెచ్చని కొబ్బరి నూనెతో 20 నిమిషాలు తలకు మసాజ్ చేయించుకుంటాను. జుట్టు ఆరోగ్యంగా ఉండేందుకు దోహదపడుతుంది, అందం కూడా ఇనుమడిస్తుంది.

సేకరణ : **సంధ్యారాణి**

## మహిళా శక్తి



**విజయం మ్యాజిక్‌లా క్షణాల్లో వచ్చేయదు. కోరిక, శ్రమ, నిరంతర ప్రయత్నం ఉన్నపుడే అది నిన్ను వరిస్తుంది.**

**– మిచెల్లీ ఒబామా**



**మహిళల అభివృద్ధికి సాధికారతను మించిన మార్గం లేదు.**

**– కోఫీ అన్నన్**

## పెళ్లికి ముందు... పెళ్లి తర్వాత...

పెళ్లి మైకం వదిలిపోయాక కొందరు అబ్బాయిల మనోగతమిది..

| పెళ్లికి ముందు... | పెళ్లి తర్వాత... |
| --- | --- |
| ★ నేను హీరో నెం. 1 | ★ కాదు కూలీ నెం.1 |
| ★ ప్రేమలో పడ్డాను, మబ్బుల్లో తేలియాడుతున్నట్టుంది! | ★ అబ్బా! ఎందుకురా ఈ బురదలో పడ్డాను? |
| ★ నీవు లేకుండా ఒక్క క్షణం జీవించలేను, | ★ ఒక్క క్షణం కూడా నిన్ను భరించే ఓపిక లేదు. |
| ★ ఏదైనా మాట్లాడు, | ★ కాసేపైనా నోరుమూసుకుని ఉండలేవా? |
| ★ మళ్లీ ఎపుడు కలుగుతుందో దేవీ దర్శనం? | ★ ఎపుడు వదులుతుందిరా ఈ దెయ్యం..! |

## పొట్ట తగ్గించే ఆహారం

★ **గుడ్లు:** కొవ్వును కరిగించే సహజమైన ప్రొటీన్లు వీటిలో పుష్కలంగా ఉంటాయి. ఉదయం అల్పాహారంలో వీటిని తీసుకోవడం వల్ల ఆకలి మందగిస్తుంది.

★ **బాదం, జీడి పప్పులు:** నిజానికి కొవ్వు పదార్థాలు ఎక్కువే ఉన్నప్పటికీ తగినంత మోతాదులో తీసుకోవడం వల్ల బరువు తగ్గుతారు. ప్రతిరోజూ ఓ నాలుగైదు తీసుకోవడం వల్ల వాటిలోని ప్రొటీన్లు, పీచుపదార్థాలు రక్తంలోని చక్కెర స్థాయిలను క్రమ బద్ధీకరించి ఆకలి మందగిస్తుంది.



**చేపలు:** జీవక్రియల వేగాన్ని త్వరితగతం చేసి నాజూకుతనాన్ని పెంచుతాయి. కొవ్వును కరిగించి బరువు తగ్గించడంలో ఉపయోగపడే ఒమెగా ఫ్యాటీ మూడు ఆమ్లాలతో నిండి ఉంటాయివి.

★ **సోయాబీన్స్:** ప్రోటీన్లు, పీచు, యాంటి ఆక్సిడెంట్స్ పుష్కలం. పులుసుల్లో వేసుకోవచ్చు లేదా వేయించుకుని తినొచ్చు.

★ **యాపిల్:** సహజంగా కొవ్వు కరిగించే గుణమున్న పండు. ఒక్కో యాపిల్‌లో 5 గ్రాముల పీచు పదార్థం ఉంటుంది. తక్కువ కెలోరీలు, పంచదార ఉంటాయి. రోజుకు ఒక యాపిల్ తినడం వల్ల బరువు తగ్గుతారు.

★ **ఆకు కూరలు:** ఫైటోన్యూట్రియంట్స్, పీచు పదార్థాలు మెండుగా ఉంటాయి. మాంసాహారం తీసుకునేముందు ఆకుకూరల సలాడ్ తీసుకోవడం మంచిది. లేదా రెంటినీ కలిపి వండుకోవడం మేలు. శక్తిస్థాయిలను పెంచడమే కాక బరువు తగ్గేందుకు ఉపకరిస్తుంది.

★ **అవకాడో:** ఉదరంలోని కొవ్వును కరిగించే మోనోఅన్‌సాచురేటెడ్ ఫ్యాటీ యాసిడ్స్ ఇందులో ఉంటాయి.

★ **జొన్నలు:** సగం కప్పు జొన్నల్లో 11 గ్రాముల ప్రోటీన్లు, 5 గ్రాముల పీచు ఉంటాయి. బరువు తగ్గేందుకు బాగా ఉపకరిస్తాయి.

★ **బెర్రీస్:** పంచదార స్థాయి తక్కువ.. యాంటి ఆక్సిడెంట్స్ పుష్కలం! రోజూ ఓ కప్పు బెర్రీస్ తీసుకుంటే త్వరగా సన్నబడతారు. జీర్ణక్రియను వేగవంతం చేసి, రక్తంలోని చక్కెర స్థాయిలను క్రమబద్ధీకరిస్తాయి.

## టెక్ గురూ!




**మేజిస్టో**

పండుగలు, చిన్న చిన్న ఫంక్షన్లపుడు సెల్‌ఫోన్‌తో ఫొటోలు క్లిక్‌మనిపిస్తుంటాం. వాటిని సరదాగా అపుడపుడూ ఒక్కో ఫొటో ఓపెన్ చేసి చూస్తుంటాం. అలా కాకుండా ఒకసారి క్లిక్ చేస్తే ఫొటోలన్నీ ఒక దాని తరువాత ఒకటి సినిమాలాగా వాటంతట అవే వస్తే చేతులకు పనిలేకుండా ఎంత బాగుంటుంది కదూ.. అందుకూ ఓ యాప్ ఉంది. అదే మేజిస్టో. దీనిలో వీడియోను ఆకర్షణీయంగా ఎడిట్ చేసి దానికి మ్యూజిక్ ట్యూన్‌గా మీ మాటలనే యాడ్ చేసుకోవచ్చు. ఉచిత వెర్షన్‌లో ఐదు ఫొటోలతో ఆల్బమ్ తయారు చేసుకునే వీలుంది. వీటిని క్లౌడ్ స్టోరేజ్‌లో భద్రపరచుకుని వీలైనపుడల్లా చూడొచ్చు.

**తెలుగు ప్యాడ్**

ఇపుడు మొబైల్లోనూ తెలుగులో టైప్ చేసుకునే సౌలభ్యం ఉంది. మీ మొబైల్‌కు యునిక్ కోడ్ సపోర్ట్ ఉంటే తెలుగు ప్యాడ్ యాప్ ద్వారా తెలుగులో టైప్ చేసి ఆ టెక్స్ట్‌ను ఫైల్ రూపంలో మెసేజ్ చేయొచ్చు, మెయిల్ కూడా చేయొచ్చు. యాప్‌ను ఇన్‌స్టాల్ చేశాక నెట్ కనెక్షన్ తీసినప్పటికీ తెలుగులో టైప్ చేసుకునేందుకు వీలుగా ఉంటుంది. ఆ టెక్ట్స్‌ను కాపీ చేసి కావలసిన చోట పేస్ట్ చేసుకోవచ్చు కూడా. ఆండ్రాయిడ్ యూజర్లు గూగుల్ ప్లే నుంచి ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు. తెలుగు ప్యాడ్ యాప్ వంటిదే లిపికార్ తెలుగు టైపింగ్. ఈ యాప్‌ను ఇన్‌స్టాల్ చేసిన తరువాత కీబోర్డును ఎంపిక చేసుకుని తెలుగులో టైప్ చేసుకోవచ్చు.

# జతపరచండి

ఇక్కడ కొందరు హీరోల పేర్లు, సినిమాల్లో వారి ఉద్యోగాలు ఉన్నాయి. ఏ హీరో ఏ ఉద్యోగస్థుడుగా నటించాడో మీరు కనిపెట్టగలరేమో ప్రయత్నించండి..

| | |
|---|---|
| 1. మోహన్‌బాబు | ఎ. ఆటోడ్రైవర్ |
| 2. శోభన్‌బాబు | బి. బడిపంతులు |
| 3. కృష్ణ | సి. లారీ డ్రైవర్ |
| 4. ఎన్.టి. రామారావు | డి. పోస్ట్‌మేన్ |
| 5. చిరంజీవి | ఇ. డాక్టర్ బాబు |
| 6. నాగార్జున | ఎఫ్. కూలీ నంబర్1 |
| 7. వెంకటేష్ | జి. రిక్షావోడు |
| 8. బాలకృష్ణ | హెచ్. ప్రైవేట్ మాస్టర్ |

జవాబులు ఈ సంచికలోనే..

కూర్పు : కావ్య

## జోక్స్...

### పదోవాడివి!

బాగా జబ్బు చేసి బాధపడుతున్న వ్యక్తి డాక్టరు దగ్గరకు వెళ్లాడు.

**రోగి:** నేను కోలుకోవడానికి ఎంత శాతం అవకాశముంది డాక్టరు గారూ!

**డాక్టరు:** వందశాతం! ఈ జబ్బు వచ్చిన పది మందిలో ఒక్కరు బతుకుతారని మెడికల్ రికార్డులు చెబుతున్నాయి. ఈ జబ్బుతో నాదగ్గర చికిత్స తీసుకుంటున్న వారిలో నువ్వు పదోవాడివి. మిగతా తొమ్మిది మంది చనిపోయారు!



### ఒక్క పైసా వెయ్యొద్దు!

భార్యాభర్తలు ఊరెళ్లేందుకు బస్టాండుకు వెళ్లారు. అక్కడ ఓ బిచ్చగాడు ధర్మం చెయ్యండంటూ భర్తను అడిగాడు. అతను ఓ పది రూపాయల నోటు ఇవ్వబోయాడు.

**భార్య:** వాడికి ఒక్క పైసా కూడా ఇవ్వకండి.

**భర్త:** పాపం! రెండు రోజుల నుంచి తిండి లేనట్లుగా ఉన్నాడు, పోనీలే.



**భార్య:** లేదు.. వాడు ఆ మధ్య మనింటికి అడుక్కోవడానికి వస్తే పోనీలే అని అన్నంతో పాటు మిగిలిపోయిన కోడిగుడ్డు పులుసు కూడా వేశాను. మరుసటిరోజు నాకు వంటల తయారీ పుస్తకం తెచ్చిచ్చాడు వాడు!

# పచ్చి మామిడి పానీయం

చిటికెలో రుచిగా..!

*తయారుచేయు విధానం :*

ముందుగా మామిడికాయలు శుభ్రంగా కడిగి తొడిమ తీసేయాలి. ఒక విజిల్ వచ్చేవరకు కుక్కర్‌లో వాటిని ఉడకబెట్టాలి. జీలకర్రను మంచి వాసన వచ్చేవరకు వేయించి మెత్తగా పొడి చేసి పెట్టుకోవాలి. మామిడికాయలు చల్లారాక తొక్క తీసి, టెంక నుండి గుజ్జును పూర్తిగా తీసి పక్కన పెట్టుకోవాలి. తర్వాత ఓ గిన్నెలో కప్పు నీళ్లు, పంచదార



కలిపి అది కరిగేవరకు వేడిచేయాలి. చల్లారాక అందులో మామిడిగుజ్జు, పుదీన ఆకులు, నల్ల ఉప్పు వేసి మిక్సీ పట్టాలి. అందులో మిగిలిన నీళ్లు కూడా పోసి కలపాలి. ఉప్పు, పంచదార సరిపోలేదనుకుంటే మళ్లీ కలుపుకోవచ్చు. తరువాత ఆ మిశ్రమాన్ని వడకట్టుకోవాలి. దీనికి జీలకర్ర పొడి కలిపి, చిదిమిన ఐస్‌తో చల్లచల్లగా పచ్చి మామిడి పానీయాన్ని అందరికీ అందించవచ్చు. వేసవిలో వేడి నుండి ఈ పానీయం చక్కని ఉపశమనాన్నిస్తుంది.

## కావలసిన పదార్థాలు

- పచ్చిమామిడికాయలు - 3
- పుదీనా ఆకులు - 1/2 కప్పు
- నల్ల ఉప్పు - 1/4 టీస్పూన్
- జీలకర్ర - 1 1/2 టీ స్పూన్
- పంచదార - 1/2 కప్పు
- నీరు - 6 కప్పులు

## పంటి నొప్పికి ఉపశమనం!



పంటినొప్పి బాధిస్తుంటే లవంగం నూనెలో దూదిని ముంచి నొప్పి ఉన్నచోట అద్ది ఉంచాలి. క్షణాల్లో ఉపశమనం లభిస్తుంది. బాక్టీరియా వల్ల వచ్చే పంటి నొప్పిని లవంగం నూనె చక్కగా నియంత్రిస్తుంది.

**జతపరచండి జవాబులు :** 1-డి, 2-ఇ, 3-హెచ్, 4-బి, 5-జి, 6-ఎ, 7-ఎఫ్, 8-సి

## చిట్కాలక్ష్మి



- ఏదైనా సలాడ్‌కు బాగా నానబెట్టిన గుప్పెడు పెసరపప్పు కలిపి తింటే ఎక్కువ పోషకాలు అందుతాయి.
- ఇడ్లీ, దోశె వంటి వాటికి కావలసిన పిండిని మిక్సీ పట్టేటపుడు సరిపడా నీరు పోస్తే త్వరగా మెదుగుతుంది.
- గోడలకు నెమలి పించం పెడితే ఇంట్లోకి బల్లులు రాకుండా ఉంటాయి.

## చతురంగం - 48 జవాబులు

| 1 గో | 2 పా | 3 ల | గో | 4 పా | ల |  | 5 చీ |  | 6 అ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 7 పా | వు | లు |  | రి |  | 8 రా | మ | 9 రా | జు |
| లు |  | 10 మా | యా | జా | 11 ల | ము |  | 12 ఘ | డు |
| 13 డు | 14 రే | పూ |  | 15 తం | గే | డు | 16 పూ | వు |  |
|  | వ |  | 17 స్త్రీ |  | ర |  | 18 స | లు | 19 పు |
| 20 ప్ర | తి | 21 మ |  | 22 అ | హో | 23 బి | లం |  | ర |
| తి |  | 24 ర | లు | ధ |  | డ్డ |  | 25 పా | ము |
| 26 ఘ | ర్ష | ణ |  | 27 ర | వం |  | 28 కా | దు |  |
| ట |  | 29 ము | 30 ఖ | ము |  | 31 కా | ర | క | 32 ము |
| 33 న | తి |  | రం |  | 34 హ | న | ము | లు | వా |

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**పద్మానవీన్ శిష్టా**
ఇం. నెం. 1-1-90,
జనగాం, వరంగల్ జిల్లా
పిన్ : 506167

## సరైన సమాధానాలు రాసిన వారు

1. తూములూరు సత్యనారాయణమూర్తి, ఖమ్మం, 2. ఎస్. జానకి సుబ్రహ్మణ్యం, న్యూ బాకారాం, హైదరాబాద్, 3. ఎ. రంగనాథం, బెంగళూరు, 4. పి. దేవసేనమ్మ, సిద్ధార్థనగర్, హైదరాబాద్, 5. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోలు, హైదరాబాద్, 6. అల్లబోయిన జయలక్ష్మి, విశాఖపట్నం, 7. పొన్నపల్లి వెంకటప్పయ్య, నూజివీడు, 8. ధరణి పద్మాసన, నల్లకుంట, 9. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 10. పి.వి. ఎల్. సుజాత, సైనిక్‌పురి, సికింద్రాబాద్, 11. తిప్పావఝుల తులశమ్మ, ఈస్ట్ ఆనందబాగ్, 12. యు. విజయశేఖర రెడ్డి, కూకట్‌పల్లి, 13. గోగాడ శ్రీనివాసరావు, షిర్వల్, మహారాష్ట్ర, 14. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా, 15. యు. చిట్టిబాబు, న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా, 16. అత్తిలి కస్తూరిభాయి, తిరుపతి, 17. జి.ఎస్. శ్రీనివాసరావు, బొబ్బిలి, విజయనగరం జిల్లా, 18. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 19. నోరి శివప్రకాశం, నెల్లూరు, 20. మొక్కపాటి హిమకిరణ్‌కుమార్, కర్నూలు, 21. కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం, 22. ఎస్. శ్రీనివాసమూర్తి, కుప్పం, 23. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 24. సి.జి. శంకరరావు, ఎ.ఎస్. రావు నగర్, 25. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 26. సి. నిర్మల,తిరుపతి, 27. బి. నేహారెడ్డి, కడప, 28. వి. వెంకట సుబ్బారావు, బెంగళూరు, 29. పి. భావన, బర్కత్‌పురా, హైదరాబాద్, 30. పసుమర్తి జయశ్రీ, ఎం.జె. కాలనీ, హైదరాబాద్, 31. పి. శుభ, బంజారాహిల్స్, 32. పి. లక్ష్మీతులసి, బెంగళూరు, 33. ఓలేటి కస్తూరి, పార్వతీపురం, 34. సిహెచ్.ఎ. నరసింహం, బెంగళూరు, 35. టి. అంజలి, తిరుపతి, 36. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 37. మహావాది అశోక్ కుమార్, చిక్కడపల్లి, 38. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 39. యు. నరసింహమూర్తి, లాలాపేట, 40. ఆంధ్ర అచ్యుతరామయ్య, తణుకు, 41. పి.వి. రంగాచార్యులు, వనస్థలిపురం, 42. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 43. డి.వి. సూర్యకుమారి, విశాఖపట్నం, 44. ఆర్.వి.సిహెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 45. అడపా సత్యనారాయణ బాబ్జి, కూకట్‌పల్లి, 46. కాకర్లమూడి రామలింగమూర్తి, తణుకు, 47. యు.యు.యు., ఎమ్మిగనూరు, కర్నూలు జిల్లా, 48. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 49. డా. సి. జనార్దనసింగ్, నల్లకుంట, 50. జి. ప్రభాకర్ రావు, మల్లాపూర్, హైదరాబాద్, 51. నియాజ్ అలీ, ఉప్పరపల్లి, హైదరాబాద్, 52. కె.ఎ.ఎన్. భుక్త, శ్రీకాకుళం, 53. ఆర్. లక్ష్మి, మోతీనగర్, 54. సి. సప్తగిరి ప్రసాద్, తిరుపతి, 55. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 56. అరుంధతీ చంద్ర, కరీంనగర్, 57. విన్నకోట పద్మావతి, సఫిల్‌గూడ, 58. డా. తూములూరి పార్థసారథి, చైతన్యపురి, హైదరాబాద్, 59. టి.వి.డి.ఎన్. సీతారామారావు, కొత్తగూడెం, 60. ఆర్. బాలాజీరావు, మియాపూర్, 61. లింగబత్తుల భవ్యశ్రీ, ఆర్.సి. పురం, హైదరాబాద్, 62. పి.వి. రమణారావు, మల్కాజ్‌గిరి, 63. దేవళ్రాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, హైదరాబాద్, 64. ఇయ్యుణ్ణి రోహిణి, తణుకు, 65. వాడపర్తి వెంకటరమణ, గొల్లలవలస, శ్రీకాకుళం జిల్లా, 66. కందికుప్ప వెంకటరమణ, విశాఖపట్నం, 67. బి.వి. లక్ష్మి, వైజాగ్, 68. వాసా మోహనరావు, తగరపువలస, విశాఖ జిల్లా, 69. తొయ్యేటి వెంకట సూర్యం, విశాఖపట్నం, 70. జి. సత్యలక్ష్మి, విజయవాడ, 71. కె.వి. ఎస్.ఎన్. మూర్తి, బృందావన్ కాలనీ, హైదరాబాద్, 72. కె. శ్యాంసుందర్‌రెడ్డి, మంచిర్యాల, ఆదిలాబాద్ జిల్లా, 73. జి. జయచంద్రగుప్త, కర్నూలు, 74. డా. శివభూషణం, కర్నూలు, 75. కొత్తపల్లి ప్రసాదరావు, టెక్కలి, 76. అల్లూరి ఉమ, సింగరాయకొండ, ప్రకాశం జిల్లా, 77. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 78. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, తూ.గో. జిల్లా, 79. కోకా శైలజ, ఇ.సి.ఐ.ఎల్, హైదరాబాద్, 80.పట్టిసపు శేషగిరిరావు, విశాఖపట్నం, 81. సిహెచ్. కోటయ్యశాస్త్రి, మాండ్య, కర్ణాటక, 82. వి. ఇందిరా సుబ్రహ్మణ్యం, సోమాజిగూడ, హైదరాబాద్, 83. వి.ఆర్.కె. అల్లమరాజు, కాత్రేనికోన, 84. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 85. ఎం.పి. సుందరి, కూకట్‌పల్లి, 86. టి.ఎల్.ఆర్. ప్రసాదరావు, మచిలీపట్నం, 87. ఎ. బుచ్చంనాయుడు, మెరకముడిదాం, విజయనగరం జిల్లా, 88. వేదుల నరసింహమూర్తి, గుడిమల్కాపూర్, 89. కె. రఘుపతి, అల్వాల్, సికింద్రాబాద్,

*(..128లో)*

# చతురంగం - 49 ఆధారాలు

### అడ్డం

1. నరకంలో ఉండే నది (4)
4. దారి, మార్గం (2)
6. గుడిసెలాటిదే (2)
8. చెల్లింపు (2)
9. నేతాజీ (2)
11. సీతాదేవి తండ్రి (4)
12. 'లిఖించండి' తారుమారు (3)
14. భూమి (3)
16. గుత్త, మొత్తం (2)
18. దుర్యోధనుడ్ని ఇలా అంటారు (3)
20. నష్టానికి వ్యతిరేకం (2)
21. జాతీయ పక్షులు (3)
22. సముద్రమే అటునుంచి (4)
24. 'వద్దా? 'కు గ్రాంథిక రూపం (3)
26. మొదలు, జూ. ఎన్టీఆర్‌కు మంచి పేరు తెచ్చిన చిత్రం (2)
27. తేలిక (3)
29. పవిత్రం, ప్రక్షాళన (3)
31. మనది అటునుంచి (3)
33. పొగడ్త, స్తోత్రం (2)
34. 'గులాబీ' చిత్రంలో విలన్ (2)
35. కిందటినెలలో నిలువుగా వచ్చిన 'చావు' ఇప్పుడు అడ్డమైంది (4)
38. ముల్లు (3)
39. యావ, తపన (2)
40. కోదండం ఎవరి విల్లు? (3)

### నిలువు

1. అశ్వనీదత్తుగారి బేనర్ (4)
2. 'మీరా? ' అన్నదాన్ని ఇలా కూడా అనొచ్చు (3)
3. ఒణీ కాదు.. తొలి బేరం.. కింద నుంచి (2)
5. అశోక వనంలో సీతకు కాపున్న వాళ్లలో మంచి రక్కసి.. శీర్షాసనం (3)
6. రావూరి భరద్వాజగారి గొప్ప నవల (5)
7. ఎక్కువ (2)
10. అమృతం (2)
13. 'అదే విధంగా' ఆంగ్లంలో (2)
15. వృథా (2)
17. క్షేమం, హాయి.. ఉత్తరాల్లో తరచుగా వాడే పదం (3)
18. కంచెర్ల గోపన్న పేరు ఇలా మారింది (4)
19. భార్య (2)
21. మాసం (2)
22. 'ఫేస్‌బుక్' తెలుగు (5)
23. లెక్కలు (3)
24. లక్ష్మణుడికి సీత ఏమవుతుంది? (3)
25. ఆకాశం (2)
26. వారాల్లో మొదటిది (4)
28. ఉప్పు (4)
30. 'నా వంట' కాదు మరి - - -(3)
32. తూతూ మంత్రంగా చేయడాన్ని ఇలా అంటారు (2)
36. 'ర' గుణింతంలో మొదటి రెండు వర్ణాలు (2)
37. గ్రంధి, తాడుతో వేసేది (2)

(127వ పేజీ తరువాయి...)

90. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, హైదరాబాద్, 91. సాలగ్రామ నారాయణరావు, నరసన్నపేట, శ్రీకాకుళం జిల్లా, 92. ధప్పూరి సుధాదేవి, సీతారాంబాగ్, హైదరాబాద్, 93. బిరుదు సురేష్‌బాబు, పేరాల, ప్రకాశం జిల్లా, 94. సూరి నాగ రాజు, రామవరప్పాడు, కృష్ణా జిల్లా, 95. పి. సుజాత, గుంటూరు, 96. దొడియం లక్ష్మీప్రసన్న, మల్లాపూర్, హైదరాబాద్, 97. అనంతుల స్వరూపరాణి, గుంటూరు, 98. కాకర్ల లక్ష్మీప్రసాద్ శర్మ, అయినముక్కుల, ప్రకాశం జిల్లా, 99. యర్రమిల్లి విజయలక్ష్మి, బెంగళూరు, 100. ఆమంచి లక్ష్మి, చెన్నై, 101. తోటపల్లి ప్రదీప్‌శర్మ, గుంతకల్లు, 102. పిడూరి శ్రీదేవి, నెల్లూరు, 103. అవధూత అన్నపూర్ణ, శేరిలింగంపల్లి, హైదరాబాద్, 104. కొక్కెరగడ్డ శ్రీదేవి, అమలాపురం, 105. కొక్కెరగడ్డ అన్నపూర్ణ, మానేపల్లి, తూ.గో. జిల్లా, 106. బి.వి. నరసింహారావు, పేరాల, 107. డి. రామరాజు, మెరకముడిదాం, విజయనగరం జిల్లా, 108. యిర్రి భక్తవత్సలరావు, చిలకలూరిపేట, 109. సౌదామినీ నాగరాజన్, విశాఖపట్నం, 110. డా. చిన్నం వెంకటేశ్వర్లు, విజయవాడ, 111. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 112. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 113. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 114. తిప్పావఝుల కామేశ్వరమ్మ, దగదర్తి, నెల్లూరు జిల్లా.

# చతురంగం - 49

రూ.150/- బహుమతి

గడువు తేదీ : ఏప్రిల్ 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 పై | 2 | | 3 | ■ | 4 | 5 | ■ | 6 | 7 |
| 8 | | ■ | 9 | 10 | ■ | 11 | | | |
| 12 | | 13 | ■ | 14 | 15 | | ■ | | ■ |
| | ■ | 16 టో | 17 | ■ | | ■ | 18 | | |
| ■ | 19 | ■ | 20 | | ■ | 21 | | | ■ |
| 22 | | 23 | | ■ | 24 | | దా | ■ | 25 |
| | ■ | | ■ | 26 | | ■ | 27 | 28 | |
| 29 | 30 | | ■ | 31 | | 32 | ■ | | ■ |
| 33 స్త | | ■ | 34 | | ■ | 35 | 36 | | 37 |
| 38 | | | ■ | 39 | | ■ | 40 | | |

పంపినవారి పేరు: ------------------------------------------

వయసు (     ) చిరునామా : ----------------------------------

-----------------------------------------------------------

------------------- పిన్ : ------------ ఫోన్ : ------------------

## నిబంధనలు

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చు ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు

చిరునామా : చతురంగం **చతుర**, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

# ఇయ్యాల ఆ పంతులుకు మూడిందే!



'అదేంటయ్యా! కాలి కేమైంది? ఇట్టా కమిలి పోయి బొబ్బెక్కిందేంటి?' కంగారు పడుతూ అడిగాడు కొడుకును రంగయ్య.

'మా ఇంగ్లీషు మాస్టారు కొట్టారు' తండ్రి దగ్గర ఆ విషయం దాచిపెడదామని ఎంత ప్రయత్నించినా చెప్పక తప్పలేదు శీనుకు.

'ఆడు ముదలార! పశు వుల్ని కొట్టినట్లు పిల్లాడ్ని కొట్ట డానికి ఆడికి చేతులెట్టా వచ్చినయ్? ఆడి చేతికి జెట్ట పుట్టా! ఆడి దెవసం చెయ్య, ముదనష్టపాడు..' తిట్లదండకమందుకుంది శీను అక్క.

'ఏంటీ! పంతులు కొట్టాడా? ఆడు మనిషా, పశువా? ఆడెక్కడుంటాడో చూపించు, పద, ఇయ్యాల ఆడికి మూడిందే!' అని కర్ర తీసుకుని శీనును తనతో లాక్కెళ్లాడు రంగయ్య.

ఆ తర్వాతేమైంది? అసలు పంతులుగారు శీనును ఎందుకొట్టారు? నాడు గ్రామాలలో విద్యపట్ల పంతు ళ్లు, పిల్లల తల్లిదండ్రుల తీరు తెన్నులను కళ్లకు క డుతూ ఆద్యంతం ఆసక్తిగా సాగే అక్కినేని కుటుంబరావు నవల తొలి అడుగులు

చతుర మే కానుక!

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

